భారతీయ శంఖారావం-3











# శ్రీకృష్ణగీత

కృష్ణావతారంపై అద్భుత విశ్లేషణ

పోలిశెట్టి బ్రదర్స్

ఓం విఘ్నేశ్వరాయ నమః





మానవ జీవనానికి అద్దంపడుతున్న

ఆధ్యాత్మిక విజ్ఞాన తరంగం

# "శ్రీకృష్ణగీత"

- పోలిశెట్టి బ్రదర్స్.



ఇది భగవద్గీత కాదు.

శ్రీకృష్ణుడు తన మొత్తం జీవితం ద్వారా మనకిస్తున్న సందేశాల సారం.

పాఠకులకు ఆణిముత్యాల హారం.



"శ్రీకృష్ణగీత"

- పోలిశెట్టి బ్రదర్స్.





వెల : రు. 40/-



ప్రతులకు :
**పోలిశెట్టి బ్రదర్స్,**
**17-3-6, గౌరీ కోనేరు వద్ద,**
**పెద్దాపురం - 533 437.**
**తూర్పుగోదావరి జిల్లా (ఆంధ్రప్రదేశ్)**
**ఫోన్: (08858) 41495.**

టైప్ సెట్టింగ్:
శ్రీసాయి గ్రాఫిక్స్,
సామర్లకోట. ఫోన్: (0884) 27150.

# శ్రీ వివేకానందా పబ్లికేషన్స్,

17-3-6, గౌరీకోనేరు వద్ద, పెద్దాపురం - 533 437. (ఆంధ్రప్రదేశ్)
ఫోన్ : (08858) 41495.



# రచయితల పలకరింపు

పాఠకులకు నమస్కారం!

'భారతీయ శంఖారావం' సీరీస్‌లోని మొదటి పుస్తకం "పురాణాల్లో సైన్స్", రెండవ పుస్తకం "హైందవ కాలమానం (జనవరి ఫస్ట్ Vs ఉగాది)" పునర్ముద్రణలు పొందుతూ మీ అభిమానాన్ని చూరగొంటున్నాయి, సంతోషం. భారతీయ సంస్కృతి ప్రతిభను నలుదిశలా చాటాలనే మా ఆశయం సఫలమౌతోంది. మీరిచ్చిన స్ఫూర్తితో మూడవ గ్రంథంగా ఇప్పుడు "శ్రీకృష్ణగీత"ను అందిస్తున్నాం.

శ్రీకృష్ణుని మొత్తం జీవితంపై సాగిన విశ్లేషణ ఇది. విశ్లేషణకు అవసరమైనంత వరకే ఇందులో శ్రీకృష్ణగాథను వివరించాం. కృష్ణచరిత్ర సరిగా తెలియని వారికి కూడా అర్థమయ్యేరీతిన, రచన సాగించే కృషి చేశాం. అయినా భారత, భాగవతాల్లోని శ్రీకృష్ణ చరిత్రను పూర్తిగా తెలుసుకోవడం మంచిది. అప్పుడయితే మా 'శ్రీకృష్ణగీత' లోని మధురామృతాన్ని పూర్తిగా ఆస్వాదించగలుగుతారు.

ఈ చిరుగ్రంథం చదివిన తర్వాత, మీ స్పందనలను ఈ క్రింది చిరునామాకు తెలియజేయండి.

సర్వదా శ్రీకృష్ణపరమాత్మ మీకు సకల శుభాలను కల్గించాలని ఆకాంక్షిస్తూ...

మీ సోదరులు,

**పోలిశెట్టి బ్రదర్స్.**

మా చిరునామా:

**పోలిశెట్టి బ్రదర్స్,**

**17-3-6, గౌరీ కోనేరు వద్ద,**

**పెద్దాపురం - 533 437.**

**తూర్పుగోదావరి జిల్లా (ఆంధ్రప్రదేశ్)**

**ఫోన్: (08858) 41495.**



## ✿ ముదావహం ✿

ఇతిహాస మహాపురుషుడైన శ్రీకృష్ణునిపై ఇంతవరకూ అనేక గ్రంథాలు వచ్చాయి. వాటన్నింటిలోనూ కృష్ణావతార ఔన్నత్యాన్నీ, మహిమలనూ కీర్తించడం మాత్రమే కన్పిస్తుంది. మానవాళికి శ్రీకృష్ణుడు అందించిన సందేశం - 'భగవద్గీత' ఒకటేననే భావన ప్రజల్లో వుంది. శ్రీకృష్ణుని మొత్తం జీవితం-మానవాళికి సందేశమనీ, ఆయన జీవిత కాలంలోని ప్రతి చేష్టకూ ఒక అంతరార్థం ఉందనీ -ఈ "శ్రీకృష్ణగీత" పుస్తకం ద్వారా నిరూపిస్తున్నారు శ్రీ పోలిశెట్టి బ్రదర్స్. నభూతో నభవిష్యతిగా ఉంది రచన. పుస్తకం చదివిన తర్వాత, మీరు కూడా నా మాటను అంగీకరిస్తారు.

భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞాన గౌరవాన్ని ఇనుమడింపజేసే ఇలాంటి పుస్తకాలు భవిష్యత్తులో మరిన్ని రావాలి. శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ ప్రాచీన భారతీయ విజ్ఞానాన్ని వెలుగులోకి తెస్తున్న తీరు, బహుదా ప్రశంసనీయం. వారికి ఆ కృష్ణపరమాత్ముని ఆశీస్సులు ఎల్లవేళలా ఉండాలని మనసారా కోరుకుంటున్నాను.

"వాసుదేవాయనమః"

- కళా విశ్వనాథశర్మ,
సెక్రటరీ,
విశ్వహిందూ పరిషత్,
రంగంపేట శాఖ, తూ. గో. జిల్లా.

# ప్రచురణకర్త మీతో...



డాక్టర్ పి. సువర్ణలత,
సింగపూర్.

పాఠకులకు నమస్కారం!

కృష్ణపరమాత్మ నుండి భక్తులు అందుకున్నది "భగవద్గీత". భారతీయ శంఖారావం నుండి పాఠకులు అందుకుంటున్నది "శ్రీకృష్ణగీత". ఈ గ్రంథ ప్రచురణ, నా చేతుల మీదుగా జరగడం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను.

ఈ చిరుగ్రంథం మీకు అనేక విషయాల్ని సులభరీతిలో వివరిస్తుంది. "భగవంతుడు అవతారాలెత్తేది ఎందుకు? భూమిపై అవతరించిన భగవంతునికి కష్టాలొస్తాయా? భగవంతునికి భార్యలుంటారా? ఆయన సంసారం చేస్తాడా? భగవంతునికి కులం ఉంటుందా? ధర్మస్థాపన కోసం యుగానికో రకంగా భగవంతుడు అనుసరిస్తున్న విధానాలేమిటి? భగవంతుడు మననుండి కోరుకునేదేమిటి? భగవంతునికి మనం అర్పించవలసిందేమిటి? కర్మఫలం, భక్తిఫలాల్లో దేని పాత్ర ఎంతెంత? మనకు దేవుడెంతవరకూ సహాయపడతాడు? " ఇటువంటి ఎన్నో ఆసక్తికరమైన ప్రశ్నలకు జవాబుల్ని అందిస్తుంది ఈ "శ్రీకృష్ణగీత".

శ్రీకృష్ణతత్వం మనదేశంలో కంటే ఇతర దేశాల్లోనే వేగంగా గుర్తించబడుతోంది. సంవత్సరాల తరబడి పరాయి పాలనలో మ్రగ్గిన మన భారతీయులకు భక్తితత్వం కంటే, బానిసతత్వమే ఎక్కువౌతోంది. ఈ పరిస్థితి మారాలి. అందుకు మన పురాణ, ఇతిహాస మహాపురుషుల దివ్యచరిత్రల్ని ఆదర్శంగా తీసుకుని, మనం ఉద్యమించవలసిన సమయం ఆసన్నమయింది. విదేశాల్లో భారతీయ తత్వ విశిష్టతకు మరింత గుర్తింపు తీసుకొచ్చే కృషిని ప్రవాసభారతీయులం సాగిస్తూనే ఉన్నాం. స్వదేశంలో నివసిస్తున్న మీరు కూడా దేశీయ సంస్కృతిని రక్షించండి. అదే మా కోరిక!

మీ సహోదరి,

P. S. Latha



# ❁ మాతృదేవతకు అంకితం ❁



శ్రీమతి పోలిశెట్టి విజయలక్ష్మి గారు

అమ్మా!

భారతీయ శంఖారావం ప్రచురణలకు స్ఫూర్తినిచ్చిన నీకు ఈ "శ్రీకృష్ణగీత" అంకితం. నీ ఆశయాలే మమ్మల్ని ధర్మపథాన నడిపిస్తున్నాయి. సదా నీ యొక్క అమృత ఆశీర్వచనాల్ని కోరుకుంటూ...



ప్రేమాభిమానాలతో
- మీ కుమారులు,
**రఘు, వేణు.**
(పోలిశెట్టి బ్రదర్స్)



# ★ విషయ సూచిక ★

| విషయం | పేజీ సంఖ్య |
|---|---|




# శ్రీకృష్ణ గీత

మహాభారతాన్ని 'పంచమవేదం' అంటారు. ఎందువల్లనంటే చతుర్వేదాల్లో గల ధార్మిక, వైజ్ఞానిక విశేషాలను మహాభారతంలో కలబోసి అందించాడు వ్యాస మహర్షి. మిగిలిన వేదాంత జ్ఞానాన్ని 'భగవద్గీత' రూపంలో మహాభారతం చివరన అందించాడాయన. భగవద్గీతను అందించినవాడు వ్యాసుడే అయినా, ఆ గీతా బోధ చేసినవాడు శ్రీకృష్ణ భగవానుడే!

ఇంతకూ "గీత" అంటే ఏమిటి?

ఏదైనా విషయంపై ఒకరు మరొకరికి చేసిన ఉపదేశాన్ని గానీ, ఇచ్చిన వివరణను గానీ 'గీత' అని చెప్పవచ్చు సూక్ష్మంగా. ఆ గీతను ఎవరు బోధిస్తే, దాన్ని వారి పేరుతో పిలుస్తారు. మహాభారతంలో "పరాశరగీత, బ్రహ్మగీత, హారీత గీత, హంసగీత..." ఇలా ఎన్నో గీతలు కనిపిస్తాయి. భాగవతంలో "గోపికాగీతలు" కూడా వున్నాయి. సాక్షాత్తూ భగవంతుడే చెప్పిన గీత "భగవద్గీత". ఉపనిషత్తుల సారాంశం అది.

శ్రీకృష్ణుడు ఏదయినా చెప్పడమేకాదు. ఆచరించి చూపేవాడు. మహాభారతం భీష్మపర్వంలో, కేవలం గీతాబోధ సమయంలో మాత్రమే యీ ధర్మబోధ చేశాడనుకుంటే పొరబాటే అవుతుంది. ఆయన పుడుతూనే ధర్మబోధ ఆరంభించాడు. తన జీవితం పొడవునా నోటితో చెప్పకనే, తన జీవితంలోని ఎన్నో సంఘటనలద్వారా ధర్మబోధ చేస్తూనే వచ్చాడు. కానీ ఆత్మజ్ఞానం పరిపక్వంకాని మనవంటి సాధారణ జీవులకు

వాటిలోని బాహ్యార్థమేగాని, అంతరార్థం అంత త్వరగా తెలియరాదు.

ప్రస్తుతం మీరు చదవబోతున్న ఈ "శ్రీకృష్ణగీత" భగవద్గీత కాదు. సరిక్రొత్త కోణంలో అందించబడుతున్న శ్రీకృష్ణుని జీవన ఘట్టాల విశ్లేషణ. పుట్టుక నుండి అవతార సమాప్తి వరకూ ఆయన తన చేతలతో మనకెన్నో జ్ఞానోపదేశాలను చేస్తూ వచ్చాడు. మానవాళికి అత్యంత ఉపయుక్తమైన ఆ ఉపదేశాల అంతరార్థాల వివరణయే - "శ్రీకృష్ణగీత".

❦ ❦ ❦

## ★ అవతారం అంటే ఏమిటి? ★

దైవశక్తిలోని చిరు అంశలతో ప్రాణశక్తిని పొంది, జీవులు జన్మలనెత్తుతుంటాయి. కొన్ని అత్యవసర పరిస్థితుల్లో, దైవశక్తిలోని హెచ్చు అంశలతో కలుగుతాయి కొన్ని జన్మలు. అవే "అవతారాలు". చిరు దైవశక్తిగల జీవుల్ని వర్షపు చినుకులుగా పోలిస్తే, అవతారాల్ని వడగళ్ళవలె భావించవచ్చు.

❦ ❦ ❦

## ★ అవతారాలు దాల్చేది ఎందుకు? ★

క్రమం తప్పుతున్న సృష్టిని సరిజేసేందుకు దిగివస్తాయి అవతారాలు. అవతారాలనేవి దుష్టశిక్షణ, శిష్టరక్షణల కోసమేనని చెప్తుంటారు చాలామంది. అవతారాల లక్ష్యం కేవలం అదే అయితే - మహావిష్ణువు మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ అవతారాల మాదిరిగానే తన మిగిలిన అవతారాల్లో కూడా దుష్టుల్ని చంపేసిన వెంటనే, అవతారాల్ని చాలించవచ్చు కదా! ఎన్నో సంవత్సరాలు పరశురామునిగా, శ్రీరామునిగా, శ్రీకృష్ణునిగా జీవించడం... ఎన్నో బాధలు, కష్టాలు, సుఖాలు అనుభవించడం ఇవన్నీ యెందుకు? దీనంతకూ ఓ అంతరార్థం ఉంది. సాధారణ ప్రజానీకానికి కొన్ని ఆదర్శాలనూ, విలువలనూ చూపించేందుకు 'దైవాంశలు' జన్మలనెత్తుతూ వుంటాయి. మనకెన్నో గుణపాఠాల్ని అందిస్తూ ఉంటాయి. ధర్మ, అధర్మ విచక్షణల్ని నేర్పిస్తూ ఉంటాయి. జీవిత విధాన రీతుల్ని ప్రబోధిస్తూ ఉంటాయి. అధర్మాన్ని అణచి, ధర్మాన్ని ఎలా రక్షించాలో తెలియజేస్తూ ఉంటాయి. అవతారాల

పరమార్థం ఇదే! ఈ పరమార్థాన్ని జీవులకు అందించడం కోసం అవతారాలు అనేక విధాలుగా నటిస్తాయి. మనకు వివిధ రకాల గుణపాఠాల్ని నేర్పేందుకు పలువిధాలుగా ప్రవర్తిస్తాయి. అవతారాలు అనుభవించే కష్టసుఖాలన్నీ మిథ్య అని గమనించండి. ఆ నాటకాలన్నీ మనకోసమే!

## ★ పాపభారాన్ని తొలగించే భగవంతుడు ★

మితం అనేది ఎల్లవేళలా అన్నింటిలోనూ అవసరమే! మితిమీరిన దాన్ని తగ్గించుకోవడం సర్వదా శ్రేయోదాయకం. ఈ నియమాన్ని ప్రకృతి ఎప్పుడూ పాటిస్తూనే ఉంటుంది. అందువల్లనే సృష్టిలో ఎప్పుడూ కూడా 'పెరుగుట విరుగుట కొరకే' అనేది అక్షరాలా నిజమౌతూ ఉంటుంది.

భూమిపై పాపభారం పెరిగితే, దాన్ని తగ్గించే బాధ్యత కేవలం భగవంతునిదే! దానికోసం ఆయన అనేక మార్గాల్ని అనుసరిస్తూ ఉంటాడు. అవతారాల్ని దాల్చడం ద్వారా, ప్రకృతి ఉత్పాతాలను సృష్టించడం ద్వారా, యుద్ధాలు - రోగాలు మొదలైన వాటిని రప్పించడం ద్వారా... ఇలా అనేక విధాల పాపభారాన్ని తగ్గిస్తూ వుంటాడు. (ఆయన ఎవరినెలా శిక్షించినా, వారి వారి కర్మఫలాలను బట్టే జరుగుతుందని మనం మరువకూడదు.)

శరీరంలో ఒక అవయవం కుళ్ళిపోతే, ఆ అవయవాన్ని తొలగించి, మిగిలిన శరీరాన్ని రక్షిస్తారు వైద్యులు. ఆ విధంగానే భూమిపై క్రౌర్యం, స్వార్థం, అరాచకాలు పెరిగినప్పుడు, తొలగించవలసిన జనాభాను ఏదొక కారణంతో తొలగించి - భూభారం తగ్గిస్తుంటాడు భగవంతుడు.

ద్వాపర యుగం చివరిలో పెరిగిన పాపభారాన్ని నశింపజేసేందుక మహావిష్ణువు శ్రీకృష్ణునిగా అవతరించాడు. తనతోపాటూ వివిధ దేవతాంశలు, రాక్షసాంశలూ పుట్టే ఏర్పాటు చేశాడు. పాపాత్ములెందరినో అంతమొందించాడు. యుగాంతంలో కురుక్షేత్ర యుద్ధం నడిపించి, భూమిపై పాపభారాన్ని మరింత తగ్గించాడు.

శ్రీకృష్ణుడు అలా చేయడం వల్లనే కలియుగారంభంలో పరీక్షిత్తు మహారాజు (పాండవుల మనుమడు) కలిపురుషుణ్ణి తరిమేసి, కొంతకాలం ధర్మస్థాపన చేయగలిగాడు.

కురుక్షేత్ర యుద్ధం జరిపించినందుక శ్రీకృష్ణుని అపార్థం చేసుకుని మాట్లాడతారు కొంతమంది. ఒక రచయిత తన వ్యాసంలో "శ్రీకృష్ణుడు రక్తపిపాసి అనీ, అందుకే 18 అక్షౌహిణీల సేనను చంపించి తన రక్త దాహాన్ని తీర్చుకున్నాడనీ" పిచ్చిపిచ్చిగా వ్రాసుకొచ్చాడు. ఇలా అవగాహనాలేమితో తప్పుడు కూతలు కూసేవాళ్ళు నేడెందరో ఉన్నారు. వారి విమర్శల గురించి కాస్త చర్చిద్దాం. 'కృష్ణుడు మానవుడా? దేవుడా?' అనే విషయాన్ని ముందుగా చూడాలి మనం. ఆయన మామూలు మానవుడే అయివుంటే, కురుక్షేత్ర యుద్ధంలోని దారుణాలకు ఆయన బాధ్యత లేదు. పైగా యుద్ధాన్ని ఆపాలని, సంధి ప్రయత్నాలు కూడా చేశాడు. ఒక సాధారణ మానవుడు అంతకంటే ఏం చేయగలడు మరి? శ్రీకృష్ణుణ్ణి భగవంతుడని అనుకున్నామనుకోండి. పాపభారం తగ్గించవలసిన బాధ్యత తప్పకుండా ఆయనిదే కదా మరి। ఆ బాధ్యతను ఎలా నెరవేర్చుకున్నదీ ఇంతకు ముందే తెలుసుకున్నాం. (కేవలం కురుక్షేత్ర యుద్ధంవల్లనే భూమికి పాప భారం తగ్గిందని చాలా మంది భావిస్తుంటారు. అయితే అది పొరబాటు. కురుక్షేత్ర యుద్ధంవల్ల కేవలం 18 అక్షౌహిణీల సేన మాత్రమే నశించింది. అంతకు ముందు జరిగిన యుద్ధాల్లో శ్రీకృష్ణ బలరాములు అనేక వందల అక్షౌహిణీల సేనను అంతం చేశారు. ఆ విధంగా ఎంతో మంది పాపాత్ముల్ని అంతమొందించి, ద్వాపరయుగాన పెరిగిన పాపభారాన్ని తగ్గించారు.)

శ్రీకృష్ణుడు దేవుడేనని ఒప్పుకుంటే, ఆయన సర్వాంతర్యామియేకదా। అంటే చంపేదీ ఆయనే। చచ్చేదీ ఆయనే। ఆ మాట ఆయనే స్వయంగా చెప్పాడు కూడా। పాప పంకిలమైన తనలోని కొన్ని పరమాణువుల్ని ఆయన తనకు తానే తొలగించు కున్నాడన్నమాట. ఇదొక ఆపరేషన్ వంటిదని మనం గ్రహించాలి. (ద్వాపర యుగాన జరిగిన దుష్ట సంహారం, జాతికి జరిగిన ఒక ఆపరేషన్ అన్న మాట) 'అయితే దానికోసం ఇంత కథ నడపాలా?' అని కొందరికి సందేహం కలగవచ్చు. అంత కథ నడపడంవల్లనే మానవజాతికి ఎన్నో ధర్మాలు, నీతులు, పాఠాలూ అందించబడ్డాయి. ఏది మంచి? ఏది చెడు? దేని ఫలితం ఎలా ఉంటుందనేది వివరించబడింది. ఏది ఏమయినా చిట్ట చివరకు ధర్మమే జయిస్తుందని, తన లీలల ద్వారా నిరూపించి చూపాడు శ్రీకృష్ణ పరమాత్మ.

## ★ నియమాన్ని పాటించే భగవంతుడు ★

అవతారమెత్తి భువికి దిగినంత మాత్రాన అన్ని పనుల్నీ భగవంతుడే స్వయంగా చక్క బెడతాడని అనుకోకండి. కొన్ని తాను చేస్తాడు. కొన్ని చేయిస్తాడు. విధి విధానాన్ని అనుసరించి అలా ప్రవర్తిస్తాడాయన. ఇక్కడ మరో చిత్రమేమిటంటే, ఆ విధి విధానాన్ని ఏర్పరచిందీ ఆయనే! ఆయన తలచుకుంటే దాన్ని క్షణాల్లో మార్చేసి, తనకు నచ్చిన మరో విధంగా కూడా చేయగలడు. కానీ అలా చేయడు. తాను ఏర్పరచిన విధానాన్ని మళ్ళీ తానే మార్చుకుంటూ పోతుంటే, ఇక మనబోటి సామాన్యులకు ఆదర్శం ఏముంటుంది? అందుకే ఆయన తాను ముందుగా ఏర్పరచుకున్న నియమాన్ని ఎన్నడూ ఉల్లంఘించడు. తాను సర్వసమర్థుడై ఉండి కూడా (ధర్మబద్ధంగా) ఒకే సిద్ధాంత రీత్యా ఎప్పుడూ వ్యవహరిస్తాడు. (అదే మన సంగతయితే వేరే చెప్పాలా? అధికారం మనదయితే అన్ని సిద్ధాంతాల్నీ తుంగలో త్రొక్కేస్తాం. భగవంతునికీ, మనకీ తేడా అదే!) ఈ సందర్భంలో భగవంతుని తత్వాన్ని అర్థం చేసుకోలేని అభాగ్యులు - "భగవంతుడు కొన్నిసార్లు చేతకానివాడౌతుంటాడని" విమర్శిస్తూ కాలం గడుపుతుంటారు.

శ్రీకృష్ణుడు ఏ దుర్మార్గుణ్ణయినా స్వయంగా వధించదలచుకుంటే, అది క్షణాల్లో పని! అయితే విధివిధాన రూపకల్పనలో కొన్ని శిక్షల్ని తాను స్వయంగా వేయడు. మరొకరి చేత వేయిస్తాడు. అన్ని పనుల్నీ స్వయంగా తనే చేయడనీ, కొన్ని చేయిస్తాడనీ ముందే చెప్పుకున్నాం కదా! ఈ విషయం తెలుసుకోలేని వారు - కృష్ణుడు కొన్ని సందర్భాల్లో శక్తిహీనుడయ్యాడనీ, అందువల్లనే కొందరిని అంతం చేయడంలో మరొకరిని ప్రయోగించేవాడనీ భ్రమ పడుతూ ఉంటారు. అటువంటి వారికి కనువిప్పు కలగడం కోసం కొన్ని సందర్భాల నిజానిజాల్నీ, అంతరార్థాల్నీ మనం తెలుసుకోవలసి వుంది.

శ్రీకృష్ణుడు స్వయంగా తన శక్తిని ప్రకటించిన అంశాల్ని ముందుగా చూద్దాం. చంటిపాపగా ఉన్నప్పుడే అనేకమంది భయంకర రాక్షసుల్ని వధించాడు. పెద్దయ్యాకా మహా బలవంతుడైన కంసుణ్ణి చంపాడు. రుక్మి, జాంబవంతుల్ని పరాజితుల్ని చేశాడు. వరుణుణ్ణీ, ఇంద్రుణ్ణీ కూడా ఓడించాడు. నరకాసురుణ్ణీ, పౌండ్రకుణ్ణీ, శిశుపాలుణ్ణీ, ఏకలవ్యుణ్ణీ, సాల్వుణ్ణీ, దంతవక్రుణ్ణీ, విధూరథుణ్ణీ అంత మొందించాడు. బాణాసురుణ్ణి చావగొట్టి వదిలాడు. (ఆ సందర్భంలో సాక్షాత్తూ శివునితో పోరాడాడు.) జరాసంధుణ్ణి

17 సార్లు ఓడించాడు. అనేక యుద్ధాల్లో కొన్ని వందల అక్షౌహిణీల సైన్యాన్ని హతమార్చాడు.

శ్రీకృష్ణుడు మహాయోధుడని పై సంఘటనలన్నీ చెప్తున్నాయి. అయితే ఏయే సందర్భాల్లో సామాన్య జనం శ్రీకృష్ణుని అపార్థం చేసుకుంటున్నారో, వాటి సంగతి చూద్దాం ఈసారి.

శ్రీకృష్ణుడు నరకాసురునితో యుద్ధం చేస్తూ మూర్ఛపోయాడనీ, అప్పుడు సత్యభామ అడ్డుపడి యుద్ధం చేయకపోతే కృష్ణుడు ఓడిపోయి ఉండేవాడనీ, చివరకు నరకుణ్ణి చంపింది కూడా ఆమెయేననీ - ఒక కట్టుకథ బాగా ప్రచారంలో ఉంది. ఇదే నిజమని నమ్మేవారు నేడెందరో ఉన్నారు. యథార్థానికి ఇదంతా ఏ ఆధారమూ లేని అభూత కల్పన! భాగవతంలో ఎక్కడా లేని విషయాలివి. (మన పురాణేతిహాసాలకు వచ్చిన ఇబ్బంది ఇదే! యథార్థంగా ఉన్న విషయం ఒకటయితే, కాలగమనంలో ఎవరెవరో కొంతమంది కవులు ఏదొకటి వ్రాసి వాటిలో ఇరికించేస్తున్నారు. మంచినీ, ధర్మాన్నీ నిలబెట్టేందుకు - క్రొత్తగా కల్పించి చేర్చినా పరవాలేదు. ఉన్న యథార్థాల్ని మార్చేసి, అసలుకే ఎసరు పెట్టే కల్పనలు మన సంస్కృతికే చేటు. ప్రస్తుత జనావళికి ఏది యథార్థమో, ఏది కల్పనో తెలియడం లేదు. కల్పిత పురాణకథలే నేడు చాలా మందికి గుర్తుంటున్నాయి. ఈ దురదృష్టం వల్ల కొంతా, యథార్థ అంతరార్థాలు తెలియక కొంతా - పురాణ గాథలపై అపహాస్య భావం పెరుగుతోంది. ఇది మన సంస్కృతికెంతో హానికరమైన పరిస్థితి. ఇకనైనా మనం దీన్ని చక్కదిద్దుకోవాలి.) శ్రీకృష్ణుడు మూర్ఛపోవడం అనే సంఘటన ఏ పురాణంలోనూ లేదు. యుద్ధం చేస్తానని ముచ్చటపడిన సత్యభామకు, సరదాగా ఓ ఛాన్స్ ఇచ్చాడంతే! ఆ తర్వాత మళ్ళీ తానే యుద్ధం చేసి, నరకాసురుణ్ణి వధించాడు. ఈ యథార్థాన్ని మహాభాగవతం స్పష్టంగా చెప్తోంది.

నరకాసురుని వధలోని యథార్థాన్ని తెలుసుకుందాం, రండి.

## ★ నరకాసుర వధ ★

నరకాసురుడనే రాక్షసుడు ప్రాగ్జ్యోతిష పురానికి రాజు. వాడు చాలా దుర్మార్గుడు.

అతని సైనికులైన రాక్షసులు క్రూరులై, ప్రజలందరినీ పలువిధాల పీడించేవారు. 16వేల మంది రాజ కన్యల్ని తెచ్చి, ఖైదులో బంధించాడు నరకాసురుడు. వాణ్ణి యెవరూ ఏమీ చేయలేక పోయేవారు. నరకాసురుని చంపి తమను రక్షించమని ప్రజలు శ్రీకృష్ణుని ప్రార్థించారు. అప్పుడు శ్రీకృష్ణుడు నరకునిపైకి యుద్ధానికి వెళ్ళాడు. సత్యభామ కూడా శ్రీకృష్ణుని వెంట వెళ్ళింది అప్పుడు జరిగిన యుద్ధంలో శ్రీకృష్ణుని వద్ద విల్లు తీసుకుని సత్యభామ తన యుద్ధ ప్రావీణ్యతను చూపించింది. "మగవాడివి నువ్వుండగా ఆడవారితో మాకు యుద్ధమా? " అన్నాడు నరకాసురుడు. "సరే, అలాగే కానివ్వు" అంటూ శ్రీకృష్ణుడు యుద్ధానికి దిగాడు. గొప్ప పోరాటం జరిగింది. శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రంతో నరకాసురుని శిరస్సు ఖండించాడు. భాగవతం చెప్తున్న యథార్థగాథ ఇది.

ఏనాడూ ఏయుద్ధానికీ స్త్రీలను వెంట తీసుకువెళ్ళని శ్రీకృష్ణుడు ఈ యుద్ధానికి సత్యభామను తీసుకువెళ్ళాడు. అందుకు కొన్ని కారణాలున్నాయి. వాటి గురించి తెలుసుకుందాం.

శ్రీకృష్ణుడు సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువు యొక్క అంశ.

శ్రీమహాలక్ష్మి, భూదేవిల అంశ 'సత్యభామ'.

శ్రీ మహావిష్ణువు వరాహావతారం ఎత్తినప్పుడు ఆయనకీ, భూదేవికీ పుట్టిన వాడే నరకాసురుడు. అంటే విష్ణు, భూదేవిల అంశలతో అవతరించిన శ్రీకృష్ణ, సత్యభామలకు నరకాసురుడు పుత్రుడే అవుతాడు అయితే వాడు దుర్మార్గుడు. వాణ్ణి చంపి తమను రక్షించమని ప్రజలంతా ప్రార్థిస్తున్నారు. ఇది శ్రీకృష్ణుడికి ధర్మ సంకటం. కుమారుడు కదా అని విడిచిపెట్టాలా? వాణ్ణి చంపి ధర్మసంరక్షణ చేయాలా? పరమాత్ముడు కనుక ధర్మరక్షణకే ముందుకురికాడు. ఈ నాటి రాజకీయనాయకులకు, పెద్దలకూ ఇది ముఖ్యమైన పాఠం. తమ కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు నేరాలు చేసినప్పుడు ఈ పెద్దలంతా నేడేమి చేస్తున్నారో, మనకు తెలిసిందే కదా! అంతెందుకు? సాధారణంగా మనమంతా స్వార్థానికే ముందు విలువిస్తాం. భగవంతునికీ మనకూ ఉన్న తేడా అదే మరి!

లోక కళ్యాణం కోసం దుర్మార్గుడైన పుత్రుణ్ణి వదులుకోడానికి శ్రీకృష్ణుడు, సత్యభామ సిద్ధపడ్డారు. శ్రీకృష్ణుణ్ణి ఒప్పించి, సత్యభామ తానూ యుద్ధానికి బయలుదేరింది. నరకుడితో భీషణ సంగ్రామం సాగించింది కూడా! అనంతర యుద్ధంలో శ్రీకృష్ణుడు నరకాసురుని తలను, తన సుదర్శనచక్రంతో నరికేశాడు.

ధర్మాన్ని రక్షించడం కోసం తన, పర భేదాల్ని చూపించకూడదని ఈ సంఘటన ద్వారా నిరూపిస్తున్నారు సత్యభామా శ్రీకృష్ణులు.

## ★ కాలయవనుని వధ ★

కాలయవనుని వధ విషయంలో కూడా శ్రీకృష్ణుణ్ణి అపార్థం చేసుకునేవారున్నారు. ఆ విషయంలో అసలు సంగతిని తెలుసుకుందాం ఇప్పుడు.

గ్రీకు దేశం నుండి శ్రీకృష్ణునిపై దండెత్తివచ్చిన ఒక రాజే కాలయవనుడు.

అలెగ్జాండరు, సెల్యూకస్‌ల కంటే ముందే (అంటే క్రీ.పూ. 3 వేల సంవత్సరాల క్రితం) మన భరతఖండంపై దండెత్తిన మొదటి గ్రీకురాజు ఇతను.

శ్రీకృష్ణభగవానుని ద్వారా అంతమొందాడు కాలయవనుడు.

అనంతరకాలంలో మనదేశంపై దండెత్తిన అలెగ్జాండరు, మన పురుషోత్తముని చేతిలో పరాజితుడై వెనక్కి మళ్ళాడు. (కానీ అలెగ్జాండరు గెలిచినట్లుగా చరిత్రను తారుమారు చేసి వ్రాసి పెట్టారు తెల్లదొరలు.) ఆ తర్వాత సెల్యూకస్ అనే గ్రీకు రాజు వచ్చి, మన చంద్రగుప్తుని చేతిలో చావుదెబ్బలు తిని పారిపోయాడు. ఇంతజరిగినా కూడా ఆ గ్రీకువాళ్ళెంతో మహావీరులని భ్రమపడుతుంటారు మనవాళ్ళు కొంతమంది.

సరే, అదలా ఉంచి... కాలయవనుని విషయానికొద్దాం. నిజానికి కాలయవనుడు గ్రీకువాడేం కాదు. హిందువే! అతని గత చరిత్రను సూక్ష్మంగా తెలుసుకుందాం.

పూర్వం ఒకప్పుడు యాదవులు మదోన్మాదంతో తమ కులగురువైన గర్గుని అవమానించారు. అతనికి కోపం వచ్చింది. యాదవులను యుద్ధంలో ఓడించగల కుమారుడు కావాలని శివుణ్ణి ప్రార్థించాడు. శివుడు అతన్ని అనుగ్రహించాడు. గర్గునికి, ఒక అప్సరసకూ కాలుడనే బిడ్డ పుట్టాడు.

సంతానం లేని ఒక గ్రీకు రాజు, ఆ కాలుణ్ణి దత్తతకు తీసుకున్నాడు. గ్రీకుల్ని 'యవనులు' అని కూడా అంటారు కదా! అందువల్లనే అప్పటినుండి కాలుడు కాలయవనుడయ్యాడు. అనంతరకాలంలో తన పెంపుడు తండ్రి రాజ్యానికి రాజయ్యాడు. వాడు తన పరాక్రమంతో, విపరీతంగా రాజ్య విస్తరణ చేయసాగాడు. అతని

కండకావరానికి అంతులేకుండా పోయింది. వీరుడన్న ప్రతివాణ్ణీ వెదికి వెదికి లోబరచుకోవడం లేదా సంహరించడం చేసేవాడు. నారదుని ద్వారా అతను శ్రీకృష్ణుని పరాక్రమాన్ని గురించి విన్నాడు. శ్రీకృష్ణునితో యుద్ధం చేయాలనే కోరిక అతనిలో పెరిగిపోసాగింది. శ్రీకృష్ణుడంటే మండిపడే జరాసంధునితో స్నేహం కలిపాడు.

శ్రీకృష్ణుని మధురానగరాన్ని ఒకవైపు నుండి జరాసంధుడు ఆక్రమించనుండగా, మరోవైపు నుండి కాలయవనుడు దండెత్తాడు. ఈ విధంగా ఇరువురి ఆక్రమణల్ని ఒకేసారి ఎదుర్కోవలసి వచ్చింది శ్రీకృష్ణుడు. అప్పుడు యుద్ధమే కనుక జరిగితే, కలిగే అనర్థాన్ని ఊహించాడు. తనను నమ్ముకున్న మధురానగరవాసుల్ని రక్షించడం కోసం, మొత్తానికి ప్రజలతో సహా తన రాజ్యాన్ని క్రొత్తగా నిర్మింపజేసిన ద్వారకకు మార్చేశాడు.

కాలయవనుని మరణం శ్రీకృష్ణుని చేతిలో లేదు. శ్రీకృష్ణుడు యాదవ కులంలో పుట్టడమే దానికి కారణం. విధివిధానం ప్రకారం కాలయవనుణ్ణి అంతం చేసే పని, మరో వ్యక్తి చేతిలో పెట్టాడు శ్రీకృష్ణుడు. అందుకే కాలయవనుణ్ణి మెల్లగా ఆ వ్యక్తి దగ్గరకు తీసుకువెళ్ళే పథకం వేశాడు. తానొక్కడూ మధురలో ఉండిపోయి, నిరాయుధునిగా కాలయవనుని ముందుకు వెళ్ళాడు. కాలయవనుడు యుద్ధానికి ఉత్సాహంగా ముందుకురికాడు. అప్పుడు శ్రీకృష్ణుడు పారిపోతున్నట్లుగా నటిస్తూ - అతన్ని గుట్టలూ, మెట్టలూ, కొండలూ దాటించి తీసుకుపోయి ఒక గుహలో ప్రవేశించేలా చేశాడు. శ్రీకృష్ణుడు ఆ గుహలోనే దాగి ఉంటాడని భావించిన కాలయవనుడు, ఆ గుహ అంతా వెదకసాగాడు. గుహలో ఒక మూల గుఱ్ఱుపెడుతూ నిద్రపోతున్న ఒక వ్యక్తిని చూసి, అతను శ్రీకృష్ణుడే అని భావించాడు. 'నాతో యుద్ధానికి లేవరా!' అంటూ అతన్ని తట్టిలేపాడు. కాలితో తన్నాడు. ఆ వ్యక్తి కోపోద్రిక్తుడై లేచి, కాలయవనుణ్ణి చురచురా చూశాడు. అంతే! అతని చూపు వాడికీ, వేడికీ భగ్గున మాడి మసైపోయాడు కాలయవనుడు. ఈ విచిత్రం అర్థం కావాలంటే 'ముచికుందుని గాథ' తెలుసుకోవాలి మనం. కాలయవనుణ్ణి మాడ్చి మసిచేసిన వాడే "ముచికుందుడు". మాంధాత కుమారుడైన ఇతను, దేవదానవ సంగ్రామంలో దేవతలకు చాలాసహాయం చేశాడు. తమకు చేసిన సహాయానికి ప్రతిగా, ఆయన్ని ఏదొకటి కోరుకోమన్నారు దేవతలు. యుద్ధ అలసట తీరేందుకు తనకు సుఖప్రదమైన నిద్రకావాలనీ, తనకు నిద్రాభంగం కలిగించినవాడు తన కంటి చూపుకే మసైపోవాలనీ కోరుకున్నాడు ముచికుందుడు. దేవతలు అతనికి ఆ వరాన్ని ప్రసాదించారు. అందువల్లనే ముచికుందుని చూపుతో

మ సైపోయాడు కాలయవనుడు. దీనంతకూ సూత్రధారి శ్రీకృష్ణుడే! ఆయన మధురకు తిరిగి వచ్చి, కాలయవనుని గ్రీకు సైన్యం మొత్తాన్ని (మూడు కోట్లమందిని) వధించాడు.

కాలయవనుణ్ణి స్వయంగానే చంపాలనుకుంటే, శ్రీకృష్ణుడికి చిటికెలో పని! అయితే కాలయవనుడికి శివుడిచ్చిన వరం ఉంది. ఆ వరానికి భంగం కలగకుండా ఉండేందుకే శ్రీకృష్ణుడు ఈ ఏర్పాటు చేశాడు. భగవంతుడెప్పుడూ తన నియమాలకూ, తానిచ్చే వరాలకూ భంగం కలగనివ్వడు. వాటిని అనుసరిస్తూనే దుర్మార్గుల అంతం చూస్తాడు. విధివిధానం అంటే అదే మరి!

## ★ జరాసంధుని వధ ★

శ్రీకృష్ణుడు జరాసంధుణ్ణి భీముని చేత చంపించాడని మనకు తెలుసు. శ్రీకృష్ణుడు స్వయంగా అతన్ని చంపలేక, అలా చేశాడని కొంతమంది అపోహ పడుతుంటారు. ఆ అపోహను దూరం చేసేందుకు ఈసారి జరాసంధుని గాధను తెలుసుకుందాం.

జరాసంధుడు మగధ మహారాజు. కంసుడికి మామగారు. కంసుని వధించినప్పటి నుండీ శ్రీకృష్ణునిపై పగబట్టాడు జరాసంధుడు.

జరాసంధుని జన్మ విచిత్రమైనది. రెండు అర్ధ శరీరాలతో జన్మించాడతడు. జర అనే రాక్షసి వాటిని సంధించి ఒకటిగా చేసింది. జర అనే ఆమెచే సంధించబడినవాడు కనుక అతను జరాసంధుడనబడ్డాడు. అతని పుట్టుకలోనే కాదు, రావలసిన చావులోనూ మర్మం ఉంది. అతను మామూలుగా చావడు. చిన్నప్పుడు సంధించబడిన అతని శరీరాన్ని మళ్ళీ అలాగే చీల్చేసి, ఆ ఖండాల్ని వ్యతిరేక దిశల్లో పడేస్తేనే మరణిస్తాడు. సవ్యమైన దిశలోగాని పడేస్తే, మళ్ళీ ఆ రెండు ఖండాలూ ఏకమై, జరాసంధుడు బ్రతుకుతాడు. ఈ కారణంగా జరాసంధుణ్ణి ఒక విధమైన మాయావి అని చెప్పవచ్చు. ఇటువంటి మాయావికి మారణకర్తగా భీముణ్ణి నిర్దేశించాడు శ్రీకృష్ణపరమాత్మ.

పాపులను హతమార్చి భూభారం తగ్గించ వచ్చిన శ్రీకృష్ణుడు, తన కర్తవ్య నిర్వహణలో జరాసంధుణ్ణి చాల చక్కగా వాడుకున్నాడు. అదెలా అంటే, గమనించండి. భూగోళమంతటా పాపులు విపరీతంగా వ్యాపించి ఉన్నారు. ఆ పాపులందరినీ హతమార్చాలంటే శ్రీకృష్ణుడు భూగోళమంతా తిరగవలసివుంది. అయితే శ్రీకృష్ణునకు

అటువంటి శ్రమ లేకుండాచేశాడు జరాసంధుడు. శ్రీకృష్ణుని మీదకు దండయాత్రకొస్తూ, దేశ దేశాల్లో పాపం పండిన దుర్మార్గులందర్నీ వెంటేసుకొచ్చేవాడు. వివిధ ప్రదేశాలు తిరగవలసిన ప్రయాస లేకుండా శ్రీకృష్ణబలరాములిద్దరూ యుద్ధానికొచ్చిన పాపాత్ము లందర్నీ ఒకేచోట సులభంగా హతమార్చేవారు. జరాసంధుడు ఓడిపోయి ఒంటరిగా చిక్కేవాడు. అయినా శ్రీకృష్ణబలరాములు వాణ్ణి వదిలేస్తూ "నీకు మరో అవకాశం ఇస్తున్నాం, వెళ్ళిపో! ఇంకా నీ మద్దతుదారులెవరైనా ఉంటే వారిని వెంటేసుకుని మళ్ళీ యుద్ధానికి రా!!" అనేవారు. జరాసంధుడు మళ్ళీ పాపాత్ములందరినీ వెంటేసుకుని యుద్ధానికి వెళ్ళేవాడు, మళ్ళీ పైవిధంగానే జరిగేది. ఈ విధంగా 17 సార్లు శ్రీకృష్ణునిపై దండెత్తి ఓడిపోయాడు జరాసంధుడు. ఒకసారి బలరాముడు జరాసంధుని వధించడానికి చూడగా, "ఎవరి మారణకర్తలు వారికున్నారు, కంగారుపడవద్దు " అంటూ వారించాడు శ్రీకృష్ణుడు. మొత్తం 17 దండయాత్రల్లోనూ కొన్ని కోట్లమంది పాపాత్ముల్ని ఒకేచోట సునాయాసంగా శిక్షించే అవకాశం శ్రీకృష్ణునికి జరాసంధుని మూలంగా కలిగింది. అయితే ఆ యుద్ధ సందర్భాల్లో తన మధురానగరవాసులు అనేక ఇబ్బందులకు గురికావడం గమనించాడు శ్రీకృష్ణుడు. మళ్ళీ 18వ సారి జరాసంధుడు దండెత్తి వస్తున్నాడని కబురు వచ్చింది. కాలయవనుడనే గ్రీకురాజు జరాసంధునితో కలిశాడనీ తెలిసింది. ఈసారి పెద్దయుద్ధం గాని జరిగితే తన ప్రజలు మరింత కష్టపడతారని, మొత్తం జనంతో సహా తన రాజ్యాన్ని మధుర నుండి ద్వారకకు మార్చేశాడు శ్రీకృష్ణుడు. తర్వాత ఆయన మధురకు తిరిగి వచ్చి, కాలయవనుణ్ణి అంతం చేశాడు. అనంతరం శ్రీకృష్ణబలరాములు తమ ధనరాశులను మధుర నుండి ద్వారకకు తీసుకొనిపోతుండగా, జరాసంధుడు 23 అక్షౌహిణీల సేనతో 18వ సారి దండెత్తి వచ్చాడు. అప్పటికి చంపవలసిన పాపాత్ములందరినీ శ్రీకృష్ణబలరాములు చంపేశారు. ఇక జరాసంధుని వధించవలసిన బాధ్యత భీమునిది. ఈ కారణంగా శ్రీకృష్ణబలరాములు 18వ సారి యుద్ధం చేయడం వ్యర్థమని భావించారు. జరాసంధుని బారినుండి తప్పించుకుని, ప్రవర్షణ పర్వతం మీదుగా ద్వారకకు ప్రయాణమయ్యారు. ఆ పర్వతం మీదనే ఎక్కడో శ్రీకృష్ణబలరాములు దాగి ఉన్నారని భావించిన జరాసంధుడు, ఆ పర్వతం మీదున్న అడవి మొత్తానికి నిప్పు పెట్టించాడు. శ్రీకృష్ణబలరాములు మాత్రం క్షేమంగా ద్వారకకు చేరుకున్నారు. వారిద్దరూ మంటల్లో మరణించి ఉంటారని భావించాడు జరాసంధుడు.

మధుర నుండి ద్వారకకు తరలి వెళ్ళడం, 18వ సారి జరాసంధునితో యుద్ధం చేయకుండా పర్వత మార్గం ద్వారా వెళ్ళిపోవడం... ఈ రెండూ శ్రీకృష్ణుడు ఎందుకు చేసినదీ మనం స్పష్టంగా తెలుసుకున్నాం. ఈ అంతరార్థాలు తెలియని కలియుగ మూర్ఖులు కొంతమంది–'జరాసంధుడంటే భయపడి, శ్రీకృష్ణుడు అలా చేశాడని' వాదిస్తూ ఉంటారు. అలాంటివారికి ఇకనైనా జ్ఞానోదయం కలిగితే మంచిది.

ధర్మరాజు రాజసూయ యాగం చేయనున్న సందర్భంలో శ్రీకృష్ణుడు భీముణ్ణీ, అర్జునుణ్ణీ మగధకు (జరాసంధుని రాజ్యానికి) తీసుకువెళ్ళాడు. అక్కడ జరాసంధునికీ, భీమునికీ మల్లయుద్ధం ఏర్పాటుచేశాడు. వారిద్దరూ మహాబలులే! అయితే జరాసంధుని మరణ విషయంలో మర్మం ఉంది. అందుచేత వారిది సమ ఉజ్జీ కాదు. అందువల్లనే శ్రీకృష్ణుడు కల్పించుకుని - జరాసంధుని మరణమర్మాన్ని భీముడికి సూచిస్తూ, ఒక పుల్లను నిలువుగా చీల్చి ఇటొక ముక్కా, అటొక ముక్కా పారవేశాడు. దాని అంతరార్థాన్ని గ్రహించిన భీముడు, జరాసంధుణ్ణి నిలువునా చీల్చి ఆ విధంగా పారవేశాడు. జరాసంధుడు మరణించాడు. జరాసంధ వధ విషయంలో శ్రీకృష్ణుడు మాయోపాయం పన్నాడని భావిస్తారు కొంతమంది. అయితే అది చాలా పొరబాటు. మరణ విషయంలో మర్మాన్ని కలిగి ఉన్న జరాసంధుడు, భీమునికంటే ఒక విధంగా అధికుడే అవుతాడు. అందువల్ల పోరాటానికి సమఉజ్జీ కాదు వారిది. జరాసంధుని మరణ రహస్యాన్ని భీమునికి తెలియజేయడం ద్వారా వారిని సమ ఉజ్జీలుగా చేశాడు శ్రీకృష్ణుడు. అంతేగాని ఇందులో శ్రీకృష్ణుడు చేసిన మాయోపాయం ఏమీ లేదు.

అయితే ఈ సందర్భంగా మనం ఒకమాట చెప్పుకోవలసి ఉంటుంది. చేయవలసిన సమయం వస్తే, శ్రీకృష్ణుడు మాయోపాయం చేస్తాడు. మాయలూ, వరప్రభావాలూగల అధర్మపరుల్నీ, మోసగాళ్ళనూ, టక్కరి వేషగాళ్ళనూ అంతమొందించేందుకు ఆయన మాయోపాయం ప్రయోగిస్తాడు. ముల్లును ముల్లుతోనే తీయడం ఆయన స్పెషాలిటీ! దెబ్బకు దెబ్బ కొట్టడం ఆయన ఫార్మాలిటీ!! ఇందుకు ఓ చక్కని ఉదాహరణ– "సైంధవుని వధ".

❦ ❦ ❦

## ★ సైంధవుని వధ ★

కౌరవుల చెల్లెలు దుస్సల భర్తయే ఈ సైంధవుడు. వావి వరుసలు కూడా

చూడకుండా ద్రౌపదిని చెరబట్టబోయిన నీచుడు. కురుక్షేత్రయుద్ధ సమయాన ఇతని కారణంగానే పద్మవ్యూహంలో అభిమన్యుడు మరణించాడు. తన కొడుకు మరణానికి ప్రతీకారంగా 'సైంధవుణ్ణి ఆ మరునాడు వధించి తీరుతాననీ, అలా చేయలేకపోతే తాను అగ్నిలో పడి ప్రాణత్యాగం చేస్తాననీ' ప్రతిజ్ఞ చేస్తాడు అర్జునుడు. ఆ విషయం తెలిసిన కౌరవులు మరునాటి యుద్ధ సమయాన సైంధవుణ్ణి దాచేశారు. ఆ రోజంతా సైంధవుణ్ణి అలా దాచేస్తే, అర్జునుడికి అగ్నిప్రవేశం తప్పదనీ, దాంతో పాండవులు అధోగతికి లోనౌతారనీ కౌరవులు పథకం వేశారు. యుద్ధరంగమంతా వెదికి చూసినా, అర్జునుడు సైంధవుని ఉనికిని తెలుసుకోలేకపోయాడు. ఒక ప్రక్క సూర్యాస్తమయం కావస్తూంది. సైంధవుడు అర్జునుడి కంటపడకుండా కాపాడుతున్నారు కౌరవులు. వారి టక్కరి పథకాన్ని గమనించాడు శ్రీకృష్ణుడు. వారికి తగిన విధంగా చెయ్యాలని భావించి, తన మాయాశక్తిచే సూర్యబింబాన్ని మరుగుపరచాడు. సూర్యాస్తమయమైందని భావించారంతా. అర్జునుడు అగ్ని ప్రవేశం చేయక తప్పదని సంతోషం పట్టలేకపోయారు కౌరవులు. మహదానందంగా బయటకొచ్చాడు సైంధవుడు. శ్రీకృష్ణుడు తన మాయాశక్తిని ఉపసంహరించాడు. అందరూ చూస్తూండగానే, సూర్యబింబం మళ్ళీ ఎప్పటిలా ప్రకాశించింది. 'ఏమిటీ మాయ? ' అనుకుంటూ కలవరపడ్డారంతా. 'అడుగో సైంధవుడు. వాని తల తెగనరుకు' అని అర్జునుణ్ణి ఆజ్ఞాపించాడు శ్రీకృష్ణుడు. తన బాణంతో సైంధవుని తల నరికాడు అర్జునుడు. అయితే సైంధవుని మరణవిషయంలో ఒక మర్మం ఉంది. మరణానంతరం సైంధవుని శిరస్సు ఎవరి వల్లనైతే భూమిపై పడుతుందో, వారియొక్క శిరస్సు పగిలిపోతుందని, సైంధవుని తండ్రి అయిన వృద్ధక్షేత్రుడు శాపం పెట్టాడు. తన కొడుకును చంపినవాళ్ళు కూడా, వెంటనే మరణించాలని అతని ఉద్దేశం. ఇదంతా శ్రీకృష్ణునికి తెలుసు. కురుక్షేత్రంలో సైంధవుని తల క్రిందపడిందా, వెనువెంటనే అర్జునుడి తల పగిలిపోయిఉండేది. ఎక్కడో శ్యమంతపంచకంలో తపస్సు చేసుకుంటున్న వృద్ధక్షేత్రుని తొడపై సైంధవుని శిరస్సు పడేలా, అర్జునుడిచే కొట్టించాడు శ్రీకృష్ణుడు. తపస్సులో ఉన్న వృద్ధక్షేత్రుడు ఉలిక్కిపడి, కొడుకు శిరస్సును క్రిందకు తోసేశాడు. సైంధవుని శిరస్సు ఆ విధంగా నేలపై పడింది. ఆ శిరస్సును నేలపై పడగొట్టినవాడు వృద్ధక్షేత్రుడే కాబట్టి, అతని తల ముక్కముక్కలుగా ప్రేలిపోయింది. తాను పెట్టిన శాపానికి తానే బలి అయ్యాడు వృద్ధక్షేత్రుడు. ఎవరు తీసుకున్న గోతిలో వారే పడ్డారు.

తండ్రీకొడుకుల జీవితాలకు చక్కటి ముగింపు ఇచ్చాడు శ్రీకృష్ణుడు. వజ్రాన్ని వజ్రంతోనే కోయాలనేది ఆయన ఫిలాసఫీ!

## ★ పౌండ్రక వాసుదేవుని వధ ★

శ్రీకృష్ణునితో తమను పోల్చుకోవాలని చూసే ఆకతాయి రౌడీలు నేడు చాలామంది ఉన్నారు. పరమాత్మునితో పోల్చుకుంటూ విర్రవీగే అలాంటి దుష్టులకు ఎంతటి గతి పడుతుందో, పౌండ్రక వాసుదేవుని గాథ మనకు చెప్తుంది.

శ్రీకృష్ణుని కాలంలో కరూశదేశాన్ని పౌండ్రకుడనే రాజు పరిపాలించేవాడు. అతను కృష్ణునికి ఉన్న ఆయుధాల్నీ, అలంకారాల్నీ కృత్రిమంగా చేయించుకున్నాడు. (శంఖం, చక్రం, గద, శార్ఙ్గం, శ్రీవత్సం, కౌస్తుభ మణి అన్నీ తయారుచేయించుకున్నాడు.) శ్రీకృష్ణుని మాదిరిగా అలంకరించుకునేవాడు. కొందరు మూర్ఖులూ, దుష్టులూ అతని చుట్టూచేరి "నువ్వే అసలైన కృష్ణుడివి. వాసుదేవ నామం నీకే సొంతం. లోకంలో ఇద్దరు వాసుదేవులు ఉండకూడదు, ఆ కృష్ణుణ్ణి వధించు" అని దుర్బోధలు చేశారు. ఇదంతా విని, బాగా పొగరెక్కింది పౌండ్రకునికి. కృష్ణుని తన పాదాక్రాంతం కమ్మని కబురుచేశాడు. లేకుంటే యుద్ధం తప్పదన్నాడు. శ్రీకృష్ణుడు, పౌండ్రకుని అవివేకానికి నవ్వుకుని, యుద్ధానికి తాను సిద్ధమని కబురు పంపాడు. కాశీరాజు సహాయంతో 5అక్షౌహిణీల సేనతో శ్రీకృష్ణునిపై యుద్ధానికొచ్చాడు పౌండ్రకుడు. కృత్రిమ ఆయుధాలతో, అలంకారాలతో పగటివేషగాడి వలె ఉన్న పౌండ్రకుని చూసి శ్రీకృష్ణునకు నవ్వొచ్చిందట. వారికి జరిగిన యుద్ధంలో పౌండ్రకుడి తల నరికేశాడు శ్రీకృష్ణుడు.

అదే పేరు పెట్టుకున్నంత మాత్రాన, అవే ఆయుధాలు చేయించుకున్నంత మాత్రాన, అవే అలంకారాలు ధరించినంత మాత్రాన–పరమాత్మతో సమానం కాగలరా ఎవరైనా? వాతలు పెట్టుకున్నంతలో నక్క, పులిగా మారుతుందా? మూర్ఖత్వంతో, అహంకారంతో పరమాత్మునితో పోల్చుకుని పోటీపడితే - పౌండ్రకుడికి పట్టిన గతే పడుతుంది ఎవరికైనా! శ్రీకృష్ణునితో పోల్చుకుంటూ, ఎగిరెగిరే నేటి రౌడీ మూకలకు ఇదే హెచ్చరిక!

## ★ నామస్మరణలో ఏకాగ్రత ★

దుష్టుడైన శిశుపాలుణ్ణి చంపిన శ్రీకృష్ణుడు, అతని ఆత్మను తనలో లీనం చేసుకున్నాడు. నిండుసభలో అవమానకరంగా తిట్లు తిట్టిన వాణ్ణి తనలో ఎందుకు లీనం చేసుకున్నాడని ఎవర్కైనా సందేహం రావచ్చు. ఎవరైనా భగవంతుని ఇష్ట పూర్వకంగానైనా లేక ద్వేషంతోనైనా గానీ, ఏకాగ్రచిత్తంతో పదేపదే తలచుకుంటే చాలు. పరమాత్ముడు వారిని తన దరిచేర్చుకుంటాడట. కావలసినదల్లా ఆయనపై ఏకాగ్రచిత్తం. అందుకే మనం దేవుని పూజించేటప్పుడు అష్టోత్తర శతనామాలతో, సహస్ర నామావళితో కీర్తిస్తుంటాం. అయితే ఎన్ని వేల నామాలతో జపించాం అనేది ముఖ్యం కాదు. ఎంత ఏకాగ్ర చిత్తంతో జపించాం అనేది ముఖ్యం. భగవన్నామస్మరణం నోటికే పరిమితం కాకూడదు. మనసులో నుండి రావాలి. అప్పుడే మనం భగవంతునికి చేరువ కాగలం. రాజసూయ యాగ సమయంలో శిశుపాలుడు అనేకసార్లు శ్రీకృష్ణుని నిందించాడు. అంటే ద్వేషపూరితమైన నామావళితో మనసున శ్రీకృష్ణుని తలచుకున్నాడన్నమాట. ద్వేషంతో తిట్టినందుకు శిక్షగా, అతని శిరస్సును సుదర్శనంతో ఖండించాడు శ్రీకృష్ణుడు. అయితే శిశుపాలుని ఆత్మను మాత్రం తనలో లీనం చేసుకున్నాడు. ఏవిధంగానైతేనేం, తనను పదేపదే తలచుకున్నందుకు శిశుపాలునిపట్ల అలా అనుగ్రహాన్నికూడా చూపాడు. గమనించండి ఈ విచిత్రాన్ని. ఒకే పనికి రెండు ఫలితాల్ని తగు విధంగా అందించాడు కృష్ణుడు.

ఎవరైనా ఏకాగ్రచిత్తంతో తనను తలిస్తే, ముక్తి తప్పక లభిస్తుందని ఈ సంఘటన ద్వారా బోధిస్తున్నాడాయన.

❦ ❦ ❦

అవతార ప్రారంభం నుండీ శ్రీకృష్ణుడు తన చేతలతో చేసిన బోధనల్ని ఈసారి ఒక వరుసలో తెలుసుకుందాం.

## ★ ముక్తిమార్గం చూపిస్తున్న శ్రీకృష్ణ జననగాథ ★

శ్రీకృష్ణుడు చీకటితో నిండిన ఖైదు గోడల మధ్య జన్మించాడు. కానీ అక్కడే వుండి పోలేదు. వెలుగుతోనిండిన విశాల ప్రదేశం చేరాలని, స్వేచ్ఛగా ఆనందంగా జీవించాలనీ వ్రేపల్లెకు ప్రయాణమయ్యాడు. శ్రీకృష్ణుని ఆదేశంపై, వసుదేవుడు ఆయనను

తీసుకుని బయలుదేరాడు. ఖైదు తాళాలు వాటంతటవే విడిపోయాయి. తలుపులు తెరచుకున్నాయి. దారిలో హోరున వర్షం. దారికి యమునానది అడ్డుగా వుంది. అయినా వారు ప్రయాణం ఆపలేదు. వారిపై వర్షం పడకుండా ఆదిశేషుడు తన పడగలను గొడుగు మాదిరిగా వుంచాడు. యమునానది పాయలై, దారి యిచ్చింది. శ్రీకృష్ణుడు వ్రేపల్లె చేరాడు. తెల్లవారగానే వెలుగులు చూశాడు. అదీ మన మెరిగిన శ్రీకృష్ణ జననగాథ. ఇందులో అంతరార్థాన్ని చూద్దాం.

మానవ శరీరంలో జీవాత్మ ప్రవేశించడంతో జన్మ మొదలౌతుంది. జీవాత్మకు యీ శరీరమే ఖైదు. పరమాత్మ సన్నిధానమైన ముక్తిపథానికి జీవాత్మ చేరడమే, ఖైదు నుండి విడుదల కావడం. శ్రీకృష్ణుని చెఱసాల జీవనంలోని అంతరార్థం ఇదే! మనం చీకటి నుండి విడుదలై వెలుగులోకి ప్రయాణించాలని, ఆయన వ్రేపల్లె ప్రయాణం తెలియజేస్తోంది. అనగా ఖైదు వంటి శరీరంలో బందీగా వున్న ప్రతి జీవాత్మాకూడా, పరమాత్మను చేరేందుకు ప్రయత్నించాలని భావం. అయితే ఈ ఖైదు నుండి బయట పడడం ఎలా? మార్గం యేమిటి? భగవంతునిపై భక్తి విశ్వాసాలే దానికి మార్గం. అలాంటి భక్తి విశ్వాసాలు వసుదేవునిలో వున్నాయి. అందుకే శ్రీకృష్ణుని మాటపై నమ్మకముంచి ఆయనతో బయలుదేరాడు. 'ఎలా బయట పడగలం?' అని కూడా ఆలోచించలేదు. అదే విధంగా మనం కూడా భగవంతునిపై భక్తి విశ్వాసాలు కలిగి, ఆయనపై భారం వేసి ముక్తి మార్గం వైపు ప్రయాణం ఆరంభించాలి.

వసుదేవుడు ప్రయాణం ఆరంభించగానే ఖైదు తాళాలు విడిపోయి, తలుపులు తెరచుకున్నాయి. అనగా మన దురుద్దేశాలూ, ఆశలు, కోరికలు మనల్ని వీడిపోయి జ్ఞానమార్గానికి తలుపులు తెరుచుకుంటాయని భావం. దారిలో హోరున కురిసే వర్షం వారిపై పడకుండా ఆదిశేషుడు నీడనివ్వడం అంటే, జీవితంలో ఎదురయ్యే కష్టాల బారినుండి భక్తులను భగవంతుడే రక్షించునని అర్థం. దారికి అడ్డుగా వున్న యమునానది కూడా విడిపోయి దారి యిచ్చిందంటే, భక్తిలో లీనమైనవారిని సంసార జలధి అడ్డగించదనీ, చక్కని మార్గాన్ని ఇస్తుందనీ భావం. ఇలా అడ్డంకులన్నీ తొలగిపోయాక, వ్రేపల్లె చేరిన శ్రీకృష్ణుడు వెలుగునిండిన విశాల ప్రదేశాలను చూశాడు. అనగా భక్తితో ముక్తి మార్గాన నడిచే మానవులకు జీవితంలో ఎదురయ్యే కష్టాలు, అనారోగ్యాలు, భవబంధాలు, సంసారబంధాల నుండి విముక్తి కలిగి – దైవ సన్నిధి లభిస్తుందన్న మాట. శ్రీకృష్ణ జననగాథ పరోక్షంగా మనకు చెప్తున్న పాఠం ఇది!

చిన్నతనం నుండి కూడా యెందరో రాక్షసుల్ని అంతం చేయగలిగిన శ్రీకృష్ణుడు, రాత్రికి రాత్రే వ్రేపల్లెకు పారిపోనక్కర్లేదు. తాను పుట్టిననాడే దుష్ట రాక్షసులందరినీ సంహరించగలడు. ఆయన తన మహిమతో యిక్కడ ఖైదులో మాయమై, అక్కడ యశోద వద్ద ప్రత్యక్షం కాగలడు. కానీ ఆ విధంగా చేయలేదు. ఎన్నో కష్టాలుపడి వ్రేపల్లె చేరాడు. ఎందుకోసం? ఇహలోక బంధాలను భక్తితో అధిగమించి, ముక్తిని పొందగల మార్గాన్ని మానవులకు బోధించడానికే ఆ విధంగా చేశాడు.

❦ ❦ ❦

## ★ దుర్గుణాల ప్రతిరూపాలను అంతం చేసిన శ్రీకృష్ణుడు ★

మానవుణ్ణి పతనదశకు లాగే 'దశ దుర్గుణాలు' బాల్యదశ నుండీ లోబరచు కోవాలనే చూస్తాయి. ఒక్కసారి ఆ దుర్గుణాలకు మానవుడు వశమయ్యాడో, అతడు అధోగతి పొందేవరకూ ఆ గుణాలు అతన్ని వీడవు. అందుకే ఆ 'దశ దుర్గుణాలను' దరి చేరనీయరాదు. భక్తి మార్గంతో ముక్తిని పొందగోరువారు యీ దశదుర్గుణాలనూ జయించాలనే విషయాన్ని శ్రీకృష్ణుడు ఒక క్రొత్తరకంగా వివరించాడు. దశదుర్గుణాలకు ప్రతీకలుగా తనను తుదముట్టించ వచ్చిన రాక్షసులందరినీ సంహరించాడాయన.

దుర్గుణాలకు ప్రతిరూపాలయిన ఆ రాక్షసుల్ని శ్రీకృష్ణుడెలా సంహరించాడో వరుసగా తెలుసుకుందాం.

తన మరణానికి శ్రీకృష్ణుడే కారణమౌతాడని తెలిసిన కంసుడు భయపడి, శ్రీకృష్ణవధ కోసం రాక్షసుల్ని పంపేవాడు. ఆ విధంగా శ్రీకృష్ణుని చంపాలని ముందుగా వచ్చిన రాక్షసి 'పూతన'. తీయగా కవ్విస్తూ మానవుణ్ణి పతనానికి లాగివేసే 'కామానికి' ప్రతిరూపం 'పూతన'.

❦ ❦ ❦

## కామాన్ని జయించండి

పూతన వ్రేపల్లె చేరుతూనే కళ్ళు చెదిరే శృంగార రూపం ధరించింది. ఆమె వచ్చిన సమయంలో వ్రేపల్లెలో పురుషులెవరూ లేరు. స్త్రీలే వున్నారు. అలాంటి సమయంలో చిన్నబాలుని చంపాలంటే, పూతన మారువేషం ధరించనక్కర్లేదు. అయినా

మాయా శృంగార రూపం దాల్చింది. జీవులను అధోగతికి దిగజార్చే అతి శృంగార, కామాలకు ప్రతీక 'పూతన'. ఆమె శ్రీకృష్ణుని తన ఒడిలోకి తీసుకుని పొంగుతున్న తన స్తనాన్ని అతని నోటికి అందించింది తన స్తనాలకు విషాన్ని పూసుకొని వచ్చింది పూతన. ఇక్కడ ఒక విషయం చెప్పాలి. పూతన విషపూరిత స్తనాలను అక్రమ కామసుఖానికి ప్రతీకగా చెప్పవచ్చు. ఎదురుచూడని అక్రమ కామసుఖం అందిరాగానే, సామాన్య మానవులు పశువులుగా మారతారు. చివరకు అధోగతి చెందుతారు. అక్రమ కామసుఖంలోని విషతత్వాన్ని గమనించిన మహనీయులు మాత్రం, దాన్నించి తప్పించుకోగలుగుతారు. శ్రీకృష్ణుడు సర్వజ్ఞాని కనుక పూతన విషస్తనాల విషయం గమనించి, ఆ విషాన్ని తన పుక్కిటనే పట్టి, ఏకంగా ఆమె ప్రాణాలనే పీల్చేశాడు. చచ్చింది పూతన.

అందివచ్చే అక్రమ సుఖాలకు వశం కాకూడదని ఈ పూతన గాథ, పరోక్షంగా హెచ్చరిస్తోంది. పూతన తన స్తనాలకు పూసుకున్న విషం, అక్రమ కామసుఖం వెనుకనున్న విషాన్ని సూచిస్తోంది. దశదుర్గుణాల్లో ఒకటైన అక్రమ కామాన్ని అంతమొందించడం ఎంతయినా ఉత్తమం.

(ఇక్కడొక చిన్న గమనిక! కామాన్ని జయించడం అంటే మొత్తం కామాన్ని విసర్జించడం కాదు. అలా అయితే సృష్టి కొనసాగేదెలా? సృష్టి కొనసాగాలంటే కామచర్యలు అవసరమే. కానీ అవి మితి మీరకూడదు. భార్యతో ధర్మబద్ధంగా కామసుఖం అనుభవించడం తప్పు కాదు. పరస్త్రీ వ్యామోహం, వ్యభిచారం కూడనివి. ఏక పత్నీవ్రతం కలిగి వుండాలి. "ధర్మేచ, అర్థేచ, కామేచ, మోక్షేచ నాతిచరామి" అని వివాహవేళ చేసిన వాగ్దానం నిలుపుకోవాలి. పరస్త్రీలను వాంఛింపరాదు. అది పతన హేతువు. సీతను ఆశించిన రావణుడు, ద్రౌపదిని తొడపైకి ఆహ్వానించిన దుర్యోధనుడు, ఆమెను ఆశించిన కీచకుడు మొదలగువారు యెలా నాశనమయ్యారో గుర్తుంచుకోవాలి మనం. అందుకే ఏక పత్నీవ్రతం ముఖ్యం. భార్యతోనైనాసరే మితిమీరనటువంటి కామంతో వ్యవహరించడమే ఆరోగ్యప్రదం. ఏ విషయంలోనైనా మితిమీరితే అధోగతే కదా!)

## క్రోధాన్ని విడువండి

దశదుర్గుణాల్లో రెండవది, క్రోధం. ఈ క్రోధం అనేది అతి వేగంగా దూసుకు

వస్తుంది. క్రోధానికి వశం అయినవాడు తన ఎదుట వున్నది పెద్దలనీ, చిన్నలనీ ఉచ్ఛనీచాలు ఆలోచించకుండా వ్యవహరిస్తాడు. ఎదుట ఉన్నది అల్పుడయితే - ఆ క్రోధంలో పడి నశించవచ్చు గానీ, అధికుడైతే మాత్రం.. "తనకోపమె తన శత్రువు" అన్నట్లుగా, ఆ క్రోధానికి వశం అయిన వాడే నష్టపోతాడు. క్రోధం అతివేగంగా వచ్చి, ఎదుటివారిపై దాడి చేయిస్తుంది కనుక ఆ క్రోధాన్ని శకటంతో పోల్చవచ్చు. ఎందుకంటే క్రోధం అదుపులో వుండక పోయినా, 'శకటం' సారథి యొక్క అదుపు తప్పినా - అనర్థం జరుగుతుంది. చిన్న చిన్న జీవులయితే, అదుపు తప్పిన శకటం క్రింద పడి మరణిస్తాయి అదే శకటం, ఒక కొండను గాని ఢీ కొంటే. . . శకటమే నశిస్తుంది. అందుకే అదుపులేని క్రోధం, అదుపు తప్పిన శకటం ఒక్కలాంటివే!

శ్రీకృష్ణగాథలో క్రోధానికి ప్రతిరూపం శకటాసురుడు. శ్రీకృష్ణుని చంపమని కంసుడే ఈ శకటాసురుణ్ణి పంపిస్తాడు. అదుపులేని క్రోధం మాదిరిగా యీ శకటాసురుడు వేగంగా దొర్లుకుంటూ వచ్చి, కొండ వంటి శ్రీకృష్ణుణ్ణి ఢీ కొన్నాడు. శ్రీకృష్ణుడు సామాన్యుడా మరి? శకటాసురుణ్ణి అవలీలగా చంపేశాడు.

"ఓ మానవులారా! మీలో కలిగే అదుపులేని క్రోధాన్ని, నేను శకటాసురుని వధించినట్లుగానే వధించండి" అంటూ శ్రీకృష్ణుడు యిచ్చిన సందేశమే శకటాసురవధ. అందుకే మనం క్రోధాన్ని కూడా జయించాలి. లేకుంటే నష్టం మనకే!

❦ ❦ ❦

## అహంకారం వద్దు

అహంకారానికి లోనైన ప్రజలు కన్నుమిన్ను కానలేరు. తామే గొప్పవారిగా భావిస్తారు. వారి కాళ్ళు నేలమీద నిలువవు. గాలిలో విహరిస్తుంటారు. ఎవరినీ లక్ష్యపెట్టరు. కానీ ఏదో ఒకనాడు అంత యెత్తునుండీ క్రిందపడి పతనమౌతారు.

కంసుడు పంపిన మరో రాక్షసుడు తృణావర్తుడు. సుడిగాలి రూపంలో వచ్చాడు వాడు వాడే అహంకారానికి ప్రతిరూపం. వాడు వ్రేపల్లెలో సుడిగాలి రూపాన ప్రవేశించగానే, వాడి బారిన పడిన ప్రజలకు కళ్ళు కనపడలేదట. (అనగా అహంకారానికి లోబడినవారు కన్నుమిన్ను కానరని భావం). వాడు చిన్ని కృష్ణుని ఎగరేసుకుపోయాడు గాల్లోకి. (అహంకార పూరితుల కాలు నేలపై నిలువకపోవడం అంటే అదే!) కానీ శ్రీకృష్ణుడు ఆ రాక్షసుడికి (అహంకారానికి) లొంగినట్లుగా నటించాడే గాని, నిజంగా లొంగలేదు. వాడు తనను చంపవచ్చిన రాక్షసుడని గుర్తించాడు. ఆకాశమంత యెత్తుకు

వెళ్ళేవరకూ ఆగాడు. అహంకార రాక్షసుని గొంతు నులిమి చంపి, క్రిందపడవేశాడు. అహం మితిమీరిన వాడి గతి అంతే! ఏదో ఒకనాడు అలా గర్వభంగమై నశిస్తాడు. "తృణావర్తుని చంపినట్లుగా అహంకారాన్ని మర్దించమని" శ్రీకృష్ణుడు మనకు ఈ గాథలో సూచిస్తున్నాడు.

❦ ❦ ❦

## కుటిల బుద్ధి హానికరం

మాయోపాయాలతో యితరులను మోసం చేసి, లబ్ధిపొందాలని చూడటమే కుటిలత్వం. అలాంటి మాయోపాయంతోనే శ్రీకృష్ణుని చంపవచ్చాడు వత్సకుడనే రాక్షసుడు. అందుకే వాడు కుటిలత్వానికి మారు రూపం. వాడు ఒక ఆవుదూడగా రూపం ధరించి, శ్రీకృష్ణుని ఆవులమందలో చేరాడు. శ్రీకృష్ణుడు యేమరిపాటుగా వున్నప్పుడు చంపాలని వాడి ఆలోచన. శ్రీకృష్ణుడు వెంటనే వాణ్ణి గుర్తించి, ఆ దూడ వెనుక కాళ్లను ఒడిసిపట్టుకొని, గాల్లో గిరగిరా త్రిప్పి నేలకు కొట్టి చంపేశాడు. "మానవులు తమలోని కుటిల స్వభావాన్ని కూడా అలాగే త్రిప్పికొట్టాలని" శ్రీకృష్ణుడు సూచిస్తున్నాడు.

❦ ❦ ❦

## లోభాన్ని నశింపజేసుకోండి

వివిధ మాయోపాయాలతో సంపదను ఆర్జించి తమస్వార్థానికి వినియోగించుకోవడమే గాని, పరోపకారం అంటే యెరుగరు కొందరు. దాన్నే లోభం అంటాం. ఆ లోభానికి ప్రతీక బకాసురుడనే రాక్షస కొంగ. ఏటిఒడ్డున ఉండే కొంగను చూడండి. దొంగ జపం చేస్తూ, చేపలను స్వాహా చేయడం దానికి అలవాటు. కంసుడు పంపిన బకాసురుడే లోభానికి ప్రతీక. ఆ రాక్షసకొంగ శ్రీకృష్ణుని మ్రింగాలని చూసింది. కానీ ఆయన చేతిలోనే చచ్చింది. మనల్ని ఆవహింపజూసే లోభ గుణాన్ని నాశనం చేయాలని ఈ సంఘటన చెప్తోంది.

❦ ❦ ❦

## మాత్సర్యం వినాశహేతువు

మాత్సర్యం అంటే అసూయ. అసూయకు లోనైనవారు తమకు యితరులెవరూ

అపకారం చేయకపోయినా సరే, ప్రక్కవారు పచ్చగా వుంటే చూసి సహించలేరు. కీడు తలపెడతారు. అలాంటి మాత్సర్యానికి ప్రతిరూపం కాళీయుడు అనే సర్పం. అతడు కాళింది మడుగులో చేరి, చుట్టూ పచ్చగావున్న ప్రకృతిని తన విషజ్వాలలతో కలుషితం చేస్తూ, అమాయక ప్రాణుల్ని చంపేవాడు. అలాగే శ్రీకృష్ణుణ్ణీ చంపజూశాడు. అయితే బాలకృష్ణుడే ఆ కాళీయుని పడగలపై ఎక్కి త్రొక్కి, విషం కక్కించి, చావగొట్టి దూరంగా తరిమేశాడు. పరులకు కీడు తలపెట్టే మాత్సర్య గుణాన్ని మనలో నుండి దూరంగా తరిమివేయాలని శ్రీకృష్ణుడు పరోక్షంగా చెప్తున్నాడిక్కడ.

❦ ❦ ❦

## మదాన్ని అణచుకోండి

మదం అంటే గర్వం, పొగరు. పొగరెక్కి రంకెలు వేస్తూ గోపబాలురందరినీ చంపాలని వచ్చిన వృషభాసురుడే మదం అనే దుర్గుణానికి ప్రతీక. శ్రీకృష్ణుడు వృషభాసురుని యెదిరించి, అతని రెండు కొమ్ములనీ పట్టి విరిచి, చంపివేశాడు. అంటే ప్రతి మానవుడు తనలోని మదం అనే కొమ్ముల్ని విరిచి, సాత్విక గుణాన్ని కలిగి వుండాలనే నీతిని వివరిస్తుంది యీ వృషభాసురవధ.

❦ ❦ ❦

## దురాశ దుఃఖానికి చేటు

చూసిన ప్రతిదాన్నీ స్వంతం చేసుకోవాలని కోరుకునే స్వభావాన్నే మోహం అంటాం. అలా ప్రతిదాన్నీ ఆశించడాన్ని దురాశ అని కూడా అంటారు. కళ్ళెం లేని గుఱ్ఱం వంటిది మోహం. దురాశాపూరితమైన కోరికల గుఱ్ఱానికి కళ్ళెం వేయలేని మానవులు, మోహగుణానికి లొంగిపోయినట్లే! అందుకే ఈ మోహగుణం 'కేశి' అనే గుఱ్ఱం రూపు రాక్షసునిగా చూపబడింది. శ్రీకృష్ణుని చంపాలని వచ్చాడీ కేశి. కానీ ఒక్కదెబ్బతో వాని పళ్ళు రాలగొట్టాడు శ్రీకృష్ణుడు. ఆ తరువాత దాని నోటిగుండా కడుపులోకి తన చేతిని దూర్చి, దానికి వూపిరి ఆడకుండా చేసి చంపేశాడు. శ్రీకృష్ణుడు గుఱ్ఱం పళ్ళురాలగొట్టినట్లుగా మానవులు తమ దురాశల్ని రాలగొట్టాలనీ, మనసు లోతుల్లోని మోహాలను నశింపజేసుకోవాలనీ దీని అంతరార్థం.

❦ ❦ ❦



## బద్ధకాన్ని పారద్రోలండి

మానవుని ప్రగతిపథానికి అడ్డుగోడ 'బద్ధకం'. దానికి ప్రతీక అఘాసురుడనే కొండ చిలువ. ఎందుకంటే మొద్దులా చురుకుదనం లేకుండా బద్ధకంగా పడి వుంటుంది కొండచిలువ. అయితే దాని దగ్గరకు వెళ్ళిన వారిని మాత్రం పట్టి మ్రింగేస్తుంది. కొండచిలువ నోటపడినా, బద్ధకానికి లోనైనా బయటపడడం కష్టం. అందుకే ఆ రెండింటికీ పోలిక కుదిరింది. అఘాసురుడు తన దగ్గరకు వచ్చిన గోప బాలురందరినీ మ్రింగివేయసాగాడు. శ్రీకృష్ణుణ్ణీ మ్రింగివేయాలనుకొన్నాడు. కానీ సామాన్య మానవుల మాదిరిగా బద్ధకానికి లోబడేవాడు కాదాయన. అఘాసురుని నోటిలో నుండి గర్భంలోకి వెళ్ళిపోయాడు. అక్కడ నిలబడి, తన శరీరాన్ని విపరీతంగా పెంచివేశాడు. అలా అఘాసురుని గర్భం చీల్చివేసి చంపేశాడు. గోపాలురనందరినీ రక్షించాడు. మనిషి తనలోని చురుకుదనాన్ని బాగా పెంచుకుని, బద్ధకాన్ని చీల్చిచెండాడితే మానవుడు తన అభివృద్ధిని సాధించడమే కాక, తోటివారికి కూడా లాభం కలిగించగలడని ఈ సంఘటన ద్వారా శ్రీకృష్ణుడు మనకు వివరించాడు.



## క్రూరత్వం తగదు

కంసుడెంత క్రూరుడో చెప్పనక్కరలేదు. తన చెల్లిని, బావను, తండ్రిని కూడా చెఱసాలలో బంధించి హింసించాడు. ఆరుగురు పసిపాపల్ని నేలపై విసరికొట్టి చంపాడు. బాలకృష్ణుని వయసుగల పసివారందరినీ చంపించాడు ఋషులనూ, భక్తులనూ హింస పెట్టాడు. సజ్జనులను దండించాడు. ఆ విధంగా క్రూరత్వానికి ప్రతిరూపంగా నిలిచాడు కంసుడు. అలాంటి కంసుని చంపి - అతనిచే బంధించబడిన తన తల్లిదండ్రులను, తాతను విడిపించి ఆ రాజ్యాన్నే గెలుచుకున్నాడు శ్రీకృష్ణుడు. ఈ అంశం ద్వారా ఆయన మనకిచ్చే సందేశం యేమిటంటే - మానవుడు తనలోని క్రూరత్వాన్ని నశింపజేయగలిగితే లోలోపల అణగారుతున్న మంచి, మానవత్వం, దయాగుణం విడుదలై - ముక్తి అనే రాజ్యాన్ని గెలుచుకుంటాడు.

పైన తెలిపిన పదిమంది రాక్షసుల్నీ శ్రీకృష్ణుడు చంపడంలోని అర్థం కేవలం దుష్టశిక్షణే కాదు. మరో అంశం కూడా అందులో ఇమిడి ఉంది. ఒక చిన్న బాలుని

చంపడానికి అంతమంది రాక్షసులు అన్ని మారువేషాల్లో రావలసిన పనిలేదు. అయినా మారు వేషాల్లోనే వచ్చారు. కారణం యేమిటి? ఆ పదిమందీ, పది దుర్గుణాలకు ప్రతీకలుగా చూపబడ్డారు. ఆ దుర్గుణాల్ని మానవులు యెలా జయించాలో చెప్పడం కోసమే, శ్రీకృష్ణుడు ఆ విధమైన రాక్షస సంహారం చేశాడు.

పదిమంది రాక్షసులూ శ్రీకృష్ణుణ్ణి చంపాలని చూడడం అంటే-ఈ పది దుర్గుణాలూ మానవుణ్ణి పతనానికి లాగేందుకు చూస్తాయని భావం.

శ్రీకృష్ణుడు అల్పుడయితే ఆ రాక్షసుల వల్ల మరణించేవాడే! కానీ ఆయన మహనీయుడు కనుక, తనే వారిని చంపేశాడు. మానవులు వివేకశూన్యులయితే, దశ దుర్గుణాలకూ లొంగిపోయి నశిస్తారు. కానీ వివేకం గలవారైతే, ఆ దుర్గుణాలను జయించి ముక్తిని పొందుతారు. (యథార్థానికి శ్రీకృష్ణుడు ఎందరో రాక్షసుల్నీ, దుర్మార్గుల్నీ చంపాడు. అయితే వారిలో దుర్గుణాలకు మచ్చుగా పదిమందిని మాత్రమే ఇక్కడ ఉదహరించడం జరిగింది.)



## ★ దశ దుర్గుణాలను రూపుమాపిన శ్రీరాముడు ★

ఇదే విషయాన్ని రామాయణంలో శ్రీరాముడు కూడా చెప్పాడు. అయితే రామకృష్ణులు చెప్పిన రెండు పాఠాల్లో కొద్ది తేడా వుంది. ఈ దుర్గుణాల్ని ఒకటొకటిగా వరుసగా విడువమని శ్రీకృష్ణుడు చెప్పాడు. అన్ని దుర్గుణాలనూ ఒకేసారి విడువమన్నాడు శ్రీరాముడు. అన్ని దుర్గుణాలకూ మూలమైన స్వార్థాన్ని వదిలేస్తే, మిగిలిన దుర్గుణాలన్నీ వాటంతటవే పోతాయని శ్రీరాముడు చెప్పాడు.

రావణాసురుడికి పది శిరస్సులుంటాయట. 'నిజంగా వుండేవా? అలా వుండడం సాధ్యమా? ' అంటారు కొందరు. నిజంగా వుండేవో లేదో తరువాత తర్కించుకుందాం. కానీ దాని అంతరార్థం యేమిటంటే - పైన చెప్పిన ఈ పది దుర్గుణాలకూ ప్రతీకలే రావణాసురుడి పది తలలు. అంటే రావణాసురునిలో ఈ దుర్గుణాలన్నీ వున్నాయన్న మాట. ఈ దుర్గుణాలకు మూలం యేమిటంటే "స్వార్థం". స్వార్థం వల్లనే యీ గుణాలు వస్తాయి. ఏ స్వార్థమూ లేనివాడు, దుర్గుణాలకు దూరంగా వుంటాడు. ఈ సందర్భంలో స్వార్థానికి ప్రతీక "రావణాసురుని నాభి".

మానవులకు స్వార్థం వున్నంతకాలం, మిగిలిన దుర్గుణాలను చంపుకుందా

మనుకున్నా కుదరదు. మళ్ళీ ఆ దుర్గుణాలు పుడుతూనే వుంటాయి. రామాయణంలో శ్రీరాముడు అదే చూపించాడు మనకు. రావణుని పది శిరస్సుల్లో ఒక దానిని నరికేశాడు. అయితే ఆ స్థానంలో క్రొత్తగా శిరస్సు పుట్టింది. మళ్ళీ మరో శిరస్సు నరికాడు. మళ్ళీ పుట్టింది. అలా యెన్నిసార్లు నరికినా, క్రొత్త శిరస్సులు పుడుతూనే వున్నాయి. నాభిలో కొట్టమని సలహా యిచ్చాడు విభీషణుడు. శ్రీరాముడు అలాగే చేశాడు. అంతే! రావణాసురుడు మరణించాడు. అతని పది శిరస్సులూ వాటంతటవే నశించిపోయాయి. అంటే నాభి (స్వార్థం) క్షేమంగా వున్నంతవరకు శిరస్సులు (దుర్గుణాలు) పుడుతూనే వుంటాయి. ఆ స్వార్థం నశించగానే దుర్గుణాలు వాటంతటవే నశించిపోతాయి. కాబట్టి "ఓ మానవుడా! ముందు నీలోని స్వార్థాన్ని చంపుకో! ఆ తరువాత నీలోని దుర్గుణాలన్నీ అవే నశించిపోతాయి" అనేదే యీ సందర్భంలోని శ్రీరామ సందేశం.

(సూచన: ఈ గాథలో శ్రీరాముడు సామాన్య మానవునిగాను, విభీషణుడు విజ్ఞతకలిగిన గురువుగానూ; మానవునిలోని మనసు సీతగానూ, ఆ మనస్సును లోబరుచుకోజూసే పది దుర్గుణాల సమ్మేళనమే రావణాసురునిగానూ మనం భావించవచ్చు. అనగా మానవునిలోని మనసును లోబరచుకొనేందుకు దుర్గుణాలు వేచివుంటాయి. సద్గురువు బోధనలు విని, జ్ఞానం అనే అస్త్రంతో, స్వార్థం అనే నాభిని ఛేదించే మానవుడు-తనలోని దుర్గుణాలను తరిమివేసి, మనస్సును రక్షించుకుంటాడు. అయితే అంతకు ముందు దశ దుర్గుణాలతో కలుషితమై కొంతకాలం మలినంగా ఉన్న కారణాన, ఆ మనస్సును పశ్చాత్తాపం అనే అగ్నిలో కాల్చవలసి ఉంటుంది. సీతమ్మవారి అగ్ని ప్రవేశంలోని అంతరార్థం అదేమరి!

రామావతారంలో సూచించినట్లుగా అన్ని దుర్గుణాలనూ ఒకేసారి విడవడం సాధారణ మానవులకు కష్టమే! అందుకే ఆ దుర్గుణాల్ని అంచెలంచెలుగా విడిచిపెట్టమని కృష్ణ భగవానుడు సూచిస్తున్నాడు.

## ★ శ్రీకృష్ణుని అల్లరి చేష్టల అంతరార్థాలు ★

శ్రీ కృష్ణుని అల్లరి చేష్టలు బాహ్యంగా చూస్తే ఒక రకంగాను, అంతరార్థపరంగా చూస్తే మరో విధంగానూ వుంటాయి. బాగా తరచి చూస్తే, ఆయన చేష్టల్లో మనం

తెలుసుకోవలసిన మంచి పాఠాలెన్నో దాగి ఉంటాయి. వాటిలో కొన్నింటిని తెలుసుకుందాం.

బాలకృష్ణుని అల్లరి చేష్టల్లో ప్రముఖమైనది వెన్న దొంగతనం.

శ్రీకృష్ణుడు తన మిత్రులతో కలసి గోపికల ఇళ్ళలో దొంగచాటుగా దూరి పాలు, పెరుగు, మీగడ, వెన్నలను దొంగిలించి తినేవాడు. అందరికీ పంచిపెట్టేవాడు. గోపికలు అతన్ని పట్టబోతే పారిపోయేవాడు. ఆయన అలా ఎందుకు చేసినట్లు? కావలసినంత వెన్న తన యింట్లో లేదా? యశోద అతనికి వెన్న పెట్టేదికాదా? అదేంలేదు తిన్నంత వెన్న, మీగడలు యశోదే పెడుతుంది. చిన్నికృష్ణుడు కోరితే గోపికలు కూడా కావలసినంత వెన్న పెడతారు. మరెందుకిలా చేసినట్లు? సమసమాజ స్థాపనకు పునాది అయిన చర్య అది! నిజానికి వెన్న కావలసింది తనకు కాదు. తన కూడా వచ్చే పేద మిత్రులకు. వారికోసమే యీ చిలిపి దొంగతనాలు.

ఏ గోపికలయితే స్వార్థంతో తమ పాలు, పెరుగు, వెన్న, నేతులను మురగబెట్టుకుని - దానధర్మాలు, ప్రక్కవారికి పెట్టడం లాంటివి చేయకుండా మధురానగరంలో అమ్మి, దురాశతో డబ్బు కూడబెట్టాలను కున్నారో 'వారికి శాస్తి చేయడం' ఇందులోని ఒక పరమార్థం.

శ్రీకృష్ణుడు వెన్నలను దోచి, తన బీద మిత్రులకు పంచిపెట్టేవాడు. తోటి వారితో పంచుకోవాలి గాని, దురాశతో మురగపెట్టుకో కూడదని ఈ చిలిపి దొంగతనాల ద్వారా బోధిస్తున్నాడాయన.

కొందరు గోపికలు తమ ఇళ్ళలోని పిల్లల నోళ్ళు కూడా కట్టేసి, వారికి పెట్టకుండా వెన్న, మీగడల్ని అమ్ముకొనేవారు. అలాంటి వారికి గుణపాఠం చెప్పేందుకు కూడా ఈ లీల సాగించాడు శ్రీకృష్ణుడు.

అయినా యథార్థానికి వస్తే... ఈలోకంలో పరమాత్మునికి సొంతం కాని సొత్తు యేముంది? అంతా ఆయనదే! ఆయన వస్తువు ఆయన తీసుకోవడం దొంగతనమెలా అవుతుంది? గోపికలు తమ వెన్న మీగడలు శ్రీకృష్ణునికి చిక్కకుండా మరింత రహస్యంగా, ఎత్తున దాచేవారట. అయితే పరమాత్మునికి తెలియని చోటు, అందని స్థలం వుంటాయా? చక్కగా వాటిని కాజేసేవాడు. గోపికలు అతన్ని పట్టి శిక్షించాలని చూసేవారు. అయితే భగవంతుని బంధించడం ఎవరి తరం? ఎన్ని విధాల బంధించినా, వారి బంధనాల నుండి చిత్రంగా మాయమయ్యేవాడు.

'మనకున్న దానిలో తోటివారికి అంతో ఇంతో ఇచ్చి సహకరించాలనీ, మన

పిల్లల నోళ్ళు కొట్టి దురాశతో మూటలు కడితే, అదంతా ఎవడో ఒకడు ఏదొకనాడు దోచుకొని పోవచ్చుననీ' తన చర్యల ద్వారా తెలియజేస్తున్నాడు శ్రీకృష్ణుడు.

ఈ చిలిపి దొంగతనాల సందర్భంలో మరో విషయాన్నికూడా తెలుసుకోవాలి మనం. శ్రీకృష్ణునిపై ప్రేమాభిమానాలుగల ఎందరో గోపికలు, కృష్ణుడు తమ యింట చిలిపి దొంగతనాలు చేయాలనీ, తాము అతన్ని పట్టుకోవాలనీ ఉబలాటపడేవారట. వారితో ఆటలాడేందుకు కూడా శ్రీకృష్ణుడు చిలిపిగా వ్యవహరించేవాడు.

తన అల్లరి పనులతో వ్రేపల్లెవాసుల్ని అప్పుడప్పుడూ ఏడిపించేవాడాయన. ఆ చేష్టల అంతరార్థాల్ని తెలుసుకుందాం.

గోపికల యిళ్ళలోని దూడల్ని కట్లు విప్పి, ఆవుల దగ్గరకు వదిలేసేవాడు. అవి ఆవుల పొదుగు పాలను పూర్తిగా త్రాగేసేవి. గోపికలు వచ్చి పాలు పితుకబోతే పాలు వుండేవి కావు. పైగా, ఆవులు వారిని తన్నేవి. గోపికల అవస్థ చూసి శ్రీకృష్ణుడు పకపక నవ్వేవాడు. తల్లిపాలు దూడలకు సరిగా అందనివ్వని గోపికల్ని ఇలా శిక్షించేవాడాయన.

వ్రేపల్లెవాసులు దేవుళ్ళకు, గ్రామదేవతలకు నైవేద్యాలు పెట్టేవారు. వారు చూడకుండా శ్రీకృష్ణుడు ఆ నైవేద్యాల్ని తినేసేవాడు. శ్రీకృష్ణుడు తిన్న నైవేద్యమే నిజంగా సఫలమైనట్లు లెక్క. ఎందుకంటే సకల దేవతలకూ దేవాది దేవుడు శ్రీకృష్ణుడే కదా! ఆ విషయం నిరూపించడానికే అలా చేసేవాడు.

ఒకసారి శ్రీకృష్ణుడు ఒక గొల్లాలితో మాట్లాడుతూ "నన్ను నాధునిగా చేసుకో! నీకు సంతానం కలుగుతుంది" అన్నాడు. అలాంటి మాట ఒక సామాన్య మానవుడు ఒక స్త్రీతో అనడం చాలా తప్పు. అయితే శ్రీకృష్ణుడు సామాన్య మానవుడుకాదు కదా! సాక్షాత్తూ పరమాత్ముడు. శ్రీకృష్ణుని మాటలో అర్థమే వేరు. "ఓ పడతీ! సర్వాంతర్యామిని నేను. నన్ను పరమాత్మగా గుర్తించి, నన్ను నాధునిగా (నాధుడు అనగా భర్త, నాయకుడు, దేవుడు అని అర్థాలున్నాయి) పూజించు. నీకు సంతానం కలుగుతుంది" అన్నాడాయన. వేరే తప్పుడు అర్థంతో అనడానికి అప్పుడాయన వయసెంత? కేవలం ఆరేళ్ళు మాత్రమే!

గర్భం ధరించిన ఒక స్త్రీని "గర్భానికి మూల కారణమేమిటి? " అని అడిగాడట ఒకసారి. నిజానికి చిన్న పిల్లలు, పరాయివారు అడగదగిన ప్రశ్నకాదది. అయితే ఇక్కడ శ్రీకృష్ణుని ఉద్దేశం ఆధ్యాత్మికపరమైనది. ఒక స్త్రీ గర్భంలో పంచభూత నిర్మిత పిండంలో జీవాత్మ చేరటమే గర్భధారణ. గర్భధారణకు కారణం కేవలం స్త్రీ పురుష సంగమమే కాదు. ఎందుకంటే ఆ స్త్రీ పురుష సంగమం అనుదినం జరగవచ్చు.

కానీ గర్భధారణ అన్ని మార్లూ జరగదు కదా అందువల్ల సంగమం అనేది కేవలం బాహ్య కారణమే! జీవాత్మ ప్రవేశం అసలైన కారణం. పంచభూతాల కలయికవల్ల ఏర్పడే శరీరంలో జీవాత్మ చేరడమే జీవి పుట్టడం అంటే జీవాత్మ ఆ శరీరాన్ని విడిచి వెళ్ళడమే మరణం. ఈ యథార్థాన్నంతనూ తెలియజెప్పడానికే ఆయన అలా అడిగాడు.

రతికేళిలో ఉన్న భార్యాభర్తల మధ్య ఒక పామును పడవేశాడట శ్రీకృష్ణుడు. ఆ పామును చూసి భయంతో ఆ భార్యాభర్తలు విడివడి వివస్త్రులుగానే పరుగులెడుతుంటే, శ్రీకృష్ణుడు పకపక నవ్వేడట. ఈ విషయాన్ని గురించి తెలుసు కుందాం. ఆ దంపతులు పగటివేళ కామాతురులై అదేపనిగా రతిక్రీడ సాగిస్తున్నారు. అది అంత ఉత్తమపద్ధతి కాదని చెప్పదలచిన శ్రీకృష్ణుడు ఆ విధంగా చేశాడు. మితిమీరిన కామము 'పామువంటిది' దానివల్ల మనకే ప్రమాదం. రాత్రనక, పగలనక కామకేళిలో మునగరాదని చెప్పడానికే పామును తెచ్చి, వారి మధ్య పడవేశాడు. పాముకంటే ప్రమాదభరితమైన కామాన్ని భయంలేకుండా అనుభవిస్తూ, తాను పడేసిన చిన్న పామును చూచి పరుగులెడుతున్నారని ఆయనకు నవ్వొచ్చింది.

శ్రీకృష్ణుడు ఎవరిని ఏ ప్రశ్న అడిగినా, ఎవరిని ఏ విధంగా ఏడిపించినా మరియు శిక్షించినా... అందుకు కారణం - అంతకు ముందే నిర్దేశించబడి ఉంటుంది. మానవమాత్రులమైన మనకు అవన్నీ పూర్తిగా అర్థం కావు. వారి వారి మనస్తత్వాల్ని బట్టి, సంస్కారాల్ని బట్టి, పూర్వజన్మ కర్మఫలాల్ని బట్టి - ఆ భగవానుడు ఎవరికేం జరగాలో నిర్దేశిస్తూ ఉంటాడు. ఈ జన్మలో మనం పడే కష్టాలకు కారణాలేమిటో మనకు తెలుసా? .. తెలీదు. అన్నీ తెలిసినవాడు ఆయనే... సాక్షాత్తూ 'శ్రీకృష్ణ భగవానుడు'.

గోపికల యిళ్ళలో గోడలకున్న దేవతామూర్తుల పటాల్ని చూసి "వీరు నాకంటే గొప్పవారా? అని నవ్వుతూ ఆ పటాలకు తన యెంగిలి వెన్న పూశాడట. నిజం చెప్పాలంటే ఆ పటాల్లోని దేవతలు ఆ ఎంగిలి వెన్నతో ధన్యులయ్యారు. శ్రీకృష్ణుడు అంత స్పష్టంగా "నేనే పరమాత్మను, మిగిలిన దేవతలు నా తరువాత వారే" అని చెప్పినాసరే ఆనాడూ యీనాడూ కూడా ఆయన్ని గుర్తించలేని మూర్ఖులున్నారు. అదే విచిత్రం.

శ్రీకృష్ణుడు తన చర్యలతో అనేక బోధనలందించాడు. వాటిని అర్థం చేసుకునే శక్తి లేనివారికి - తాను దైవ స్వరూపమని తెలియజేసేందుకు అనేక నిదర్శనాలు

చూపించాడు. గోపికలు తమ వెన్న మీగడల్ని పెట్టెల్లోదాచి తాళాలు వేసినా, వాటిని సంగ్రహించాడు. అతన్ని గదిలోనో, పెట్టెలోనో బంధించినా, అదృశ్యమై తన యిల్లు చేరేవాడు. ఈ విధంగా ఎన్నో చిత్రమైన చేష్టలతో ఎన్నెన్నో పాఠాల్ని నేర్పాడు. ఎన్నో సాహసాలు, రాక్షసవధలు చేసిచూపాడు. తన నోట సకల లోకాల్నీ చూపించి, విశ్వమంతా తనలోనే వుందని చాటి చెప్పాడు. మిగిలిన దేవతలెవరూ తన కంటే గొప్పవారు కాదని నోటితో చెప్పడమే కాక, బ్రహ్మనూ, దేవేంద్రుణ్ణీ ఓడించి చూపించాడాయన.

చిన్నతనంలో వెన్నను పంచడమే కాదు. పెద్దయ్యాక తన బాల్యమిత్రుడు కుచేలునికి ఎన్నో ఐశ్వర్యాల్ని ప్రసాదించిన ఉదారుడాయన. ఎన్నో రాజ్యాలకు రాజు కాగల అవకాశం వుండి కూడా, యేనాడూ రాజు కాలేదు. ఆ అవకాశాల్ని గౌరవంగా పెద్దలకే వదిలాడు. శిశుపాల, జరాసంధాదులను సంహరించినప్పుడు వారి రాజ్యాలను కాజేయలేదు. వారి పిల్లలకే యిచ్చివేశాడు. తాను నిరంతరం ప్రజల మనిషిగా సామాన్యులకు కూడా అందుబాటులో ఉంటూ - పేద, గొప్ప తేడాలు లేకుండా అందరినీ అలరిస్తూ బ్రతికాడు.

❦ ❦ ❦

## ★రోటికి కట్టబడిన శ్రీకృష్ణుడు ★

బాలకృష్ణుడు అల్లరిగా తిరుగుతున్నాడని యశోద అతణ్ణి ఒక రోలుకు త్రాడుతో కట్టివేసిందట. శ్రీకృష్ణుడు ఆ రోలును యీడ్చుకుంటూ వెళ్తున్నాడు. అక్కడ రెండు పెద్ద మద్ది చెట్లున్నాయి. ఆ చెట్ల మధ్య ఇరుక్కుపోయింది రోలు. శ్రీకృష్ణుడు లాగుతుంటే రోలు కదలడం లేదు. పరమాత్ముడైన శ్రీకృష్ణుడు బలంగా లాగేసరికి రెండు మద్ది చెట్లూ నిలువునా విరిగిపడ్డాయి. రోలు విడుదలయి వచ్చింది. కూలిపోయిన మద్దిచెట్లు, గంధర్వులుగా మారిపోయారు. శాప కారణంగా చెట్లుగా మారిన తమకు శాపవిమోచనం అయిందని చెప్పి, శ్రీకృష్ణునికి నమస్కరించి వెళ్ళిపోయారు వాళ్ళు.

ఈ గాథలోనూ అంతరార్థం వుంది. కామానికి లొంగి పోరాదనీ, మితిమీరిన కామం అనర్థ హేతువనీ మరో విధంగా చెప్తున్నాడు శ్రీకృష్ణుడు. అల్లరిగా తిరిగే బాలకృష్ణుడంటే స్వేచ్ఛగా తిరిగే మానవ యువకుడని యిక్కడి భావం. అతనికి పెద్దలంతా కలసి వివాహం చేస్తారు. యశోద శ్రీకృష్ణుని రోటికి బంధించడం అంటే

అదే! సంసార జీవితం, రోలుగా పోల్చబడింది. దానికి కట్టబడిన త్రాడే సంసార బంధం. స్వేచ్ఛగా తిరిగే మానవుడు పెద్దలు వేసిన సంసార బంధం వల్ల ఆ సంసారిక జీవితాన్ని లాక్కొంటూ ముందుకు సాగిపోతుంటాడు. శ్రీకృష్ణుడు రోలును యీడ్చుకుంటూ వెళ్ళడంలో వున్న అర్థం అదే

సంసార జీవితంలో ఒక భాగం 'శృంగారం'. ఏ మానవుడైనా మితిమీరి కళ్ళు మూసుకుపోయిన కామానికి లొంగిపోతే, యిక అతని జీవితం అధోగతే! రెండు మద్ది చెట్లకు మధ్య ఇరుక్కుని, రోలు ఆగిపోవడంలో అర్థం అదే! ఆ మద్ది చెట్లే, కన్నుగానని కామానికి ప్రతీకలు. అవి రోటిని ఆపివేసినట్లుగా మితిమీరిన కామం మన జీవితాన్నే స్తంభింపజేస్తుంది.

మహాభారతంలో విచిత్రవీర్యుని చూడండి. అతడు తన భార్యలైన అంబిక, అంబాలికలతో రాత్రింబవళ్ళు అవిశ్రాంతంగా కళ్ళు మూసుకుపోయిన కామంతో చరించడంవల్లనే రోగగ్రస్తుడై మరణించాడు. మితిమీరిన కామం వల్ల జీవితం నాశనం కావడమంటే అలా ఉంటుంది.

నేడు కూడా ఎందరో మానవులు విపరీత కామాతురులై, చెడుమార్గాలు పట్టి రోగగ్రస్తులవుతున్నారు. ఎయిడ్స్ వంటి రోగాలతో మరణిస్తున్నారు. అందుకే ముందుగా యీ అతి కామాన్ని జయించాలి.

అయితే అదెలా సాధ్యం?

శ్రీకృష్ణుడు ఒక్క దెబ్బతో మద్దిచెట్లను కూల్చినట్లుగా మానవుడు కూడా కామాన్ని జయిస్తే, ఆయన రోటిని లాక్కొని పోయినట్లుగా మానవుడు తన జీవితాన్ని సమర్ధవంతంగా నడిపించుకోగలడు. పరమార్థాన్ని సాధించగలడు.

ఈ సందర్భంలోని మద్దిచెట్లు మితి మీరిన కామానికి ప్రతీక లెలా అయ్యాయని కొందరికి సందేహం కలగవచ్చు. అందుకోసం ఆ మద్ది చెట్ల పూర్వగాథను తెలుసుకోవాలి మనం. ఆ చెట్లు నిజానికి ఇద్దరు గంధర్వులు. వారిద్దరూ మితి మీరిన కామంతో దిగంబరంగా తయారై, కొందరు గంధర్వ కన్యలను కూడా దిగంబరంగా చేసి, స్వేచ్ఛగా ఒక తోటలో కామ క్రీడలాడసాగారు. ఆ సమయంలో నారద ముని అక్కడకొచ్చాడు. ఆయన్ని చూసి సిగ్గుతో గంధర్వ స్త్రీలు చాటుకు పారిపోయారు. కానీ ఈ ఇద్దరూ మాత్రం కామంతో ఒళ్ళు తెలియని వారై, అదే విధంగా చెట్ల వలె నిటారుగా నిలుచున్నారు.

"ఆ చెట్లకూ, మీకూ తేడా యేముందిక? అందుచేత మీరు నిజంగా చెట్లుగా మారిపొండి. మీ గర్వాంధకారానికి, కామాంధకారానికి యిదే శిక్ష" అని శపించాడు నారదుడు. వారు భయపడి క్షమాపణ వేడగా, బాలకృష్ణుని వల్ల శాప విమోచనం జరుగుతుందని నారదుడు చెప్పాడు. వారిద్దరూ మద్ది చెట్లుగా మారారు. ఆ చెట్లను కన్నుగానని కామానికి ప్రతీకలుగా చెప్పడం జరిగింది అందుకే!



## ★ బ్రహ్మదేవుని గర్వభంగం ★

ఒకసారి బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుని పరీక్షించదలచాడు. శ్రీకృష్ణుడు లేని సమయంలో అతని మిత్రులను, వారి ఆవుల మందలను ఒక కొండ గుహలో దాచి వేశాడట. శ్రీకృష్ణుడు ఈ విషయాన్ని గ్రహించాడు. అయితే ఏ మాత్రం చలించలేదు. తానే అన్ని వందల ఆవులుగానూ, గోపబాలురగానూ అనేక రూపాల్లోకి మారిపోయాడు. చిత్రం యేమంటే శ్రీకృష్ణుడు యధాతథంగానే వుండగా ఆయనలోనుండి గోవులు, గోపకుమారులు పుట్టుకొచ్చారు. అందరూ కలసి సాయంవేళ యిళ్ళకు వెళ్ళారు. గోపిక లందరూ ఆ పిల్లల్ని తమ పిల్లలనే భావించారు. కానీ ఎందుకో తమ సంతానంపై వారికి మునుపటి కంటె హెచ్చు ప్రేమాభిమానాలు కలిగాయట. ప్రతిరోజూ ఆ మాయా గోపబాలురు గోవుల్ని మేపడానికి వెళ్ళేవారు, వచ్చేవారు. వారిని తమ పిల్లలుగా భావించేవారు గోపికలు. అలా ఒక సంవత్సర కాలం గడిచింది. బ్రహ్మదేవుడు మళ్ళీ వచ్చి చూశాడు. గోవుల్ని, గోపాలురను తను దాచివేసినా, యధావిధిగా ఇక్కడంతా సవ్యంగా జరిగిపోవడం చూసి ఆశ్చర్యపోయాడు. ఆయనకు అప్పుడు తెలిసింది... శ్రీకృష్ణుడంటే ఎవరో! సకల విశ్వం ఆయనేననీ, చివరకు తనుకూడా ఆయనలోని భాగమే ననీ తెలుసుకున్నాడు. అసలైన గోవుల్ని, గోపాలురను శ్రీకృష్ణునకిచ్చి క్షమాపణ కోరాడు.

చూడండి! సంవత్సర కాలంపాటు గోపికల ఇళ్ళలో గల గోవులన్నీ శ్రీకృష్ణుడే, దూడలన్నీ శ్రీకృష్ణుడే! పిల్లలందరూ శ్రీకృష్ణుడే! ఆ మాటకొస్తే గోపికలు, వారి భర్తలూ మాత్రం యెవరు? వారూ ఆయనలోని వారే! అందరూ శ్రీమహావిష్ణువు నుండి వుద్భవించిన జీవాత్మస్వరూపాలే! అనగా భర్త, భార్య, పిల్లలు, పశువులు, పక్షులు అన్నీ ఆయనే! ఆయన నిరాకారుడు. కానీ ఏ రూపమైనా, యెన్ని రూపాలనైనా దాల్చగల

శక్తివంతుడు. ఈ విషయం మనకు తెలియజేయడానికే ఒక సంవత్సరకాలం గోపాలురుగా, గోవులుగా రూపుదాల్చాడు శ్రీకృష్ణుడు.

❦ ❦ ❦

## ★ గోవర్ధన గిరిధారి ★

ప్రతి యేటా ఇంద్రుణ్ణి పూజించి నైవేద్యాల్ని అర్పించడం వ్రేపల్లె వాసుల అలవాటు. అయితే ఒక సంవత్సరం ఆ అలవాటును మానిపించాడు శ్రీకృష్ణుడు. "ఇంద్రుని పూజించడం కంటే గోవర్ధనగిరిని పూజించండి. ఎందుకంటే మన గోవులకు మేత నిచ్చేది ఆ పర్వతమేకదా" అని వ్రేపల్లె ప్రజలకు చెప్పాడు. వారు అలాగే చేశారు. అందుకు కోపించిన ఇంద్రుడు వ్రేపల్లె ప్రజలపై రాళ్ళ వర్షం కురిపించాడు. అప్పుడు ఆ ప్రజలంతా శ్రీకృష్ణుణ్ణి శరణు కోరారు. వారిని రక్షించడానికి శ్రీకృష్ణుడు గోవర్ధన గిరినే పెకలించి, దాన్నే గొడుగుగా పట్టుకున్నాడు. వ్రేపల్లె ప్రజలు, గోవులు ఆ పర్వతం క్రింద తల దాచుకుని రక్షించబడ్డారు.

రాతి బొమ్మలకు మ్రొక్కితే ఫలితం వస్తుందా? అని హేళన చేస్తూంటారు కొందరు మూర్ఖులు. విగ్రహారాధనను నిరసిస్తారు. కానీ ఒక రాతిలోనే కాదు. సకల సృష్టిలోని చరాచరాలన్నింటా భగవదంశ వుంటుందని శ్రీకృష్ణుడు నిరూపించాడిక్కడ. తమ పాడి పశువులకు జీవనాన్నిచ్చే గోవర్ధనగిరి కూడా దైవ సమానమేననిచెప్పి, దాన్ని పూజించమన్నాడు. వారు నమ్మకంగా, భక్తితో పూజించారు. అనంతరం వారికి ఆపద రాగా ఆ పర్వతమే వారికి నీడనిచ్చి రక్షించింది

ఈ సందర్భంలో ప్రజలు పూజించింది గోవర్ధన గిరిని.

శరణు కోరింది శ్రీకృష్ణుణ్ణి.

ప్రజల్ని రక్షించవలసిన పూచీ యిరువురికీ వుంది. అందుకే ఆయన ప్రత్యక్షంగా గిరిని ఎత్తాడు. ఆ విధంగా యిరువురూ కలసి ప్రజల్ని రక్షించడం జరిగింది.

ప్రతి వస్తువులోనూ పరమాత్ముడుంటాడనీ, మనం భక్తిగా పూజిస్తే ప్రాణం లేని వస్తువు కూడా దానిలోని భగవదాంశ వల్ల తప్పక ఫలితాన్ని ఇస్తుందనీ, భక్తుల కోసం భగవంతుడు అసంభవాల్ని సంభవాలుగా చేసి రక్షిస్తాడనీ, దానికోసం మనకు

కావలసింది కేవలం నిష్కల్మష భక్తి మాత్రమేననీ ఈ సందర్భంగా తెలియజేస్తున్నాడు శ్రీకృష్ణుడు.

❦ ❦ ❦

## ★ అస్ఖలిత బ్రహ్మచారి ★

బ్రహ్మచారి అనగా 'పెళ్ళికానివాడు, స్త్రీని కూడని వాడు' అని సామాన్య అర్థం. "బ్రహ్మమునందు చరించువాడు" అనేది నిజమైన అర్థం. అనగా అనుక్షణం ఎవరి మనసు పరబ్రహ్మమునందే చరిస్తుందో వారే బ్రహ్మచారులు.

ప్రతి పురుషునకూ వీర్యస్ఖలనమవుతుంది. శృంగార ధ్యాసతోనూ, కోరికలతోనూ వీర్య స్ఖలనమయితే బ్రహ్మచర్యం వీడినట్లుగాను; నిద్రపోయే సమయంలోనో, మూత్ర విసర్జన సమయంలోనో వీర్యస్ఖలనమయితే - వారు బ్రహ్మచర్యంలో వున్నట్లుగాను భావిస్తాం కదా! ఎందువల్ల అలా భావిస్తాం? ఎలా అయినా వీర్య స్ఖలనం జరిగింది కదా మరి! బ్రహ్మచర్యం అనేది శరీరానికి సంబంధించినది కాదు. అది పూర్తిగా మనసుకు సంబంధించినది. మనసున శృంగార కోరిక లేకుండా వీర్యస్ఖలనం అయితే బ్రహ్మచర్యానికి భంగం లేనట్లే! వీర్యస్ఖలనం కాకపోయినా, మానసికంగా శృంగారాన్ని ఊహించుకునే వాడు బ్రహ్మచర్యాన్ని కోల్పోయినట్లే. దాన్నే మానసిక వ్యభిచారం అంటారు.

అందుకే పూర్వం సంతానం లేని రాజులు, తమ రాణులకు సంతానం కలిగించేందుకు దేవర న్యాయాన్ని అనుసరించేవారు. తన మనసును పరబ్రహ్మయందే ఉంచి, కేవలం సంతాన ప్రదానానికే తన శరీరాన్ని ఉపయోగించగల యోగపురుషులను ఆ కార్యక్రమానికి వినియోగించేవారు. మహాభారతంలో వేదవ్యాసుడు ఆ విధంగానే అంబిక, అంబాలికలకు సంతాన దానం చేశాడు. అతడు బ్రహ్మచారే మరి!

అదేవిధంగా శ్రీకృష్ణుడు ఏనాడూ శృంగారం కోసం ప్రాకులాడలేదు. ఏ స్త్రీనీ కోరికోరి తాకలేదు. సర్వాంతర్యామి అయిన ఆయన్ని ఎవరైతే కోరి కోరి వచ్చి, పరీక్షలకు నిలిచి గెలుస్తారో, వారే ఆయన్ని కలవగలరు. అది కేవలం జీవాత్మ, పరమాత్మల సంధానమే గాని, శృంగారం మాత్రం కాదు. అందుకే ఆయన అస్ఖలిత బ్రహ్మచారి.

❦ ❦ ❦

## ★ కృష్ణుడు - గోపికల సంబంధం ★

కృష్ణుడు, గోపికల సంబంధం కామానికి సంబంధించినదని అనేకమంది భావిస్తుంటారు. అది చాలా పొరబాటు. 'కామ, సంభోగ క్రియల సుఖం' అనేది ఇహలోక జీవులకే గాని- భగవంతునికి వాటితో పనేమిటి? పురుషుడూ ఆయనే, స్త్రీ కూడా ఆయనే! సకల చరాచరాలన్నీ ఆయన ప్రతిరూపాలే! ఈ విషయం గుర్తుంచుకుంటే మన అజ్ఞానాంధకారం తొలగిపోతుంది.

కృష్ణుడు, గోపికల మధ్య కామ సంబంధమేమీ లేదు. వారి సంబంధం కేవలం భగవంతునికి, భక్తులకు మధ్య వుండే ప్రేమానుబంధం. ముక్తిని ఆశించే జీవాత్మలు, పరమాత్మ సన్నిధిని చేరి పొందే దివ్యానుభూతి అది. ఆ దివ్యానుభూతినే 'రాసకేళి' అన్నారు ఆ రాసకేళి, స్ఖలనం ప్రసక్తి లేనిదని భాగవతం స్పష్టంగా చెప్తోంది. అందువల్ల అది కామకేళి ఏమాత్రమూ కాదు. తేజోవంతమైన పరమాత్మ సన్నిధిలో గోపికలు మాత్రమే కాదు - సకల ప్రపంచమూ, సకల విశ్వమూ ఒకేసారిగా ఆనంద సాగరంలో ఓలలాడగలదు

శ్రీకృష్ణ గోపికా సంగమానికి అర్థమే వేరు. ఆ లీల ద్వారా శ్రీకృష్ణుడు - 'జీవాత్మలు పరమాత్మను ఎలా చేరాలనే జ్ఞానాన్ని' బోధించాడంతే! ఇల్లు, ఇల్లాలు, భర్త, పిల్లలు అన్నీ ఆయనే అని అర్థం చేసుకుని భవబంధాలను ప్రక్కన పెట్టి, ఏకాగ్ర చిత్తంతో ఆయన్నే ప్రార్థిస్తే మనకు ముక్తి, మోక్షం లభిస్తాయి. అలాకాకుండా శ్రీకృష్ణ గోపికా సంగమాన్ని కేవలం శృంగార క్రీడగా భావించి, తాము కూడా విచ్చల విడిగా శృంగార జీవితం గడిపితే - వారికి అనారోగ్యం ప్రాప్తిస్తుంది. చివరకు నాశనమౌతారు.

## ★ వేణుగానం లోని ఒక పరమార్థం ★

గోపికలు రాసక్రీడకు త్వరగా రాకపోతే శ్రీకృష్ణుడు తన వేణువును ఊదేవాడట. ఆ వేణుగానం వింటూనే గోపికలు ఆయన దగ్గరకు వెళ్ళేవారట. 'గోపికలను అలా రప్పించుకోవడం మర్యాదైన పనేనా? ' అని కొందరి సందేహం. అయితే అందులోనూ ఓ పరమార్థం వుంది మరి.

వేణుగానం వినిపించగానే గోపికలంతా తమకు తెలియకుండానే సమ్మోహితులై శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళిపోయేవారు. వేణుగానం వినిపించే సమయానికి వారు యేపనిలో వున్నా సరే, వెంటనే ఆ పనిని వదిలేసి మరీ వెళ్ళిపోయేవారట. తిండి తింటున్నా, పిల్లలకు పాలు యిస్తున్నా, తలదువ్వుకుంటున్నా... ఇలా ఏ పని చేస్తున్నా సరే... వేణుగానం వినగానే మైమరచి వెళ్ళిపోయేవారట.

బాగా తరచి చూడగా...

ఈ సందర్భంలోని వేణుగానాన్ని 'భగవంతుని పిలుపు'గా గ్రహించవచ్చు మనం. గోపికలంటే జీవుల్లోని ఆత్మలు. భగవంతుని పిలుపు రాగానే - ఏ జీవాత్మ అయినా సరే, తన శరీరాన్ని విడిచి వెళ్ళిపోవలసిందే! ఈ జీవితం శాశ్వతం కాదు. ఏ నిముషంలోనైనా భగవంతుని పిలుపు రావచ్చు. ఆ సమయంలో యెవరెంతటి పనిలో నిమగ్నమైవున్నా సరే, జీవాత్మ ఆ శరీరాన్ని విడిచి పరమాత్మను చేరవలసిందే!

తమ మరణం యెప్పుడో యే జీవికీ ముందుగా తెలీదు. అయితే ఏదో ఒకనాడు ఆ భగవంతుని పిలుపు తప్పక వస్తుంది. వెళ్ళి తీరాలి. అందువల్ల తెలివైన జీవులు తమ విధులను పూర్తిచేసుకుని, ఉత్తమ కార్యాచరణతో పుణ్యం సంపాదించుకుని, ఆ భగవంతుని పిలుపు కోసం భక్తితో ఎదురుచూస్తాయి. ఈ విషయాన్ని సూచిస్తూ భాగవతంలో మరోమాట వ్రాయబడింది. 'వేణుగానం వినగానే, చేస్తున్నపని వదిలి వెళ్ళేవారు కొందరయితే, అన్ని పనుల్ని ముందే ముగించుకుని వేణుగానం కోసం యెదురు చూసేవారు కొందరుండేవారట'. (భగవంతుని పిలుపు వచ్చిందంటే వయోలింగభేదాలు, పేదా గొప్ప తారతమ్యాలూ ఇవేవీ లేకుండా ఇహలోకాన్ని వీడి వెళ్ళిపోవలసిందే! మనకు ఆశలూ, కోరికలూ అన్నీ తీరే వరకూ మరణం ఆగదు. ఎవరి కర్మ ఫలాన్ని బట్టి వారు, ఎలా మరణించాలో అలా మరణించి తీరుతారు. భగవంతుని పిలుపు వచ్చిందంటే, చేస్తున్న పని కూడా వదిలి పెట్టేసి - ఆయన వద్దకు వెళ్ళిపోవలసిందే! అందుకని జీవన విధులన్నీ ఎప్పటికప్పుడు ధర్మమార్గాన పూర్తి చేసుకుంటూ ఉండాలి మనం.)

వేణుగానం వినగానే గోపికలు తమ ఇళ్ళనూ, తమ వాళ్ళనూ విడిచి పరిగెత్తుకుంటూ శ్రీకృష్ణుని చేరడంలో ఇంత చక్కని భావం ఉంది.

భగవంతుని పిలుపు మనకు ఎప్పుడైనా రావచ్చు. అప్పుడు మనమూ - మన

తల్లిదండ్రుల్నీ, జీవితభాగస్వామినీ, బిడ్డల్నీ, సహోదరుల్నీ, ఇతర బంధువుల్నీ... అందర్నీ తక్షణం విడిచిపెట్టి వెళ్ళిపోవలసిందే! గోపికల పరుగులో ఇంతటి అంతరార్థం గోచరిస్తుంది చూడండి.

వేణుగానానికి ఇంకా అనేక పరమార్థాలున్నాయి. అది సకల లోకాలకూ జోలపాటా, మేలుకొలుపూ కూడా! జీవుల్ని ఆడించే భగవంతుని నాదస్వరం అది.



## ★ గోపికా వస్త్రాపహరణం ★

గోపికా వస్త్రాపహరణంలో చక్కటి అంతరార్థం ఉంది. శరీరాలు శాశ్వతాలు కావనీ, వాటిలోని జీవాత్మలే శాశ్వతాలనీ, శారీరిక మోహాన్ని విడిచి పెట్టాలనీ - శ్రీకృష్ణుడు ఇందు మూలంగా సూచిస్తున్నాడు.

గోపికలు నగ్నశరీరాలతో నదిలో స్నానం చేస్తుండగా, వారి వస్త్రాల్ని అపహరించాడు శ్రీకృష్ణుడు. నీట్లో మునిగి వుండి చేతులతో శరీరాల్ని దాచుకుంటూ గోపికలు తమ వస్త్రాల్ని అడిగినప్పుడు వాటిని ఇవ్వలేదాయన. శరీరాలపై మోహాన్ని విడిచి, దేవుని ముందు దాచగలిగేదేమీ లేదని గ్రహించి, రెండు చేతులూ జోడించి ప్రార్థించగా - వారి వస్త్రాలను వారికిచ్చాడు. అది ఆ గోపికలకు ఒక పరీక్ష.

గోపికలతో శ్రీకృష్ణునికి అక్రమ శారీరిక సంబంధమే కనుక ఉంటే, వారు తమ నగ్న శరీరాల్ని దాచుకునే ప్రయత్నం యొందుకు చేస్తారు? శ్రీకృష్ణునికి కావలసింది వారి నగ్న శరీరాలు కాదు. వాటిలో గల జీవాత్మలు. ప్రతి జీవిలోని జీవాత్మా తనను తాను తెలుసుకుని, పరమాత్మతత్వాన్ని గుర్తించి, అశాశ్వతమైన శరీరాలపై మోహాన్ని వీడి, భక్తితో పరమాత్మను తెలుసుకోవడమే ధ్యేయంగా ఉండాలని ఆయన ఉద్దేశం.

మాయా మోహాలనుండి బయటపడిన గోపికలు ఆయన పెట్టిన పరీక్షలో గెలిచారు. తమ చీరలతోపాటూ శ్రీకృష్ణుని దయను పొందగలిగారు.

ఈ విధంగా అంతరార్థ పూరితమైన పరీక్షలు పెట్టేవాడు శ్రీకృష్ణుడు. గోపికలు నిజంగా కామంలో పడివుంటే, వారు శ్రీకృష్ణుని చేరగలిగేవారు కాదు. పరమాత్మ తత్వాన్నెరిగి పరీక్షలు గెలిచారు కనుకనే, శ్రీకృష్ణుని కృప పొందగలిగారు.

ఆడ, మగ తేడా లేకుండా ప్రతిమానవునిలోని జీవాత్మనూ ఒక గోపికగానూ,

శ్రీకృష్ణుని పరమాత్మగానూ పోల్చి చూడండి. ఆ సందర్భంలో కామానికి ఏమాత్రమూ తావులేదని అర్థమౌతుంది.

మనం శరీరాలపై మోహాన్ని వీడి, ఇహలోక సుఖాల్ని మరచి, ఏకాగ్రచిత్తంతో పరమాత్ముని స్మరించాలి. అలా చేస్తే తప్పక మనకు కైవల్యం ప్రాప్తిస్తుంది.

## ★ అంతమంది భార్యలెందుకు? ★

"కామం లేని శ్రీకృష్ణుడికి అంతమంది భార్యలెందుకు? " అని కొందరి ప్రశ్న. శ్రీకృష్ణునికి ముఖ్య భార్యలు ఎనిమిది మంది. వారు రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ. వీరుగాక మరో 16 వేలమంది భార్యలున్నారు. ఇందరిని యెందుకు వివాహమాడినట్లు? అనిపిస్తుంది. శ్రీకృష్ణుని ముఖ్య భార్యలు ఎనిమిది మందీ సాక్షాత్తూ లక్ష్మీదేవి అంశలే! ఇకపోతే 16 వేల మంది భార్యల సంగతి... పూర్వం 16వేలమంది అప్సరసలు మహావిష్ణువులో లీనమయ్యే కోరికతో తపస్సు చేసారట. వారు ద్వాపరయుగంలో రాజకన్యలుగా జన్మించి, నరకాసురుని చెఱలోపడ్డారు. నరకాసురుని వధ అనంతరం వారంతా శ్రీకృష్ణుని భార్యలయ్యారు. దైవ సంబంధ బంధం వారిది. శ్రీకృష్ణుడు ఏక కాలంలో 16 వేల మంది స్త్రీలను అలరించినట్లుగా భాగవతం చెబుతుంది. మరి ఆవిధంగా ఎవ్వరైనా చేయగలరా? చేయలేని మూర్ఖులంతా శ్రీకృష్ణునితో పోల్చుకోవడం, ఆయన్ని తప్పుపట్టడం - చాలా పొరబాటవుతుంది.

విశ్వరూపుడైన విష్ణు భగవానుడు తన ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క తీరు ఆచరించి చూపాడు. పరశురామావతారంలో ఆజన్మాంతం బ్రహ్మచర్యం ఆచరించి చూపించాడు. శ్రీరామావతారంలో ఏకపత్నీవ్రతం ఆచరించి చూపించాడు. భార్యావియోగం అనుభవించి చూపాడు. ఆ సమయంలో ఇంద్రియనిగ్రహం పాటించాడు. మరి శ్రీకృష్ణావతారంలో... ఎన్ని వేలమందినైనా అన్నిరూపాలతో అలరించగల శక్తివంతుడిగా కన్పిస్తాడు. ఆయనకు అసాధ్యమన్నది లేదు కదా!

లక్ష్మీదేవి ఎనిమిది రూపాల్లో గోచరిస్తుంది. వాటినే మనం అష్టలక్ష్మీ రూపాలుగా పూజిస్తాం. ఆ రూపాల అంశలే కృష్ణావతార సమయాన అష్టభార్యలుగా అవతరించాయి.

మహావిష్ణు అవతారమైన శ్రీకృష్ణుడు, అష్టభార్యలకు 'పతి'. అనగా అష్టఐశ్వర్యాలకు అధిపతి. అష్టైశ్వర్యాల్నీ తన ఆధీనంలో వుంచుకోగలిగినవాడని కూడా మనం ఇందు మూలంగా గ్రహించవచ్చు.

మానవులందరి మనోభావాలూ ఒకేవిధంగా వుండవు. ఎంత గొప్ప అనుబంధం కలవారి మధ్యనైనా ఒక్కొక్కప్పుడు భేదాభిప్రాయాలు, మనస్పర్థలు వస్తుంటాయి. భార్యాభర్తల సంగతికొస్తే. . . వాళ్ళు జీవితాంతం కలసి జీవించవలసిన వారు కనుక, ఒకరితో ఒకరు సర్దుకుపోతూ ఒకరి కోసం ఒకరై జీవించాలి. సంసారాన్ని సాఫీగా నడపడం అంటే. . . అదీ ఒక కళగా భావించవచ్చు. ఈ అవగాహన లేకనే నేడు అనేక కాపురాలు విచ్ఛిన్నం అవుతున్నాయి. ఒక భార్యతో సవ్యంగా సంసారం చేయగల శక్తి నేటి భర్తకూ లేదు. ఒక భర్తను చక్కగా సేవించగల శక్తి నేటి భార్యకూ లేదు. అయితే మహావిష్ణువు, లక్ష్మీదేవిల విషయం అలా కాదుమరి. శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడిగా, లక్ష్మీమాత అష్టరూపాలతో అష్టభార్యలుగా అవతరించారు. సంసారపు ఆటుపోట్లను తట్టుకుని చూపిస్తూ, ఎంతగానో సుఖపడ్డారు.

కేవలం ఒక భార్య లేక ఒక భర్తతోనే సంసారాన్ని నరకం చేసుకునే మానవులకు ఒక సందేశం యిచ్చేందుకే, శ్రీలక్ష్మీనారాయణులు అలా అవతరించారు. భార్య మనస్తత్వాన్ని బట్టి ఎప్పుడు ఎలా మెలగాలో, ఎప్పుడు ఏ విధంగా బుద్ధి చెప్పాలో చేసి చూపాడు శ్రీకృష్ణుడు. ఇందుకు రెండు ఉదాహరణల్ని చూసి ముందుకు వెళ్దాం.

## ★ సమర్థవంతమైన భర్తగా శ్రీకృష్ణుడు ★

నరకాసురుని చెఱనుండి విడిపించిన 16వేల మంది రాజకన్యల్నీ శ్రీకృష్ణుడు వివాహమాడాడు. ఎంతమంది భార్యలున్నా, ఎవరిని ఎలా ఆదరించి ఆనందపరచాలో తెలిసిన శక్తివంతుడాయన. భార్యలందరూ ఎవరికి వారే "శ్రీకృష్ణుడు అనుక్షణం నాతోనే వుంటున్నాడు. సవతులందరిలో నేనంటేనే ఆయనకు ఎక్కువ ప్రేమ" అని అనుకొనేవారట. కారణం ఏమంటే - అందరి వద్దా అన్ని రూపాలతో అనుక్షణం గడిపేవాడాయన.

శ్రీకృష్ణుడు 16 వేల మంది రాజకుమార్తెల్ని అందరకూ అన్ని రూపులై వివాహమాడాడని విన్నాడు నారదుడు. శ్రీకృష్ణుని యోగమాయా ప్రభావాన్ని చూడాలని

అతనికి కోరిక కలిగింది. వెంటనే ద్వారక చేరి, శ్రీకృష్ణుని భార్యల ఇళ్ళన్నీ వరుసగా తిరిగి చూసాడట. ఎక్కడికక్కడే ప్రతి భార్యతోనూ కలిసి ఉన్నాడు శ్రీకృష్ణుడు. ఆ యోగమాయా ప్రభావాన్ని చూసి నారదుడు పులకించి పోయాడట

సమర్ధవంతమైన భర్తగా మెలిగి చూపించాడు శ్రీకృష్ణుడు. ఏ భార్యయందూ ఏనాడూ కోపాన్ని ప్రదర్శించక, వారు కోరినట్లు మసలుతూనే - గర్వించే వారికి గర్వభంగం, భ్రమించేవారికి జ్ఞానోదయం కలిగిస్తూ ఎవరినీ నొప్పించకుండా కాలం గడిపాడు.

మానవ ధర్మాల్ని బోధించడానికే శ్రీకృష్ణుడు ఇటువంటి జగన్నాటకాన్ని నడిపించాడు. సంసార జీవితంలో భార్య భర్తను ఎలా సేవించాలో, రుక్మిణి ద్వారా తెలుసుకుంటాం. కాస్త గర్వం, పొగరుగల భార్య పరిస్థితి, సత్యభామను చూస్తే తెలుస్తుంది. 'భార్యను ఎలా చూసుకోవాలి? ' అనే విషయం కృష్ణుని ద్వారా నేర్చుకోవచ్చు. (ఈ కాలంలో బహు భార్యాత్వం అంతగా లేదు కనుక, సవతులు లేరు. కానీ తోడికోడళ్ళున్నారు కదా! అందుకని శ్రీకృష్ణునిలో విజ్ఞతను నేర్చుకుంటే అన్నదమ్ములు తమ భార్యల మధ్య మంచి స్నేహ సంబంధాలు కలిగించవచ్చు) "భార్యాభర్తలు ఒకరి కోరికలనొకరు మన్నించుకొంటూ, కష్ట సుఖాల్లో ఎలా పాలు పంచుకోవాలి? భార్యలోని ప్రతిభను అణచి వేయకుండా, ఆమెను భర్త ఎలా ప్రోత్సహించాలి? భార్యల మనసులనెలా గెలవాలి? " ఇలాంటి విషయాల్లో ఎలా ప్రవర్తించాలనేది తన ఆచరణ ద్వారా చూపాడు శ్రీకృష్ణుడు.

పై విషయాలేవీ తెలియని అల్లరి మూకలు, శ్రీకృష్ణుని చేష్టలను అవహేళన చేస్తూ మాట్లాడుతుంటాయి. అమ్మాయిల వెంట తిరిగే రౌడీలు తమను శ్రీకృష్ణునితో పోల్చుకోడానికి ప్రయత్నిస్తుంటారు. అది వారి అవివేకానికి పరాకాష్ఠ.

కేవలం ఒక్క భార్యనైనా తృప్తి పరచలేని మానవునికి, వేలాది మంది భార్యల మనసులను ఏకకాలంలో రంజింపజేసిన శ్రీకృష్ణునితో పోలికా? శ్రీకృష్ణునితో పోటీ పడుతూ చట్టబద్ధంగానో, చట్ట విరుద్ధంగానో బహు స్త్రీలతో సంబంధాలు యేర్పరచుకునే మూర్ఖులు, శ్రీకృష్ణుని ముందు తామెందుకూ కొరగామని గుర్తెరిగి, ధర్మబద్ధంగా తమ భార్య ఒక్కదానినైనా సంపూర్ణంగా సుఖపెట్టగలిగితే సంతోషమే!

భార్యాభర్తల్లో ఎవరైనా రెండవ వారిపై కోపంతో తిరగబడితే, రెండవ వారు ఆవేశం పొందకుండా సహనంతో వ్యవహరించి, అదను చూసి మొదటి వారి తప్పును తెలియజేస్తే, వారే సిగ్గుపడి తప్పు దిద్దుకుంటారు. అలాకాకుండా యిద్దరూ ఒకేసారి రెచ్చిపోతే సంసార బంధం తెగిపోగలదు. ఈ సుఖసంసార సూత్రాన్ని సత్యభామ శ్రీకృష్ణుల నుండి నేర్చుకుని అమలు చేస్తే, అంతటా శుభం కలుగుతుంది.

## ★ సత్యభామ గర్వభంగం ★

స్యమంతకమణి వల్ల ఎంతో ధనవంతురాలైంది సత్యభామ. సవతులందరిలో తానే ధనవంతురాలననీ, సౌందర్యవతిననీ, తాను గీసిన గీటును తన భర్త దాటడనీ ఆమె గర్వం. అయినా శ్రీకృష్ణుడు ఆమెను యేనాడూ మందలించ లేదు. పైగా ఆమె కోపగిస్తే బుజ్జగించేవాడు. అహంకారంతో తిరస్కరించినా, కృష్ణుడు కోపగించేవాడు కాదు. ఆమె పారిజాత వృక్షం కావాలని కోరితే, ఇంద్రునితో యుద్ధం చేసి గెలిచి, పారిజాత వృక్షాన్ని తెచ్చియిచ్చాడు.

రణరంగంలో పాల్గొనాలని ఆమె కోరినప్పుడు, నరకాసురునితో యుద్ధానికి వెళుతూ, ఆమెను తీసుకు వెళ్ళి రణకౌశలాన్ని చూపించుకొనే అవకాశాన్ని ఇచ్చాడు. ఆ విధంగా ఆమె వీరనారిగా నిరూపించుకునేలా చేశాడు కూడా।

ఆమె ఎంత పొగరు గల స్త్రీ అయినా కూడా లాలనగా చూస్తూనే, సమయం చూసి గర్వభంగం చేశాడు. "శ్రీ కృష్ణ తులాభారం" సంఘటన మనకు తెలిసిందే కదా। శ్రీకృష్ణుడు కేవలం తనకే స్వంతం కావాలని తలపోసింది సత్యభామ. "పతిదాన వ్రతం" అనే వ్రతాన్ని ఆచరించి, శ్రీకృష్ణుణ్ణి నారదునికి దానం చేసింది. మళ్ళీ ఆయన్ని తానే కొనుగోలు చేసి, తన స్వంతం చేసుకోవాలని యోచించింది. అయితే శ్రీకృష్ణమాయ వల్ల ఆయన్ని కొనగలిగిన ధనం ఆమె యివ్వలేకపోయింది. అప్పుడు రుక్మిణి తన భక్తితో, నారదుని వద్ద నుండి తమ భర్తను విడుదల చేసింది. ఇదంతా శ్రీకృష్ణుడు కల్పించిన లీలా వినోదమే। సత్యభామలోని అహం, గర్వాలను అణచి - గుణవతి అయిన రుక్మిణి ముందు తలదించుకునేలా చేశాడు. సవతుల మధ్య సఖ్యత ఏర్పరచాడు.

## ★ రుక్మిణి గర్వభంగం ★

రుక్మిణి చాలా శాంత చిత్తయే! సకల సుగుణశీలియే! కానీ తాను పట్టమహిషిననే చిరు గర్వం వుండేదట. ఆమెలోని ఆ గర్వాన్ని తొలగించేందుకు శ్రీకృష్ణుడు చిన్న నాటకం ఆడాడు. జగన్నాటక సూత్రధారికి అది మామూలే కదా!

ఒక రోజు రుక్మిణీదేవి తనను సేవిస్తూండగా శ్రీకృష్ణుడు "ఓ రుక్మిణీ! గొప్ప ఐశ్వర్యవంతుడు, వైభవం గలవాడు, గొప్ప వంశస్తుడు, వీరుడు, ఛేది దేశానికి రాజూ అయినవాడు శిశుపాలుడు. నీ అన్నకు మిత్రుడతను. అటువంటి వాణ్ణి కాదని, నువ్వు నన్ను వరించావేమిటి? నేను పశువులకాపరిని, నల్లని వాడను. శత్రువులనుండి తప్పించుకుని వచ్చి, ద్వారకలో నివసిస్తున్నవాడను. ఒకింత ధనవంతుణ్ణయినా కాను. సాళ్వ, జరాసంధ, శిశుపాలాదుల్లో యెవరినైనా వరించక నన్నేల వరించితివి? నీ అన్న రుక్మి యొక్క గర్వం అణచడానికి నిన్ను తీసుకొచ్చి పెళ్ళాడాను గానీ, నిన్ను మోహించి తీసుకురాలేదు నేను" అన్నాడట. ఆ మాటలకు స్పృహ తప్పి పడిపోయింది రుక్మిణి. ఆమెలోని సుగుణాలు తెలియక శ్రీకృష్ణుడు ఆ మాటలనలేదు. ఆమెలోని గర్వాన్ని అణగార్చేందుకు చిన్న షాక్ ట్రీట్‌మెంట్ ఇచ్చాడంతే! శ్రీకృష్ణుడు ప్రేమతో చేసిన తగు ఉపచర్యల అనంతరం లేచిందామె. ఆ క్షణం నుండీ తన గర్వాన్ని వదులుకుని, మహాసాధ్వీమణిగా నడచుకుంది.

❦ ❦ ❦

## ★ అర్జున గర్వభంగం ★

శ్రీకృష్ణునికి అర్జునుడు ప్రియసఖుడు. నరనారాయణుల్లో నారాయణుడు శ్రీకృష్ణుడయితే, అర్జునుడేమో నరుడు. తనకెంత దగ్గరవాడయినా సరే, అహంకారానికి లోనైతే మాత్రం, శ్రీకృష్ణుడు ఉపేక్షించేవాడు కాదు. అర్జునుడికి ఆయన ఒకసారి గర్వభంగం ఎలా చేశాడో తెలుసుకుందాం.

శ్రీకృష్ణుని ద్వారకానగరంలో ఒక బ్రాహ్మణుడుండేవాడు. వరుసగా తొమ్మిది మంది పుత్రుల్ని - పుట్టిన వెంటనే పోగొట్టుకున్నాడతను. 'రాజుల అధర్మ ప్రవర్తన వల్లనే, ప్రజలకు అలాంటి కష్టాలుకలుగుతాయని' ఏడుస్తూ - రాజునూ, దైవాన్నీ అతను తిట్టుకో సాగాడట. అప్పుడు అక్కడే వున్న అర్జునుడు కలిగించుకుని "ఓ బ్రాహ్మణా!

నీ దుఃఖాన్ని పోగొట్టగల ఒక్క విలుకాడు కూడా ఈ నగరంలో లేకపోవడం, నిజంగా మీ దురదృష్టం. బ్రాహ్మణ దుఃఖాన్ని తీర్చలేనివాడు రాజేకాదు. నేనిదే వాగ్దానం చేస్తున్నాను మరణించిన నీ కుమారులందరినీ తిరిగి తెచ్చి నీకు అప్పగిస్తాను. నేను అలా చేయలేకపోతే, అగ్ని ప్రవేశం చేసి మరణిస్తాను" అన్నాడు. అదంతా విన్నాడు శ్రీకృష్ణుడు. అర్జునుడి అహంకారం అర్థమయింది. తనేదో గొప్ప విలుకాడిననీ, దేవేంద్రుణ్ణి సైతం గెలిచేశాననీ గర్వానికి లోనౌతున్న అర్జునుడికి గుణపాఠం చెప్పాలని నిశ్చయించుకున్నాడు.

బ్రాహ్మణుడి భార్య మళ్ళీ ప్రసవించే సమయం వచ్చింది. తన పదవ సంతానాన్ని రక్షించమని, అర్జునుణ్ణి ముందుగా వేడుకున్నాడు బ్రాహ్మణుడు. అర్జునుడు వెంటనే తన దివ్యాస్త్రాలతో వెళ్ళి, పురుటింటి చుట్టూ ఒక బాణాల పంజరం అల్లి, మృత్యువును ఎదిరించడానికి సిద్ధంగా ఉన్నాడు. బ్రాహ్మడి భార్య ప్రసవించింది. మగ బిడ్డ పుట్టాడు. అయితే పుట్టిన వెంటనే ఆ బిడ్డ మాయమైపోయింది. అర్జునుడు ఆశ్చర్యపోయాడు. బ్రాహ్మణుడు దుఃఖావేశంలో అర్జునుణ్ణి దూషించాడు. ప్రతిజ్ఞ నెరవేర్చలేకపోయావని పరిహాసం చేశాడు. అర్జునుడు పౌరుషంతో బయలుదేరి, మాయమైన బిడ్డకోసం యమ, ఇంద్ర, వరుణ మొదలైన లోకాలన్నీ వెదికి చూశాడు. ఎక్కడా బ్రాహ్మణ పుత్రుని జాడలేదు. తన వాగ్దానం నెరవేర్చలేనందుకు అగ్ని ప్రవేశానికై సిద్ధపడ్డాడు అర్జునుడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతనిని వారించి, బ్రాహ్మణ పుత్రుని చూపిస్తాను రమ్మని తన రథంపై తీసుకువెళ్ళాడు. కృష్ణార్జునులెక్కిన ఆ రథం సప్త సముద్రాలు, సప్త ద్వీపాలూ, పర్వతాలూ దాటి మేరు పర్వతం మీదగా ప్రయాణిస్తూ గాఢాంధకారంలోకి ప్రవేశించింది. ఆ గాఢాంధకారంలో రథం ప్రయాణించడం కష్టతరమైంది. అప్పుడు శ్రీకృష్ణుడు సుదర్శన చక్రాన్ని ప్రయోగించగా, అది అక్కడి చీకట్లను తొలగిస్తూ విపరీతమైన వెలుగుల్ని వెదజల్లి మార్గాన్ని చూపింది. ఆ వెలుగుల్ని చూడలేకపోయాడు అర్జునుడు. ఆ వెలుగుల్లో రథ ప్రయాణం సాగింది. కొంతసేపటికి ఒక దివ్యమైన ప్రదేశానికి చేరుకుంది రథం. అక్కడ దివ్య తేజస్సుతో వెలుగొందుతున్న శ్రీ మహావిష్ణువు కన్పించాడు. ఆయన కృష్ణార్జునులనుద్దేశించి "మీరిద్దరూ నా అంశతో జన్మించిన మహనీయులు. మిమ్మల్ని ఒకసారి చూడాలనుకున్నాను. మిమ్మల్ని ఇక్కడకు రప్పించడానికే నేను ఆ బ్రాహ్మణ పుత్రుల్ని తెచ్చి దాచాను" అని చెప్పి, ఆ బ్రాహ్మణ

కుమారులందరినీ తిరిగి అప్పగించాడు.

ఆ బ్రాహ్మణ కుమారుల్ని తీసుకొచ్చి వారి తల్లిదండ్రులకు అప్పగించారు కృష్ణార్జునులు. శ్రీకృష్ణుని మహిమ చూసి ఆశ్చర్యపోయాడు అర్జునుడు. అతని గర్వం నశించింది.

ఈ అర్జున గర్వభంగ గాథలో మనకు ఖగోళ విజ్ఞానం కూడా కనపడుతోంది. అదేమిటో క్లుప్తంగా తెలుసుకుందాం.

కృష్ణార్జుల రథం సప్త సముద్రాలను, ద్వీపాలను, పర్వతాలనూ దాటి - మేరు పర్వతం మీదుగా గాఢాంధకారంలోకి ప్రవేశించిందని చెప్పుకున్నాం కదా! అంటే వారి రథం మన భూమినిదాటి అంతరిక్షంలోకి ప్రవేశించిందన్నమాట. మేరు పర్వతమంటే ఉత్తర ధృవం. (వివరాలకు మా "పురాణాల్లో సైన్స్" పుస్తకం చదవండి.) ఆ ఉత్తర ధృవం వైపుగా వారి రథం ఆకాశమార్గాన ప్రయాణించి భూవాతావరణాన్ని దాటి, అంతరిక్షంలోకి దూసుకుపోయిందన్నమాట. భూవాతావరణం దాటిన తర్వాత అంతరిక్షం అంతా గాఢాంధకారంగానే ఉంటుంది. అందుకే విశ్వరూపుడైన శ్రీమహావిష్ణువు అసలురంగు 'నలుపు' అని మహాభారతంలో వర్ణించబడింది. ఆ గాఢాంధకారం ద్వారా అలా ప్రయాణిస్తూ పోతే, వివిధ నక్షత్ర మండలాల్లోకి వెళ్ళవచ్చు. దేవతా లోకాలుండేది అక్కడే! శ్రీకృష్ణార్జునుల రథం చీకటి ప్రాంతమైన అంతరిక్షం గుండా అలాగే ప్రయాణించి, విష్ణువుయొక్క తేజోమయరూపాన్ని చేరుకుందన్నమాట.

మన ఇతిహాస, పురాణ విషయాలెన్నో, ఆధునిక ఖగోళ పరిజ్ఞానానికి అనుగుణంగా ఉన్నాయి. ఇది మన హిందువులకెంతో గర్వకారణం.

## ★ భక్తవత్సలుడు శ్రీకృష్ణుడు ★

దేవకీ వసుదేవులకు పుట్టాడు శ్రీకృష్ణుడు. కానీ పెరిగింది యశోదా, నందులవద్ద. పుట్టిన వెంటనే యశోదా, నందుల యింటికి వచ్చేశాడు. ఎందుకని? కంసుడంటే భయపడడంవల్లనా? దేవకితోపాటు జైలు జీవితం గడపాలనా? ... అదేదీ కాదు. అతని భక్త వత్సలతకు అది ఒక నిదర్శనం. యశోదా, నందుల భక్తికి ప్రతి ఫలం యివ్వడానికి వచ్చాడాయన.

వశువులు అనబడు దేవతల్లో ఒక వశువు పేరు ద్రోణుడు. అతని భార్య పేరు "ధర". దైవకార్యార్థం వారిని భూమిపై పుట్టమన్నాడు బ్రహ్మదేవుడు. వారిద్దరూ విష్ణు భక్తులు. వారు భూమిపై పుట్టాలంటే ఒక షరతు పెట్టారు. అది ఏమిటంటే... కొంతకాలం పాటు శ్రీమహావిష్ణువు తమతోపాటుగా అనునిత్యం వుండేటట్లయితే తాము భూమిపై పుడతామన్నారు. అందుకు బ్రహ్మ, విష్ణు ఒప్పుకుని వరమిచ్చారు. ఆ ద్రోణ దంపతులే యశోదా, నందులుగా పుట్టారు. వారికిచ్చిన వరం తీర్చేందుకే, వారి తనయుడుగా కృష్ణుని రూపంలో వారిల్లు చేరాడు విష్ణువు.

భక్తులకు వశుడు శ్రీకృష్ణుడు. గోపికల భక్తికి మెచ్చి, వారిని దరి చేర్చుకున్నాడాయన. భగవంతునితో భక్తుల అనుబంధం ఏ మాత్రమూ కల్మషం లేనిది. ఇందుకు ఉదాహరణగా భాగవతంలోని ఒక సంఘటన గురించి తెలుసుకుందాం.

ఒకసారి శ్రీకృష్ణుడు, అతని మిత్రులు బృందావనంలో పశువుల్ని మేపుతూ తిరిగి తిరిగి అలసిపోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు తన మిత్రుల్ని అక్కడకు దగ్గర్లో వున్న మునుల వద్దకు ఆహారం కోసం పంపాడు. ఆ మునులు శ్రీకృష్ణుని అభ్యర్థనను లెక్క చేయలేదు. విషయం తెలిసిన శ్రీకృష్ణుడు ఆ మునుల యొక్క భార్యల్ని అడిగి ఆహారం తెమ్మని తన మిత్రుల్ని మళ్ళీ పంపాడు. శ్రీకృష్ణుని మాట వినగానే ఆ ముని పత్నులు త్వరగా వంటలు చేసి, తామే ఆ వంటకాలను తీసుకుని శ్రీకృష్ణుని వద్దకు బయలుదేరారు. తమ భర్తలు వారించినా కూడా వారు వినలేదు. మునిపత్నులు తెచ్చిన ఆహారాన్ని శ్రీకృష్ణుడు, గోపాలురు తృప్తిగా తిన్నారు.

"అమ్మలారా! యిక మీరు మీ యిళ్ళకు వెళ్ళండి" అన్నాడు శ్రీకృష్ణుడు. తమ భర్తల్ని ధిక్కరించి వచ్చినందున ఆ స్త్రీలు మళ్ళీ యిళ్ళకు వెళ్ళేందుకు భయపడ్డారు. అప్పుడు శ్రీకృష్ణుడు వారితో "నా వద్ద యింతసేపు వున్నందుకు మిమ్మల్ని మీ భర్తలు ఏమీ అనరు, కోపించరు. దేవతలైనా మిమ్ము తప్పు పట్టరు. పైగా మిమ్మల్ని కీర్తిస్తారు. ఎందుకంటే నా సంగమం ముక్తిని కలిగించేదే గాని ఐహిక సుఖాల్ని కలిగించేది కాదు. నన్ను ధ్యానించువారు, నన్ను చేరాలని కోరువారు, నా లీలల్ని విని ఆనందించువారు కర్మబంధాల నుండి విముక్తి పొందుతారు. అన్య విషయాల్ని మరచి నాయందే మనసు నుంచువారు, తుదకు నన్నే చేరుతారు" అని చెప్పి వారి భయాన్ని తీర్చి, వారి ఆశ్రమాలకు పంపించాడు. వారిని

మునులు ఏమీ అనలేదు (అదే శ్రీకృష్ణ మహిమ) చూశారా! పరస్త్రీలతో తనకున్నది తుచ్ఛమైన శారీరక సౌఖ్య బంధం కాదని, అది జీవాత్మ పరమాత్మల పవిత్రబంధమనీ, అది ముక్తికి మార్గమనీ వివరించడానికి స్వయంగా శ్రీకృష్ణుడే చెప్పిన ఈ ఒక్క మాట చాలు కదా! (గోపికల భర్తలు శ్రీకృష్ణుని పరమాత్మ తత్వాన్ని గుర్తించారు కనుకనే, తమ భార్యలు ఆయన వద్దకు వెళ్ళినా, మరో విధంగా భావించుకోలేదు.)

ముక్తికోసం తపస్సులు చేస్తున్న ఋషులు, శ్రీకృష్ణుడే దేవుడని ముందుగా గమనించలేక ఆహారాన్ని యివ్వలేదు. కానీ వారి భార్యలు శ్రీకృష్ణ భగవానుని గుర్తించి భర్తల్ని సహితం లెక్కచేయక, ఆహారం తీసుకు వెళ్ళి భగవంతుని కృపకు పాత్రులయ్యారు. శ్రీకృష్ణుని మనసులో నిలుపుకున్నందుకు ముక్తిని పొందారు. ఎంతో తపస్సు చేసిన వారి భర్తలకే అది సాధ్యం కాలేదు.

ఒకసారి పశువుల్ని కాయడం కోసం అడవిలోకి వెళ్ళిన గోపాలురు దావాగ్నిలో చిక్కుకుపోయి, తమను కాపాడేవాడు కేవలం శ్రీకృష్ణుడే అనే నమ్మకంతో "శ్రీకృష్ణా! రక్షించు" అంటూ ఏకాగ్ర చిత్తంతో అరిచే సరికి, ఆయన ఆ దావాగ్నిని గుప్పిటతో పట్టి గుక్కిట మ్రింగివేసి గోపాలురను కాపాడాడు.

మధురకు వెళ్ళేముందు గోపికలకు ఒక పరీక్ష పెట్టాడు శ్రీకృష్ణుడు. తనని మరచిపొమ్మనీ, తమ తమ ఇళ్ళకు వెళ్ళిపొమ్మనీ చెప్పాడు. గోపికలు వినలేదు. శ్రీకృష్ణుని సన్నిధానం తప్ప మరేదీ వద్దన్నారు. ఇహలోక సౌఖ్యాల్ని వదులుకుని, దైవసన్నిధిని కోరిన వారే ముక్తికి అర్హులుకదా! గోపికల ఏకాగ్రతకు మెచ్చి తన యోగశక్తిచే ఆత్మారాముడై గోపికల జీవాత్మలకు సంతోషం కలిగించాడాయన. అదియే శ్రీకృష్ణమాయ.

మధురానగరిలో కుబ్జ విషయం కూడా యిటువంటిదే! కుబ్జ శరీరం అక్రమాకారంతో వికారంగా వుండేది. శ్రీకృష్ణుడు ఆమె భక్తికి మెచ్చి, ఆమె శరీరాన్ని అతి సుందరంగా మార్చివేశాడు. ముక్తిని ప్రసాదించాడు.

ఎవరైతే (స్త్రీ అయినా పురుషుడైనా సరే) పరమాత్ముని సాన్నిహిత్యాన్ని కోరుదురో, అట్టివారి కలయికలోని అంతరార్థం 'ముక్తిని కోరుటయే!' ఇది సత్యం. దీన్ని నమ్మినవారు ధన్యులు. నిందించేవారు దౌర్భాగ్యులు.

శ్రీకృష్ణ బలరాములు, వారి మిత్రులు మధురానగరంలో ప్రవేశించినప్పుడు

ఒక చాకలివాడు ఎదురయ్యాడట. కంసుని అండగల ఆ చాకలి బహు గర్విష్ఠి. తమకు మంచి రాజవస్త్రాలు యెరువిమ్మని వాణ్ణి అడిగాడు శ్రీకృష్ణుడు. నిజానికి శ్రీకృష్ణునికి వస్త్రాలు కొదువా? సంపదలకు కరువా? చాకలివాణ్ణి అడగవలసిన ఖర్మయేమిటి? కేవలం అది చాకలి వాడికి ఒక పరీక్ష మాత్రమే। గర్వాంధుడైన ఆ చాకలివాడు రెచ్చిపోయి "దొంగతనంగా వెన్న, మీగడలు మ్రింగి క్రొవ్వెక్కి మదంతో కొట్టుకొంటున్నావా? " అంటూ ఎన్నో విధాల శ్రీకృష్ణుని నిందించాడట. పరీక్ష పూర్తయింది. శ్రీకృష్ణుడు ఒకే ఒక్క పిడిగ్రుద్దుతో వాణ్ణి నరకానికి పంపించాడు.

శ్రీకృష్ణుని మహానుభావునిగా గుర్తించిన ఒక సాలెవాడు పట్టు కుచ్చుల్ని భక్తి పూర్వకంగా ఆయనకు సమర్పించాడట. పూలు అమ్మేవాడొకడు పూలు, చందనం సమర్పించాడట. వారి భక్తికి మెచ్చి, అప్పటికప్పుడే వారికనేక సంపదలు కలిగించాడు శ్రీకృష్ణుడు. వస్త్రాలు, కుచ్చులు, పువ్వులూ కొనలేని అల్పుడు కాదు శ్రీకృష్ణుడు. సాలెవానికీ, పూలవానికీ ఆయన యిచ్చిన సంపదలో ఆ బట్టలూ, పువ్వులూ ఎన్నోవంతు? ఇవన్నీ కేవలం భక్తి పరీక్షలు. ఈనాటికీ కూడా కొందరు శ్రీకృష్ణుని నిందించేవారున్నారు. ఆయన స్త్రీలోలుడు, దొంగ, మాయగాడు అంటూ విమర్శించేవారూ, లోకువగా మాట్లాడేవారూ వున్నారు. వారందరూ కలిపురుషుని అండతో ఆ విధంగా చేస్తుంటారు. కంసుని అండతో శ్రీకృష్ణుని నిందించిన చాకలి వాడికి పట్టిన గతే వారికీ పడుతుంది.

పై సందర్భంలో సాలెవాడు, పూలవాడు శ్రీకృష్ణునకిచ్చింది బహుస్వల్పం. అయితే వారి భక్తి మాత్రం అపారం. పరమాత్ముడు చూసేది ఆ భక్తిని మాత్రమే. అందుకే మంచి ఫలితాన్నిచ్చాడు. అదే విధంగా ఈనాడు మనం భగవంతునికి సమర్పించే కొబ్బరికాయ, అరటిపళ్ళు నైవేద్యాలు, దక్షిణలూ ప్రధానం కాదు. అవి సమర్పించే వారి మనసుల్లోని భక్తి ముఖ్యం. భగవంతునికి కావలసిందదే! ఈ విషయం శ్రీకృష్ణ తులాభారం సంఘటనలో నిరూపితమయింది కూడా. సత్యభామ వేసిన ధనరాశులకు తూగని శ్రీకృష్ణుడు, రుక్మిణి వేసిన తులసి దళానికి తూగిపోయాడు. కారణం? సత్యభామ వేసిన ధనరాశుల వెనుక అహంకారం వుంది. రుక్మిణి వేసిన తులసి దళం వెనుక భక్తి వుంది. అదీ సంగతి!

శ్రీకృష్ణుని భక్తవత్సలతకు నిదర్శనాలుగా మరికొన్ని సంఘటనల్ని చూద్దాం.

శ్రీకృష్ణుడు విద్యాభ్యాసం చేసే కాలంలో ఆయనకు ఒక బ్రాహ్మణ మిత్రుడుండే వాడు. అతని పేరు సుధాముడు అతన్నే కుచేలుడు అని కూడా అంటారు. చాలా కాలం తరువాత కుచేలుడు మితిమీరిన సంతానం కలవాడై బీదతనంతో భార్యాబిడ్డల్ని పోషించలేక, తినడానికి తిండి కూడా లేని స్థితిలో సహాయం కోసం శ్రీకృష్ణుని వద్దకు వచ్చాడు.

మర్యాద కోసం శ్రీకృష్ణునికై తీసుకు వెళ్ళేందుకు కుచేలుని వద్ద ఏదీ లేదు. ముక్కిపోయిన అటుకులు కొద్దిగా వుంటే, వాటినే తనతో తీసుకుని వెళ్ళాడు. తన బీదస్నేహితుడు అభిమానంతో తెచ్చిన చిన్న అటుకుల మూటను ఆప్యాయంగా స్వీకరించాడు శ్రీకృష్ణుడు. ఆ చిరుకానుకకు మారుగా అనంతమైన ఐశ్వర్యాన్ని స్నేహితునికిచ్చాడు. భక్తితో భగవంతునికి సమర్పించిన కానుక ఫలితం ఎలా వుంటుందో, ఇందుమూలంగా మనం గ్రహించవచ్చు. మనం సమర్పించిన కానుక 'చిన్నదా? పెద్దదా?' అని కాదు. అక్కడ "భక్తి" అనేది ముఖ్యం. భక్తితోకూడిన చిరుకానుకకు కూడా అనంతమైన సత్ఫలితాన్ని అందిస్తాడు భగవంతుడు.

ఈసారి మరో సంఘటన చూద్దాం. ద్రౌపదీ వస్త్రాపహరణం చేస్తున్నాడు దుశ్శాసనుడు. ఆ సమయంలో ఆమెను రక్షించే నాధుడే లేడు. ఆమె భక్తితో, నమ్మకంతో "శ్రీకృష్ణా... కాపాడు" అని పిలిచింది. అంతే! భక్త వత్సలుడైన శ్రీకృష్ణుడు క్షణాల వ్యవధిలో వందలాది మైళ్ళ దూరం నుండే అనంతమైన వస్త్రాన్ని తన యోగమాయచే అందించి, ద్రౌపది మానాన్ని రక్షించాడు.

ఆనాడు గోపికల వస్త్రాల్ని అపహరించిన శ్రీకృష్ణుడు, ఈనాడు ద్రౌపదికి చీరలందించి మాన సంరక్షణ చేశాడు. ఈ రెండు సంఘటనల్లో చక్కని ధర్మసందేశం ఉంది. మోహ, మమకారాల్ని వదిలించేందుకు ఆనాడు అలా చేశాడు. ఒక అభాగ్యురాలి మాన సంరక్షణకు ఈనాడు ఇలా చేశాడు. ఇదంతా అర్థం చేసుకోలేని నేటి కలికాలపు ఆకతాయి మూకలు, అమ్మాయిల్ని హింసిస్తూ, తమను శ్రీకృష్ణునితో పోల్చుకోజూస్తారు. ఈ దుర్మార్గులకు భక్షించడమే గాని, రక్షించడం చేతకాదు. అమాయక ఆడపిల్లలపై తమ ప్రతాపాన్ని చూపి, పైశాచిక ఆనందం పొందే వీళ్ళంతా ఆనాటి దుశ్శాసన, కీచక జాతికి చెందినవాళ్ళు. ఆనాడు వారికి పట్టిన గతే, చివరకు వీళ్ళకూ పడుతుంది.

శ్రీకృష్ణుని భక్తవత్సలతకు ఇలా ఎన్నో నిదర్శనాలున్నాయి. ఆయన చూపిన ధర్మ మార్గాన నడిచేందుకు మనమంతా కృషి చేయాలి

## ★ ధర్మపక్షపాతి శ్రీకృష్ణుడు ★

శ్రీకృష్ణుణ్ణి దుర్యోధనాదులు "పాండవ పక్షపాతి" అనేవారు. అయితే శ్రీకృష్ణుడెప్పుడూ "ధర్మపక్షపాతి" మాత్రమే! పాండవులు ధర్మపరులు కనుక, వారికి అండగా నిలిచాడంతే! అయితే ఈ పాండవులెవరనేది ఈ సందర్భంలో మనం తెలుసుకోవలసి ఉంది

ద్వాపరయుగం చివరిలో పాపాత్ములను కడతేర్చి భూభారం తగ్గించేందుకు, శ్రీమహా విష్ణువు శ్రీకృష్ణునిగా జన్మించాడని తెలుసుకున్నాం. ఈ కార్య సహాయార్థం వివిధ దేవతాంశల్నీ, రాక్షసాంశల్నీ కూడా ఆయన భూమిపై పుట్టించాడనీ చెప్పుకున్నాం. ఆ విధంగా భూమిపై అవతరించిన దేవతాంశా స్వరూపాలే పాండవులు. యముడు, వాయుదేవుడు, ఇంద్రుడు, అశ్వినీ దేవతల అంశలతో జన్మించిన ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకుల సహదేవులే 'పాండవులు'. దేవతలంతా శ్రీమహావిష్ణువులోని అంశీభూతాలే కదా! అంటే మహావిష్ణువు అంశలే పాండవులు! పాండవులు ధర్మాత్ములయ్యారు అందుకే! ఈ కారణంగానే పాండవుల్ని ప్రాణ సమానంగా చూసుకున్నాడు శ్రీకృష్ణుడు.

### హస్తినాపుర రాజ్యాధికారం ఎవరిది?

పెద్దవాడైన ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డి కావడంతో - ధర్మశాస్త్ర ప్రకారం అతనికి రాజ్యధికారాన్ని పొందే అర్హత లేదు. అయినా పేరుకు మాత్రం ఆయన్ని రాజుగా ఉంచి, తమ్ముడైన పాండురాజుకే రాజ్యభారం అప్పగించాడు భీష్ముడు. పాండురాజు రాజ్యభారాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ, బాగా రాజ్య విస్తరణ చేశాడు. ధనాగారాన్ని చాలా పెంచాడు. అనంతర కాలాన దురదృష్టవశాత్తూ పాండురాజు మరణించాడు. పాండురాజు అనంతరం రాజ్యాధికారం ఎవరిదనే సమస్య వచ్చింది. ధృతరాష్ట్రునకు వందమంది పుత్రులున్నారు. వారే కౌరవులు. వారిలో పెద్దవాడు దుర్యోధనుడు. పాండురాజుకి ఐదుగురు పుత్రులున్నారు. వారే పాండవులు. వారిలో పెద్దవాడు

ధర్మరాజు. అయితే కౌరవ పాండవులందరిలో పెద్దవాడు ధర్మరాజు. సలక్షణమైన జ్యేష్ఠునికే రాజ్యాధికారం వస్తుందని ధర్మశాస్త్రం చెప్తుంది. రాజ్యాధికారం కోసం ఇక్కడ ఇద్దరు యువరాజులున్నారు. ధర్మరాజు, దుర్యోధనుడు. వీరిలో అసలు యువరాజు ఎవరు? ధృతరాష్ట్రుడు రాజు కాని రాజుగానే కాలం గడిపాడు. పాండురాజు కూడా రాజు కాని రాజే! ఇదొక ధర్మసంకటం. అయితే దుర్యోధనుని కంటే ధర్మరాజు పెద్దవాడు. ఈ విషయం మనం మరువకూడదు.

ధర్మరాజుకు రాజ్యం అప్పగించడం అనేది, ధృతరాష్ట్రునికి ఏమాత్రం ఇష్టం లేదు. తాను గ్రుడ్డివాణ్ణి కనుక ఎలాగూ రాజ్యాధికారాన్ని చెలాయించలేకపోయాననీ, తన జ్యేష్ఠ కుమారుడైన దుర్యోధనుడు సర్వసమర్థుడు కనుక, అతనే పూర్తి రాజ్యాధికారం చెలాయించాలనీ - ధృతరాష్ట్రుని ఆశ. అయితే తనఆశ సంగతి ఎలా వున్నా, భీష్మాదుల ధర్మ ప్రబోధంతో పాండవులకు అర్ధ రాజ్యాన్ని పంచి ఇవ్వక తప్పలేదతనికి. తనకు అర్ధ రాజ్యం వచ్చినా తృప్తి లేకపోయింది దుర్యోధనుడికి. ఎలాగైనా పాండవులనుండి వారి అర్ధ రాజ్యాన్ని కాజేయాలనే తలంపుతో ఉండేవాడు.

ధృతరాష్ట్రుడు కపటంతో దుర్యోధనుడికి చక్కని రాజ్యభాగాన్ని కేటాయించి, పాండవులకు మాత్రం అడవులతో నిండిన మెరక, చవిటి ప్రాంతాల్ని అర్ధ రాజ్యంగా ఇచ్చాడు. అయినా శ్రీకృష్ణుని సహకారంతో అదంతా సస్యశ్యామలం చేసుకున్నారు పాండవులు. వారు తమ పరాక్రమంతో తమ రాజ్యాన్ని మరింతగా విస్తరింపజేసుకున్నారు. తమ సంపదల్ని పెంచుకుని శ్రీకృష్ణుని ఆధ్వర్యంలో రాజసూయ యాగం కూడా చేసి, కీర్తి గడించారు. ఇదంతా చూసి ఓర్వలేకపోయారు కౌరవులు.

అనంతరకాలంలో శకుని ద్వారా మాయాజూదాన్ని నడిపి, పాండవుల రాజ్యాన్ని కాజేశారు కౌరవులు. అంతేకాదు, పాండవులచేత అరణ్యవాసం, అజ్ఞాతవాసం కూడా చేయించారు.

అజ్ఞాతవాసం పూర్తయ్యాక, చేసుకున్న నిర్ణయం ప్రకారం తమ రాజ్యాన్ని తమకు తిరిగి ఇవ్వమని కోరారు పాండవులు. ఇవ్వనన్నాడు దుర్యోధనుడు. ధృతరాష్ట్రుని అనంతరం రాజ్యార్హత పూర్తిగా తనదేననీ, పాండవులకు రాజ్యం అడిగే హక్కు లేదనీ తెలిపాడు.

నిజానికి ఆ రాజ్యమంతా వారి తాతల ఆస్తికాదు. అందులో పాండురాజు గెలుచుకుని వచ్చిన రాజ్యాలు, రాజసూయ యాగ సందర్భంలో పాండవులు గెలుచుకున్న రాజ్యాలు, సంపదలూ కూడా వున్నాయి. అర్ధరాజ్యంగా తమ కిచ్చిన బీడుభూముల్ని

నివాసయోగ్యాలుగా మార్చుకున్నదీ పాండవులే! కాబట్టి ఏ విధంగా చూసినా పాండవులకు రాజ్యభాగం వచ్చి తీరాలి పైగా అజ్ఞాతవాసం విజయవంతంగా పూర్తి చేస్తే, రాజ్యం తిరిగి పాండవులకు చెందుతుందని కురుపాండవ ఒప్పందం కూడా ఉంది. అయితే ఇవన్నీ పట్టించుకోకుండా అధర్మానికి ఒడిగట్టారు కౌరవులు. ధర్మాధర్మాలు తెలిసిన భీష్మ ద్రోణాదులు కూడా దుర్యోధనుణ్ణి సక్రమ మార్గంలో నడిపించలేకపోయారు. రాజ్యం కోసం కౌరవ పాండవుల మధ్య యుద్ధ వాతావరణం ఏర్పడింది. యుద్ధాన్ని నివారించేందుకు శ్రీకృష్ణుడు రాయబారాన్ని నెరిపాడు. కానీ ధృతరాష్ట్ర, దుర్యోధనుల దురాశవల్ల అది ఫలించలేదు. కురుక్షేత్ర మహాసంగ్రామం జరిగింది. ధర్మపక్షాన నిలిచి, శ్రీకృష్ణుడు పాండవులకు విజయాన్ని చేకూర్చాడు. మహావీరులై ఉండి కూడా, అధర్మ పక్షాన నిలిచిన కారణంగా భీష్మ ద్రోణాదులు దుర్మరణం పొందారు. ఎంత గొప్పవారైనా సరే అధర్మపక్షాన్ని గాని సమర్థిస్తే, అధోగతి పాలౌతారని నిరూపించి చూపాడు శ్రీకృష్ణుడు. "ధర్మమేవ జయతే" అని లోకానికి చాటాడు.

## ★ ద్రౌపది - పాండవుల బంధం ★

పాండవులు శ్రీమహావిష్ణువు అంశతో జన్మించారని ఇంతకు ముందు తెలుసుకున్నాం. పాండవుల భార్య అయిన ద్రౌపది ఎవరో తెలుసా...? సాక్షాత్తూ లక్ష్మీదేవి అంశ!

లక్ష్మీదేవి అంశతో ద్రౌపది జన్మించినట్లుగా, మహాభారతంలోని స్వర్గారోహణ పర్వంలో మనకు స్పష్టంగా తెలుస్తుంది. మరణానంతరం ద్రౌపదిలోని అంశ, శ్రీమహాలక్ష్మిలోనే లీనమయింది.

శ్రీమహావిష్ణువు, శ్రీమహాలక్ష్మిల అంశలే - పాండవులు, ద్రౌపదిగా అవతరించడం జరిగిందని తెలుస్తోంది.

లక్ష్మీనారాయణుల అంశలు వివిధ యుగాల్లో వివిధ రకాలుగా జన్మలనెత్తుతూ ఉంటాయి. లోకకళ్యాణానికై వారు అనేక లీలల్ని సాగిస్తూ ఉంటారు. త్రేతాయుగంలో సీతారాములుగా ఆదర్శ దాంపత్యాన్ని చూపించారు. ద్వాపరయుగంలో కొచ్చేసరికి తమ విధానాన్ని మార్చారు. మహావిష్ణువు శ్రీకృష్ణునిగా

అవతారం దాల్చగా, లక్ష్మీదేవి ఆయన అష్టభార్యలుగా అవతరించింది. మరోవైపు శ్రీమహావిష్ణువు ఐదు రూపాల్లో పాండవులుగా ఉద్భవించగా, లక్ష్మీదేవి ద్రౌపదిగా ఒకే రూపాన జన్మనెత్తి, వారికి అర్ధాంగి అయింది. ఒకరిగా జన్మనెత్తినా, వేలమందిగా జన్మల నెత్తినా - అది వారికే చెల్లింది. తాము ఎన్ని రూపాలనైనా దాల్చగలమని నిరూపించి చూపారు లక్ష్మీనారాయణులు.

ద్రౌపది ఐదుగురు భర్తల్ని కలిగి ఉండడంలోని ఆంతర్యం తెలియని అమాయకులూ, మూర్ఖులూ అక్కడక్కడా పిచ్చివాగుడు వాగుతూ నేటికీ మనకు కన్పిస్తుంటారు. వీళ్ళంతా దుర్యోధన సంతతి. నేటి రచయితల్లో కూడా ఈ సంతతి కలిసిపోయివుంది. వారు ద్రౌపదిని కించపరిచే విధంగా డైలాగుల్ని వ్రాసి, తమ సంభాషణల్లో ఇరికించేస్తున్నారు. ఇలాంటి రచయితలకు శ్రీకృష్ణుడంటే మరీ లోకువ. ఆయన పట్ల ఎన్నో అవమానకరమైన సంభాషణల్ని వ్రాసుకొస్తున్నారు. వారికసలు కనీస జ్ఞానం కూడా లేకపోవడం మన జాతి దురదృష్టం. మన పౌరాణిక పాత్రల్ని కించపరిచే విధంగా డైలాగులు వ్రాయడం ఒక జబ్బుగా ముదిరిపోతోంది. ఇతర మతాలపై కామెంట్ చెయ్యాలంటే మాత్రం వారికి గుండె దడ! ఎవరి మనోభావాలనూ దెబ్బతీయరాదు అంటారు పైకి. హిందూ ధర్మాన్ని విమర్శించాలంటే మాత్రం, ప్రతి మూర్ఖుడూ తన కలానికి పదును పెడుతున్నాడు. హిందువులకు మనోభావాలు ఉండవా మరి! అందుకే జాతియావత్తూ ఈ పరిస్థితిని ఖండించి తీరాలి. హిందూజాతిని మేల్కొలిపేందుకే మా ఈ "భారతీయ శంఖారావం".

❦ ❦ ❦

## ★ ఐహిక బలం గొప్పదా? దైవబలం గొప్పదా? ★

కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షానికి వచ్చే ముందు శ్రీకృష్ణుడు, అర్జునుడికి ఒక పరీక్ష పెట్టాడు. దాని విషయం తెలుసుకుందాం.

శ్రీకృష్ణుడు కౌరవ పాండవులిరువురికీ బంధువే! జరగబోయే యుద్ధంలో తమకు సహాయం చేయమంటూ కౌరవుల తరపున దుర్యోధనుడు, పాండవుల తరపున అర్జునుడు శ్రీకృష్ణుని దగ్గరకొచ్చారు. తనకు ఇరువురూ కావలసినవారేనంటూ, వారికి ఒక పద్ధతిని సూచించాడు శ్రీకృష్ణుడు. 'తన సైన్యంలోని పదివేల మంది నారాయణ

గోపాలురు ఒక ప్రక్కా, తానొక్కడూ ఒక ప్రక్కా ఉంటామనీ- ఆ రెండు పక్షాల్లో ఏది కావాలో కోరుకోమనీ' అర్జునునితో పలికాడు శ్రీకృష్ణుడు. పైగా ఇక్కడ ఇంకోమాట కూడా చెప్పాడు కృష్ణపరమాత్మ. 'నారాయణ గోపాలురు యుద్ధం చేస్తారనీ, తాను మాత్రం ఆయుధం పట్టననీ, యుద్ధం చేయననీ, ఏదోతోచిన సహాయం మాత్రమే చేయగలననీ' పలికాడు. అప్పుడు అర్జునుడు ఏమాత్రం ఆలోచించకుండా "నీవొక్కడవూ మా పక్షాన ఉంటే చాలు బావా!" అన్నాడు. "ఇక మిగిలినవాటా నాదే కదా బావా!" అంటూ కృష్ణుణ్ణి అడిగాడు దుర్యోధనుడు. కృష్ణుడు అవునన్నాడు. దుర్యోధనుడికి పరమానందమయింది. యుద్ధం చేయని కృష్ణుణ్ణి కోరుకుని అర్జునుడు వెర్రిపని చేశాడని భావించాడు దుర్యోధనుడు. అపారమైన బలంగల సేన, తన వశమయిందని సంతోషిస్తూ వెళ్ళిపోయాడు.

అయితే యుద్ధంలో చివరకు ఏం జరిగింది..? దుర్యోధనుడు కోరుకున్న సైన్యం అధోగతి పాలయింది. అందులో ఏ ఒక్కడూ అతన్ని రక్షించలేకపోయాడు. కానీ శ్రీకృష్ణుడు మాత్రం అనేకసార్లు అర్జునుణ్ణి రక్షించాడు. ఇతర పాండవులనూ కాపాడాడు. చివరకు విజయాన్ని సిద్ధింపజేశాడు.

పై సంఘటన ద్వారా మనం గుర్తించవలసిన అద్భుతమైన విషయం ఒకటుంది.

సృష్టిలో "ఐహిక బలం, దైవబలం" అనేవి రెండు ఉంటాయి. ఆస్తి అంతస్తులూ, బలం బలగాలూ, కృత్రిమ విజ్ఞాన సంపత్తులూ... మొదలైనవన్నీ "ఐహిక బలం"లోకి వస్తాయి. దైవబలం అంటే "నిర్మలమైన దైవభక్తే"!

పై రెండు బలాల్లో జీవులకు ఏది ప్రధానమైనదో ఆలోచించండి. సాధారణంగా మనమంతా ఐహిక బలానికే ప్రాధాన్యతనిస్తుంటాం. దైవబలాన్ని సమర్థించడం మాటల్లోనేతప్ప, మన చేతల్లో కన్పించదు. ఈ కారణంగానే మనం నిత్య జీవన నరకంలో కొట్టుమిట్టాడుతున్నాం.

ఈ సందర్భంలో మనం శ్రీకృష్ణుని సేనను "ఐహికబలం"గానూ, శ్రీకృష్ణుడందించే సహాయాన్ని "దైవబలం"గానూ గమనించాలి. అదే ఇందులోని అంతరార్థం.

'అర్జునుడు తనను కోరుకుంటాడా? తన సైన్యాన్ని కోరుకుంటాడా? ' అని చూస్తున్నాడు శ్రీకృష్ణుడు. అర్జునుడికి అదొక అగ్ని పరీక్ష. దైవబలాన్ని గుర్తెరిగిన అర్జునుడు ఏ మాత్రం పొరబడలేదు. శ్రీకృష్ణపరమాత్మనే కోరుకున్నాడు! "దైవబలం





ఉంటే, ఐహికబలం దానంతటదే చేకూరుతుంది. ఐహికబలం మాత్రం దైవబలాన్ని చేకూర్చలేదు. ఇది మరువరాని విషయం".

ఈ విషయం తెలియని దుర్యోధనుడు, తనకు లభించిన ఐహికబలాన్ని చూసుకుని అమాయకంగా నవ్వుకుంటూ ఆనందపడిపోయాడు. చివరకు నశించాడు.

నేడు కూడా దైవాన్ని నమ్ముకొని బ్రతికేవారిని చూసి దుర్యోధనునిలా నవ్వుకుంటారు నాస్తికులు. మానవుల మేధాశక్తి ఇంతగా అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో కూడా ఇంకా దేవుడేమిటి? అంటారు వాళ్ళు. 'నిజమే! విజ్ఞానశాస్త్రం ఎంతో అభివృద్ధి చెందింది. కంప్యూటర్లు, స్కానింగ్‌లు, రాకెట్లు, విమానాలు, శాటిలైట్స్, అణుబాంబులు, మిస్సైల్స్, అంతరిక్ష విహారాలు, గ్రహాంతర యానాలు... ఇలా ఎన్నో అద్భుతాలు సర్వసాధారణమయ్యాయి. మానవ మేధస్సు సాధించిన ఇన్ని విజయాలు ప్రత్యక్షంగా కనపడుతున్నా, ఎప్పుడూ కనిపించని దేవుణ్ణి పట్టుకుని వ్రేలాడ్డం ఛాదస్తంగా అనిపించవచ్చు. అయితే ఇక్కడే మనం సరిగా ఆలోచించగలగాలి. ఇంత అభివృద్ధి చెందినా, ఇన్ని కనిపెట్టినా - మనకు అర్థం కాని, ఆపలేని, ఎదరించలేని ప్రకృతి శక్తులెన్నో సృష్టిలో ఉన్నాయి. వాటి ముందు మనం బలహీనులం. ఆ ప్రకృతి శక్తుల ముందు మన ఆధునిక సైన్స్ కూడా నిలవలేకపోతోంది. గట్టిగా వరదలూ, తుఫానులూ వస్తే తట్టుకోలేం. అగ్ని పర్వతాలు బ్రద్దలైతే భరించలేం. భూకంపాలు వస్తే నిలద్రొక్కుకోలేం. ఆ ఉత్పాతాల్ని ముందుగానే పసిగట్టగల పరికరాల్ని నేడు తయారు చేసుకున్నాం. కానీ ఏం లాభం? తిప్పలు మాత్రం తప్పడం లేదు. అంటే మన ఆధునిక సైన్స్ ఎందుకూ పనికిరానిదని కాదు. అది ఎన్నో అద్భుతాల్ని చేసింది, చేస్తోంది. అనేక ఉపయోగాల్ని కలిగించింది, కలిగిస్తోంది కూడా! అయితే ఇక్కడో చిన్న విషయం ఉంది.ఈ ఆధునిక విజ్ఞానం పూర్తిగా మన స్వశక్తేనని విర్రవీగడానికి వీల్లేదు. అదంతా భగవంతుని ప్రసాదమే! అలా కాదని విర్రవీగితే, అర్జునుడికి అయినట్లు మనకూ గర్వభంగమౌతుంది. సృష్టిలో ప్రకృతి, ప్రకృతిలో మన పుట్టుక, మన శరీర నిర్మాణం, మేధాశక్తి... వీటన్నింటికీ మూలం ఆ దైవశక్తే కదా! అలాంటప్పుడు "నా స్వశక్తి, నా తెలివీ, నా సైన్స్!" అంటూ మానవుడు వెర్రిగా కేకలు వేయడం, ఎంతవరకూ సమంజసమో ఆలోచించండి. ఈ విశ్వంలో భగవంతునిది కానిది ఏదీ లేదు. మన ఆధునిక సైన్స్ కూడా ఆయనలో అంతర్భాగమే! ఈ యథార్థాన్ని గ్రహించి భక్తి మార్గాన్ని వీడకుండా, దైవ

ప్రసాదితమైన మన మేధస్సుకు పదును పెట్టుకుంటూ - అటు ముక్తినీ, ఇటు లోకకళ్యాణ విజ్ఞానాన్నీ సాధించవలసి ఉంటుంది. అదే మానవజీవన పరమార్థం.

ఆధునిక సైన్స్ దేవునిలోని అంతర్భాగమే అంటే, చాలా మందికి ఆశ్చర్యం కలగవచ్చు. 'సైన్సు, దేవుడు - వేర్వేరనీ, దేవుడు లేడని సైన్స్ చెప్తోందనీ' భావించే అమాయకులు నేడెందరో ఉన్నారు. మిడిమిడి సైన్సు పరిజ్ఞానంగల మూర్ఖుల ప్రచారం వల్ల ఇలాంటి పరిస్థితి కలిగింది.

దేవుడూ, సైన్సూ రెండూ వేర్వేరు కావు. ఒక్కటే!

## దేవుడు - సైన్సు

విశ్వంలోని ప్రతి అణువులోనూ దైవశక్తి ఉన్నదని హిందూ పురాణాలు చెప్తున్నాయి. విశ్వంలోని ప్రతి అణువూ శక్తిమయమని ఆధునిక శాస్త్రవేత్తలూ అంగీకరిస్తున్నారు. రెండు సిద్ధాంతాలూ ఒకటే! శక్తి అనేది ఉన్నదని ఇరుపక్షాలూ చెప్తున్నాయి. అయితే ఆ శక్తికి దేవుడనే పేరు పెట్టాయి మన పురాణాలు. ఆ నామకరణం నచ్చడం లేదు నాస్తికులకు. శక్తి అనేదాన్ని వారెలాగూ అంగీకరించి తీరవలసిందే! దాన్ని దేవుడని పిలిస్తే మాత్రం, వాళ్ళకు ఒంట్లోంచి ఆవిర్లు వచ్చేస్తాయి. విశ్వాన వ్యాపించి వున్న శక్తి యథార్థమనీ, దేవుడనేది మూఢ నమ్మకమనీ వారి ఉద్దేశం. సైన్స్ అంటే దేవుడు లేడని చెప్పే శాస్త్రం అనుకుంటున్నారు వాళ్ళు. వాళ్ళెంత అమాయకులో చూడండి.

సైన్స్ అనేది దైవశక్తిలో ఒక భాగమే! దేవుడికీ, సైన్స్‌కీ ఉన్న సంబంధం ఈ క్రింది విధంగా ఉంటుంది.

దైవశక్తిలోని కొన్ని అంశాల్ని చదివేదే "సైన్స్".

**(Science is nothing but the study of some of the aspects of God's power.)**

"దైవశక్తిని గురించి తెలుసుకోడానికి సైన్స్ కూడా ఒక మార్గం".

**(Science is also a path to know the Almighty's power.)**

సైన్స్ యొక్క అంతిమ గమ్యం - "భగవంతుడే"!

**(The ultimate destination of science is "God" only.)**

ఈ విషయాల్ని అర్థం చేసుకోలేకపోతున్న ఎంతో మంది-సైన్స్‌ని వెనకేసు కొస్తూ, భగవంతుణ్ణి ధిక్కరిస్తున్నారు. సైన్స్ అందిస్తున్న కొన్ని తక్షణ సుఖాల్నీ, విజయాల్నీ చూసి-భగవంతుడంటే లక్ష్యం లేకుండా పోతోంది వారికి. ఇదెలా ఉందంటే - "శ్రీకృష్ణుని సైన్యం చేయగల యుద్ధ సహాయాన్ని తలచుకుని, శ్రీకృష్ణుని చులకనగా ఊహించుకున్న దుర్యోధనుని ఆలోచనా విధానం"లా ఉంది.

శ్రీకృష్ణుని సైన్యాన్ని నేటి మన 'ఆధునిక సైన్స్' గానూ, శ్రీకృష్ణుని 'భగవంతుని' గానూ పోల్చి పరిశీలిద్దాం ఒకసారి.

| కురుక్షేత్ర యుద్ధం నాటి విషయం | నేటికీ దాని అంతరార్థం |
|---|---|
| 1. అది కురుక్షేత్ర సంగ్రామం. | 1. ఇది మానవుని నిత్య జీవన సంగ్రామం. |
| 2. శ్రీకృష్ణుడు ఆయుధం పట్టడు. యుద్ధం చేయడు. తోడుగా ఉండి సలహా లిస్తాడు. | 2. అనగా పరమాత్మ కనిపించడు. దిగిరాడు. అయినా భక్తులకు తోడుగా ఉండి రక్షిస్తూ ఉంటాడు. |
| 3. శ్రీకృష్ణుని సైన్యమంతా తమ భుజ బలంతో ప్రత్యక్షంగా సహకరిస్తారు. | 3. ఆధునిక సైన్స్ మన నిత్య జీవనంలో ప్రత్యక్షంగా తక్షణ సహకారాల్ని అందిస్తుంది. |
| 4. నారాయణ గోపాలురంతా శ్రీకృష్ణుని సైన్యమే! | 4. ఆధునిక సైన్స్ అంతా పరమాత్ముని సృష్టిలో భాగమే! |
| 5. అర్జునుడు శ్రీకృష్ణుణ్ణీ, దుర్యోధనుడు ఆయన సైన్యాన్నీ నమ్ముకున్నారు. | 5. ఆస్తికులు దైవబలాన్నీ, నాస్తికులు సైన్స్ బలాన్నీ నమ్ముకుంటారు. |
| 6. అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి కోరుకుని విజయం సాధించాడు. | 6. ఆత్మజ్ఞానం తెలిసిన భక్తులు పరమాత్మనే నమ్మి, మోక్షాన్ని సాధిస్తారు. |
| 7. కృష్ణుని సేన కురుక్షేత్రంలో అధోగతి పొందింది. దాన్ని నమ్ముకున్న దుర్యోధనుడు చిట్టచివరకు నాశన మయ్యాడు. | 7. నమ్ముకున్న ఆధునిక సైన్సు - కాలుష్యం వైపూ, క్రొత్తక్రొత్త రోగాలు వైపూ, అణ్వాయుధాలు సృష్టించే వినాశనం వైపూ పరుగులుతీస్తోంది. దీన్నే నమ్ముకునే అజ్ఞానులు అధోగతి పాలవుతారు. |

అయితే కొంతమందికి ఇక్కడో సందేహం రావచ్చు. ఆధునిక సైన్స్ కూడా భగవంతునిలోని అంశయే అన్నారు కదా! మరి దానివల్ల నష్టాలూ, అశాంతీ కలగడం ఏమిటి? అనిపిస్తుంది. "సైన్స్ అనేది ఎప్పుడూ గొప్పదే! నిస్సందేహంగా అది భగవంతుని అంశయే! మేము విమర్శిస్తున్నది ఆధునిక సైన్స్‌ను కాదు. ఆధునిక కాలంలో దుర్వినియోగ పరచబడుతున్న సైన్స్‌నే మేము విమర్శిస్తున్నాం". ఒక కత్తి ఉందనుకోండి. దాన్ని మనం నిత్యజీవితావసరాలకు మంచిగా వాడుకోవచ్చు. లేదా హత్యలు కూడా చేయవచ్చు. దాన్ని వాడుకునే పద్ధతిలో ఉంటుంది తేడా! ఈకత్తి వంటిదే సైన్స్‌కూడా!

నేడు మనం సైన్స్‌ను తాత్కాలిక సుఖాల కోసమే హెచ్చుగా వాడుతున్నాం. దానివల్ల ప్రకృతిలో వాయుకాలుష్యం, శబ్దకాలుష్యం, ఆహారకాలుష్యం, నీటికాలుష్యం, భూకాలుష్యం మొదలైనవి పెరిగిపోయి, శాశ్వత దుష్ఫలితాలు సంభవిస్తున్నాయి. వాటినుండి తప్పించుకోవడం ఎలాగో తెలియక, నేడు భూగోళమంతా తల్లడిల్లి పోతోంది.

సైన్స్‌ను చూసుకొని అహంకరించడం మాని, దాన్ని సరైన రీతిలో అర్థంచేసుకుని వాడుకుంటే మంచిది.

సైన్స్‌లో మనమేమీ ముదిరి పండిపోలేదు. ఇంకా మొదటి అధ్యాయం చివరిమెట్టుపై ఉన్నాం. ప్రకృతి శక్తులపై మనకింకా సరియైన అవగాహనే రాలేదు. ప్రకృతి మొత్తం, భగవంతుని వశంలోనే ఉంటుంది. ఆయనేమో భక్తికి వశుడై ఉంటాడు. అందువల్లనే మనకు దైవభక్తి అనేది ముఖ్యం. "దైవభక్తి తర్వాతనే మానవశక్తి"! దైవశక్తిముందు మనం సాధించిన సైన్సు ప్రగతి ఓ లెక్కలోనిది కాదు. అధునిక సైన్సు ఎంతసేపూ బాహ్య సుఖాలను కల్పించగలదే గానీ, అన్నింటికంటే ముఖ్యమైన మానసిక ప్రశాంతతను ఇవ్వగలదా...? ఏ మాత్రం ఇవ్వలేదు. మానసిక ప్రశాంతత లేనప్పుడు బయట ఎన్ని సుఖాలుండి ఏం లాభం? మన ఆధునిక సైన్సు దురాశను త్రుంచలేదు. పైగా పెంచుతుంది. స్వార్థాన్ని వంచలేదు. పైగా పంచుతుంది. అహంకారాన్ని అణగార్చలేదు. పైగా అణువణువులో రేపుతుంది.

మానసిక ప్రశాంతతను అందించేదీ, దురాశను త్రుంచేదీ, స్వార్థాన్నివంచేదీ, అహంకారాన్ని అణగార్చేదీ, ధర్మ మార్గాన్ని చూపించేదీ, పరోపకార గుణాన్ని అలవరచేదీ, త్యాగమయ జీవితాన నడిపించేదీ "దైవభక్తి" ఒక్కటే! ఈ విషయం

మనం ఎప్పుడూ మరచిపోకూడదు.

దేవుడు ఒంటరివాడుగా, నిరాయుధుడుగా కన్పించినా సర్వమూ ఆయనే! ఈ సైన్సూ, నాగరికతా ఆయనలో ఒక పరమాణువుగా లెక్క. మనం చూడగలుతున్న నక్షత్రాలు, గ్రహాలు, ఉపగ్రహాలు, ధూళీ, గాలీ... ఇవన్నీ కలిపి మొత్తం విశ్వంలో పిసరంతకూడా కాదని నేటి ఖగోళశాస్త్రవేత్తలు అంటున్నారు. అంటే విశ్వంలోని అద్భుతాలను మనం ఊహించలేం కూడా! విశ్వం అంటే శ్రీమహావిష్ణువే! (వివరాలకు మా 'పురాణాల్లో సైన్స్' పుస్తకం చదవండి). మహావిష్ణువు విశ్వరూపాన్ని పూర్తిగా తెలుసుకోగలగడం, చూడడం మనకు ఏనాటికైనా అసాధ్యమే! సైన్స్ మార్గంకంటే, భక్తిమార్గం ద్వారానే ఆయన విశ్వరూపానికి సంబంధించిన అనుభూతిని, కొస్తయినా పొందగలం.

(గమనిక: సైన్స్ ఆధ్యాత్మికతల దగ్గరి సంబంధాన్ని మా "పురాణాల్లో సైన్స్" పుస్తకంలో చదివి తెలుసుకోండి.)

## ★ కులం కన్న గుణం మిన్న ★

సమాజ జీవనం సవ్యంగా సాగేందుకు వ్యక్తిగత అర్హతలను బట్టి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనబడే వర్ణ వ్యవస్థను ఏర్పాటు చేశారు మన పూర్వీకులు. కాలానుగుణంగా వర్ణవ్యవస్థను బట్టి, కుల వ్యవస్థ ఏర్పడింది. చాలా కాలం అదీ సవ్యంగానే సాగింది. కాలగమనంలో సంకుచిత మనస్తత్వం, స్వార్థబుద్ధీ, అహంకారాలు జనంలో పుట్టి పెరిగాయి. వాటి కారణంగా వర్ణవ్యవస్థ ఆశయం దెబ్బతింది. కుల వ్యవస్థ భ్రష్టు పట్టింది. నేటి దుష్ట రాజకీయాల వల్ల కులవ్యవస్థ పూర్తిగా కుళ్ళిపోయిందనే చెప్పాలి. వ్యవస్థ అనేది ఒక మంచి ఆశయంతోనే స్థాపించబడుతుంది ముందు. అయితే కాలక్రమేణా వ్యక్తుల స్వార్థం వల్ల ఆ వ్యవస్థ దెబ్బతింటుంది. ఇందులో తప్పు వ్యవస్థది కాదు, వ్యక్తులదే!

వేదకాలాన మనవారు వ్యక్తిగత అర్హతలను బట్టి వర్ణవ్యవస్థను ఏర్పరచారే గాని, అందులో పెద్ద ఆంక్షలేమీ ఉండేవి కావు. ప్రతిభగలవాడు శూద్రుడైనా సరే, సమాజంలో గౌరవం పొందేవాడు. బ్రాహ్మణుడు నీచంగా వ్యవహరిస్తే,

గౌరవం ఉండేది కాదు. ఎవరు ఏ వృత్తి చేసినా కూడా, వారి వారి గుణగణాలవల్లనే గౌరవార్హతల్ని పొందేవారు. మాంసం అమ్ముకుని జీవించే ధర్మవ్యాధుడనే శూద్రుని వద్ద కౌశికుడనే బ్రాహ్మణ పండితుడు పాఠాలు నేర్చుకున్న సంగతి మనకు తెలిసిందే కదా!

కులం కాదు, గుణం ముఖ్యమని మన పురాణ, ఇతిహాసాలు ఎన్నో సందర్భాల్లో చాటి చెప్తున్నాయి. శ్రీకృష్ణునిగాథలో ఒక చిన్న అంశాన్ని ఇందుకో ఉదాహరణగా ఇప్పుడు చెప్పుకుందాం.

శ్రీకృష్ణ పరమాత్మ ఏనాడూ కూడా కులాన్ని పట్టించుకోలేదు. ఆయన దృష్టిలో మానవులు రెండే రకాలు! సన్మార్గులు, దుర్మార్గులు.

మహాభారత యుద్ధాన్ని నివారించేందుకు పాండవుల దూతగా కౌరవుల వద్దకు వెళ్ళాడు శ్రీకృష్ణుడు. ఆ సందర్భంలో దుర్యోధనాదులంతా ఆయన్ని ఆహ్వానించారు. తాను శత్రురాయబారి కనుక, దుర్యోధనుని ఇంటికి వెళ్ళలేదాయన. భీష్ముడు బంధువే అయినా, అక్కడకూ వెళ్ళలేదు. బాహ్లిక, సోమదత్తాది క్షత్రియుల ఇళ్ళకూ వెళ్ళలేదు. ద్రోణ, కృప, అశ్వత్థామాది బ్రాహ్మణులు, నగరంలోని వైశ్య ప్రముఖులెంతోమంది శ్రీకృష్ణునికి ఆతిథ్యం ఇచ్చేందుకు సిద్ధం. కానీ ఆయన వారెవరి ఇళ్ళకూ వెళ్ళలేదు. తిన్నగా విదురుని ఇంటికి వెళ్ళాడు. విదురుడు ఒక శూద్రకన్యకు జన్మించినవాడు. అయితేనేం! మహా ధర్మాత్ముడతను. పైగా శ్రీకృష్ణ భక్తుడు. శ్రీకృష్ణునికి కావలసింది కులం కాదు. గుణమూ, భక్తి శ్రద్ధలూనూ! శ్రీకృష్ణ విదురులిద్దరూ ధర్మ పక్షపాతం అనే జాతికి చెందినవారు. అందువల్లనే వారికి జత కలిసింది. శ్రీకృష్ణుణ్ణి తీసుకువెళ్ళి ఆతిథ్యం ఇచ్చాడు విదురుడు.

ఆతిథ్య సమయంలో కృష్ణభక్తిలో మునిగిన విదురుడు, అరటి పళ్ళను ఒలుస్తూ - పళ్ళను క్రింద పడేసి, తొక్కల్ని శ్రీకృష్ణునకు అందించాడని ఒక కథ ఉంది. విదురుని పొరబాటును గమనించి కూడా, అతని భక్తికి వశుడైన శ్రీకృష్ణుడు ఆ తొక్కల్ని అందుకుని ఆప్యాయంగా ఆరగించాడట. కాస్సేపటికి విదురుడు తన తప్పిదాన్ని తెలుసుకుని, శ్రీకృష్ణుని మన్నించమంటూ ఎంతగానో వేడుకున్నాడట. అప్పుడు శ్రీకృష్ణుడు అతన్ని ఓదార్చాడని చెప్తారు.

పై విషయంలో మనం గుర్తించవలసిన అంశాలు రెండున్నాయి. (1) కులం

అనేది మానవ దృష్టిలోనే ఉంటుంది. దేవుని దృష్టిలో కులానికి గుర్తింపేలేదు. ధర్మం, అధర్మం అనేవే దేవుడెరిగిన కులాలు. (2) దేవుడు మన సమర్పణలోని భక్తిని మాత్రమే చూస్తాడు. మనం ఏం సమర్పించాం? ఎంత సమర్పించాం? అనేది లెక్క కాదు. (విదురుని భక్తి పారవశ్యాన్ని గమనించాడు కనుకనే, అతనిచ్చినవి అరటి పండు తొక్కలైనా సరే, ఆదరంగా స్వీకరించాడు.) అంతకుముందు త్రేతాయుగంలో శ్రీరాముడు కూడా ఈ విషయాన్ని నిరూపించి చూపాడు. ఎందరో ఋషీశ్వరులు తన కోసం అనేక ఏర్పాట్లతో ఎదురు చూస్తుండగా - శ్రీరాముడు లక్ష్మణ సహితుడై, ఒక వృద్ధ బోయ స్త్రీ అయిన శబరి వద్దకువెళ్ళి ఆమె అందించిన ఎంగిలి ఫలాలను తిన్నాడు. కులానికి ఏ మాత్రం ప్రాధాన్యత లేదనీ, సద్గుణము మరియు భక్తి శ్రద్ధలే ముఖ్యమనీ శ్రీరాముడు కూడా నిరూపించి చూపాడు.

## ☆ దేవుణ్ణి తృప్తి పరచడం ఎలా? ☆

మనల్ని సృష్టించింది దేవుడు. ఈ సృష్టి మొత్తం ఆయనదే! అంతటివాణ్ణి మనం తృప్తిపరచవలసిన అవసరం ఉంటుందా అసలు! తప్పకుండాఉంటుంది. అది ఎలాగోచూద్దాం. తల్లిదండ్రులు తమ బిడ్డలకు జన్మలనిస్తారు. వారుఎదిగి సంస్కారవంతులై తమయందు భక్తిగౌరవాలు కలిగి ప్రవర్తిస్తే, ఆ తల్లిదండ్రులెంతో తృప్తిపడతారు. శుభఆశీర్వచనాల్ని తమ బిడ్డలకు అందిస్తారు. దేవునికీ, మనకూ ఉన్న సంబంధం ఇటువంటిదే! తల్లిదండ్రులు దేవుడైతే, ఆ బిడ్డలం మనమే!

దేవుడు మననుండి కేవలం భక్తిశ్రద్ధల్ని మాత్రమే కోరుకుంటాడు. అవే ఆయన్ని సంతృప్తి పరచేవి. ఆయనకు వేరే ఆస్తిపాస్తులూ, పంచభక్ష్యపరమాన్నాలూ అక్కర్లేదు. అవన్నీ ఆయనవే! ఆయనే మనకు అవన్నీ ప్రసాదిస్తాడు. విదురుని ఇంటికి శ్రీకృష్ణపరమాత్మ భోజనానికి వెళ్ళాడని పై సందర్భంలో చెప్పుకున్నాం. నిజానికి ఆయనకేమైనా భోజనం కొదువా! ... ఏమీకాదు. కేవలం విదురుని భక్తికి మెచ్చి, అతన్ని అనుగ్రహించడానికి మాత్రమే వెళ్ళాడు శ్రీకృష్ణుడు. అక్కడ అరటిపళ్ళ తొక్కల్ని తిన్నాడు. ఆయన కడుపు నిండింది. అయితే కడుపు నిండింది తొక్కలతో కాదు. విదురుడు చూపించిన భక్తితో! మామూలు భోజనం పెట్టి, ఆయన కడుపు నింపడం

మనకు సాధ్యమా అఖిలాండ బ్రహ్మాండాలనే కడుపులో దాచుకున్న ఆయన కడుపును, మనం ఎలా నింపగలం? దేనితో నింపగలం? ఎంత భోజనం పెట్టినా మనకది అసాధ్యమే! కానీ ఆయనే తలచుకుంటే ఒకే ఒక మెతుకుతో తన కడుపు నింపుకోగలడు. తన కడుపు నిండగానే, ఇతరుల కడుపులుకూడా నిండేలా చేయగలడు. అదే ఆయన సమర్థత ఆ సమర్థతను నిరూపించే ఒక కథ జనావళిలో ప్రచారమై ఉంది. దాని గురించి క్లుప్తంగా తెలుసుకుందాం. అరణ్యవాసం చేస్తున్న పాండవుల్ని పరీక్షించేందుకు దూర్వాసముని వచ్చాడోసారి. ఆయన వెంట వేలాది శిష్యులు కూడా ఉన్నారు. వేళకానివేళ వచ్చి, తమ అందరికీ భోజనాలు పెట్టించమని ధర్మరాజుని కోరాడు దూర్వాసుడు ఆరోజుకు అక్షయపాత్ర సహకారం ముగిసిన అనంతరం వచ్చారు వాళ్ళు. అంతమందికి భోజనాలు ఎలా పెట్టాలని సందిగ్ధంలో పడ్డారు పాండవులు. సరే ఏదో ఒక దారి ఆలోచిద్దామని, ముందుగా వాళ్ళందర్నీ స్నానాలు చేసి రమ్మన్నారు. మునులంతా స్నానాలకు వెళ్ళారు. గండం గట్టెక్కించమని శ్రీకృష్ణుణ్ణి వేడుకుంది ద్రౌపది. వెంటనే శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై, అక్షయపాత్రను తీసుకురమ్మన్నాడట. ద్రౌపది తెచ్చి ఇచ్చింది. ఆ పాత్రలోంచి ఒక చిన్న మెతుకు తీసి శ్రీకృష్ణుడు తిన్నాడట. అంతే! పెద్ద విచిత్రం జరిగింది. ఇక్కడ ఆ మెతుకు శ్రీకృష్ణుడు తినగానే, అక్కడ స్నానాలు చేస్తున్న మునులందరికీ కడుపులు నిండిపోయాయట. వాళ్ళిక భుక్తాయాసంతో అటునుంచి అటే వెళ్ళి పోయారట. పరమాత్ముడే తలచుకుంటే అలా మారిపోతుంది పరిస్థితి. ఒక్క మెతుకుతో తాను తృప్తిచెంది, దానితోనే వేలమంది కడుపులు కూడా నింపేశాడు శ్రీకృష్ణుడు. ఇంతకూ మనం ఇక్కడ తెలుసుకోవలసిన విషయం ఏమంటే- భగవంతుడు తృప్తి చెందేది భోజనంతోనూ, పళ్ళతోనూ కాదు. భక్తితో తృప్తి చెందుతాడు. ఆయన మననుండి ఆశించేది అదే!

(ఈ అక్షయపాత్ర సంఘటన, విదురుని అరటిపండ్ల ఆతిథ్యం - ఈరెండూ కూడా యథార్థంగా జరిగాయా లేదా అని తర్కించుకునే కంటే, వాటిలోని అంతరార్థాన్ని గ్రహిస్తే మంచిది. ఇవి కేవలం జనావళిలో ప్రచారమై ఉన్న కథలు మాత్రమే! అయినా- మానవాళి గ్రహించవలసిన మహత్తర అంశాల్ని కలిగియున్నవి కనుక, వీటిని తెలుసుకోవడం సర్వదా శ్రేయోదాయకం.)

❦ ❦ ❦

## ★ వర్ణవ్యవస్థ ఎలా ఏర్పడింది? ★

వర్ణము, కులము లెక్కచేయని శ్రీకృష్ణుడు ఏ కులంవాడో మీకు తెలుసా?

ఆ విషయాన్ని చర్చించే ముందుగా - వర్ణవ్యవస్థ ఎలా ఏర్పడిందనే సంగతిని తెలుసుకుందాం.

సమాజజీవనం సవ్యంగా సాగేందుకు మన పూర్వీకులు వర్ణవ్యవస్థను ఏర్పరచారనీ, దాని నుండి కాలక్రమంగా కులవ్యవస్థ ఏర్పడిందనీ ఇంతకుముందే చెప్పుకున్నాం.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనబడే చతుర్వర్ణ విభజన - 'పూర్వం కొందరు స్వార్థపరులెవరో చేశారని' నేడు చాలామంది భ్రమపడుతుంటారు. ఆ భ్రమలోనే హిందూ సంస్కృతిని కూడా నిందిస్తుంటారు వాళ్ళు. అలాంటివారికి కనువిప్పు కలిగించేందుకు ఈ విషయంలో నిజానిజాల్ని చర్చిద్దాం.

ఇప్పుడున్న కలుషిత కులవ్యవస్థను చూసి, ఎప్పుడో ఏర్పరచిన వర్ణవ్యవస్థను విమర్శించడం అమాయకత్వం. ఆనాటి వర్ణవ్యవస్థ ఎందుకు, ఎలా ఏర్పడిందీ తెలుసుకుంటే - మనకు సరైన అవగాహన వస్తుంది. మన పూర్వీకులు వర్ణవ్యవస్థను కేవలం సమాజ సౌభాగ్యం కోసమే ఏర్పరిచారు . వ్యక్తుల శక్తి సామర్థ్యాల, నైపుణ్యాల ఆధారంగా మాత్రమే వర్ణవ్యవస్థ రూపొందించబడింది.

మహావిష్ణువు యొక్క విరాట్ స్వరూపం నుండి చతుర్వర్ణాలు ఆవిర్భవించినట్లుగా శాస్త్రాలు వర్ణిస్తున్నాయి. విరాట్ స్వరూపంలో భాగమైన బ్రహ్మదేవుని నుండి చతుర్వర్ణాలు పుట్టినట్లుగా కొన్నిచోట్ల వర్ణించబడింది.

విజ్ఞాన శాస్త్రాల రచన, విజ్ఞాన శాస్త్ర పఠనము, విజ్ఞాన బోధన, విజ్ఞానశాస్త్రాధ్యయనము , విజ్ఞాన ప్రయోగాలు చేయగలవారందరినీ - ఒక విభాగంగా చేశారు. వారినే బ్రాహ్మణులు అన్నారు. (మెదడుకు పదును పెట్టి పనిచేసే విభాగం కనుక, వీళ్ళు భగవంతుని ముఖంనుండి పుట్టినట్లుగా వర్ణించబడింది.)

ధైర్యసాహసాలు కలిగినవారిని, యుద్ధవిద్యలు నేర్చి శత్రువులనుండి రక్షణ కల్పించేవారిని, శాంతి సౌఖ్యాలు వెల్లివిరిసేలా సంఘాన్ని నడిపించగలవారిని - మరో

విభాగంగా చేశారు. వారికి క్షత్రియులు అని పేరు పెట్టారు. (భుజశక్తితో పనిచేసే విభాగం కనుక, వీరు భగవంతుని భుజాల నుండి పుట్టినట్లుగా వర్ణించబడింది.)

వ్యాపారం, వ్యవసాయం, పశుపోషణ చక్కగా సాగించగలిగి, సక్రమ మార్గాన ప్రజలకు నిత్యావసరాల్ని అందించగలిగే వారిని - మూడవ విభాగంగా చేశారు. వాళ్ళే 'వైశ్యులు' (ఉదరపోషణకు కావలసిన పనుల్ని నిర్వహించే వీరు, భగవంతుని తొడలనుండి పుట్టినట్లుగా వర్ణించబడింది. ఉదరానికి ఆధారమైనవి తొడలే కదామరి!)

చేతివృత్తుల్లో నిపుణత, కాయకష్టం చేయగల సమర్థత గలవారందరినీ - చివరి విభాగంగా ఏర్పరిచారు. వారే 'శూద్రులు'. వీరికి స్వతహాగా స్వంత ఆలోచనా శక్తి, తెలివితేటలు తక్కువ. చదువు సంధ్యలు, శుచీ శుభ్రతలు అంతంత మాత్రమే. పై మూడు విభాగాలకూ అన్నింటా సహాయకులుగా నిలిచే బాధ్యత వీరిదే! (పై విభాగాల వారికి అండగా ఉండే పనుల్ని చక్కబెట్టేవిభాగం కనుక, వీరు భగవంతుని పాదాలనుండి పుట్టినట్లుగా వర్ణించబడింది. పైనున్న శరీరమంతా పాదాలపైనేకదా ఆధారపడి నిలబడు తుందిమరి.)

వ్యక్తుల శక్తి సామర్థ్యాలను బట్టీ, నైపుణ్యాల్ని బట్టీ పైవిధంగా విభజించడం జరిగిందే తప్ప - ఇందులో ఏ స్వార్థమూ లేదు. ఒక వర్ణం గొప్పఅనీ, మరో వర్ణం నీచమనే అభిప్రాయం వేదకాలంలో లేదు. వర్ణవ్యవస్థలో అనాడు అంక్షలేవీ ఉండేవి కావు. జన్మతః వర్ణాన్ని నిర్ణయించడం కూడా మొదట్లో లేదు. వ్యక్తియొక్క ఆచరణను బట్టే వర్ణం నిర్ణయించబడేది. చేపట్టిన వృత్తిని బట్టే వర్ణం నిర్ణయించబడుతుందని, అనంతర కాలంలో కూడా భీష్మాచార్యులవారు ధర్మరాజుతో స్పష్టంగా చెప్పారు. (మహాభారతంలో శాంతి పర్వం చూడండి.)

అంతేకాదు మన శాస్త్రాలు ఈవిధంగా చెప్తున్నాయి.

"జన్మనా జాయతే శూద్రః
వేద పాఠంతు విప్రః
బ్రహ్మ జ్ఞానంతు బ్రాహ్మణః"

దీని భావం ఏమంటే - ప్రతి మానవుడు పుట్టగానే శూద్రుడే! ఎదిగే కొలదీ ఎవరైతే వేదాల్ని చదివి, వేదవిజ్ఞానంతో బ్రహ్మజ్ఞానాన్ని పొంది, వేదవిజ్ఞానాన్ని ఇతరులకోసం వినియోగిస్తారో - వారే బ్రాహ్మణులు. జన్మతో బ్రాహ్మణ్యం లభించదని

చెప్తూ, మహాభారతం స్పష్టంగా ఇలా అంటోంది. "వేదాలు, సత్యం, ధర్మం, ఆచారం, తపస్సు - ఈ ఐదింటికీ ఉనికి పట్టుగా ఉన్నవారే బ్రాహ్మణులు. బ్రాహ్మడనేవాడు ఎల్లవేళలా ప్రశాంతతతో ఉండాలి ఒకళ్ళకి భయపడకుండా, ఒకళ్ళని భయపెట్టకుండా నడచుకునే పరిణిత చిత్తుడే బ్రాహ్మణుడు. యజ్ఞాలు చేయడం, చేయించడం, వేదాలు చదవడం, చదివించడం, దానాలు చేయడం, పుచ్చుకోవడం - ఈ ఆరు కర్మలూ బ్రాహ్మణులు చెయ్యవలసినవి." బ్రాహ్మణధర్మాలు తొమ్మిది. అవి - అధ్యయనం, యజనము, అధ్యాపనము, యాజనము, ప్రతిగ్రహము, ప్రశాంతి, తపస్సు, సత్యము, శౌచము. ఈ ధర్మాలు కలిగి ఉన్న వాళ్ళెవరైనా బ్రాహ్మణులే! జన్మతః బ్రాహ్మణుడైనా, ఈ ధర్మాల్ని అనుసరించకుంటే అతను శూద్రుడుగానే లెక్క.

జన్మతః శూద్రుడైనాసరే, ప్రజ్ఞాపాటవాలుగల వ్యక్తి - పూర్వకాలాన సంఘంలో చక్కటి గౌరవమర్యాదల్ని పొందగలిగేవాడు. ఆచరించే కర్మల్నిబట్టి వర్ణ అంతస్తు మారుతూ ఉండేది ఆనాడు. అయితే ఎక్కువగా ఎవరి సంతానానికి వారు, తమ తమ విద్యలనే నేర్పించడంతో వంశపారంపర్యంగా వర్ణవ్యవస్థ అలా కొనసాగుతూ వచ్చింది. కాలం గడిచే కొలదీ వ్యక్తుల్లో స్వార్థం, అహంకారం పెరిగాయి. తమకు అనుగుణంగా ఉండేలా శాస్త్రాల్నే మార్పు చేయడం మొదలైంది. వర్ణవ్యవస్థలో ఉచ్చనీచ భావనలు ప్రారంభమయ్యాయి. వర్ణ వ్యవస్థ నుండి ఏర్పడిన కుల వ్యవస్థ తప్పటడుగులు వేయడం మొదలెట్టింది. ఆచరించే కర్మనూ, గుణాలనూ, శక్తిసామర్థ్యాలనూబట్టి కాకుండా, జన్మతః కులనిర్ణయం చేయడం పరిపాటి అయింది. కులవ్యవస్థ నుండి మురాతత్వం బయలుదేరింది. కుళ్ళిపోతున్న ఈ కులవ్యవస్థను ఆసరా చేసుకుని, లబ్ధి పొందాలని చూస్తున్న స్వార్థపరుల సంఖ్య పెరుగుతోంది. హిందూ సంస్కృతికి వక్రభాష్యాలు చెప్తూ, మతమార్పిడులకు బాటలు వేస్తున్న మోసగాళ్ళు ఎక్కువౌతున్నారు - తస్మాత్ జాగ్రత్త! (మనం విలువనివ్వవలసింది విజ్ఞత, శుభ్రతలకు గాని - కులానికి కాదని గ్రహించండి.)

సమాజసౌభాగ్యాన్ని కల్గిస్తూ పనిచేసిన ఒకనాటి వ్యవస్థ, ఈనాడు కుళ్ళిపోయిందంటే - ఆ తప్పు వ్యవస్థది కాదు. దాన్ని తప్పుదారి పట్టించిన వ్యక్తులది! పద్ధతి ఎంతమంచిదయినా - కాలక్రమేణా ప్రవేశిస్తున్న స్వార్థంతో, అది భ్రష్టుపట్టిపోవడం జరుగుతోంది. మనం ఆ స్వార్థాన్ని అంతం చేయగలగాలి.

అంతేగాని విధానాల్ని తిట్టుకుంటూ కూర్చుంటే, లాభం లేదు. అయితే ఆ స్వార్థాన్ని అంతం చేయగల శక్తి నేడెవరికీ లేదు. అందువల్ల ప్రస్తుత పరిస్థితుల్లో చేయగలిగిందల్లా ఒక్కటే! ప్రభుత్వపరంగా కులవ్యవస్థను పూర్తిగా నిషేధిస్తే, కొంతవరకూ మంచి కలుగుతుంది. కానీ అది జరిగే పనికాదు. ఎందుకంటే ఈనాటి నీచ రాజకీయాలకు ఆ కులవ్యవస్థేకదా పట్టుగొమ్మ! ఇక విజ్ఞత కలిగిన పౌరులదే బాధ్యత అంతా! వర్ణవ్యవస్థ, కులవ్యవస్థల పుట్టుపూర్వోత్తరాల్ని తెలుసుకోవడంద్వారా అపార్థాలకు తావులేకుండా చేసుకుని, అందరూ కలసిమెలసి ఉండే సమాజస్థాపనకు కృషిచేయడమే ప్రస్తుత కర్తవ్యం.

❦ ❦ ❦

## ☆ ఆచరించే కర్మలవల్ల కులం మారుతుందా? ☆

పూర్వకాలాన కులం అనేది జన్మను బట్టి కాకుండా - గుణాల్ని బట్టీ, ఆచరించే కర్మల్ని బట్టీ వచ్చేదని చెప్పుకున్నాం. ఇందుకు మన పురాణేతిహాసాల్లో ఎన్నో ఉదాహరణలున్నాయి. వాటిలో కొన్నింటిని ఇప్పుడు తెలుసుకుందాం.

విశ్వామిత్రుడు జన్మతః క్షత్రియుడు. రాజ్యపాలన కూడా చేశాడు. అనంతరకాలంలో ఆయన తపస్సు, వేదాధ్యయనం, యజ్ఞయాగాలూ చేసి బ్రాహ్మణ లక్షణాల్ని అనుసరించి బ్రహ్మర్షిగా మారిపోయాడు. హైహయుడనే రాజు కూడా ఈ విధంగానే బ్రాహ్మణుడిగా మారాడు.

ద్రోణుడు జన్మతః బ్రాహ్మణుడు అతడు మొదటినుండీ క్షాత్ర విద్యలకు ప్రాధాన్యతనిచ్చి, వాటినే అభ్యసించాడు. యుద్ధాలు చేశాడు. ఎందరినో చేజేతులా హతమార్చాడు. అందువల్ల అతనిలో బ్రాహ్మణ్యం నశించింది. క్షత్రియుడే అయ్యాడు. అందుకే అతని శిరస్సును ఖండించి వేసినా సరే, దృష్టద్యుమ్నుడికి బ్రహ్మహత్యాపాతకం అంటలేదు

అశ్వత్థామ పుట్టుకతో బ్రాహ్మడే! అయినా అతడు యుద్ధాల్లో పాల్గొన్నాడు. చివరకు. . . నిద్రిస్తున్న వారినీ, పారిపోతున్న వారినీ, నిరాయుధులనూ, శరణన్నవారినీ కూడా చంపేశాడు. గర్భస్థ శిశువు (పరీక్షిత్తు)ను కూడా హత్యచేశాడు. ఆ విధమైన పాపకార్యాలు చేయడంవల్ల, వేలాది సంవత్సరాలపాటు ఛండాల జీవితం గడిపే యోగం పట్టింది అతనికి.

కర్ణుడు జన్మతః క్షత్రియుడు. కానీ అతడు పెరిగిన స్థానం వల్ల శూద్రుడనబడ్డాడు. మళ్ళీ దుర్యోధనుని వల్ల అంగరాజ్యాన్ని పొంది క్షత్రియుడయ్యాడు.

కన్యకాపరమేశ్వరీదేవి వైశ్యకుల స్త్రీ. అయితే ఆమె తండ్రి రాజ్యాన్ని ఏలడం చేత 'రాజు' అనిపించుకున్నాడు. ఆమె రాకుమారిగా చెప్పబడింది.

మన చరిత్రలోని విషయాల్ని చూసినా, ఇలాంటి ఉదాహరణలు కన్పిస్తాయి. గుప్తరాజులు వైశ్యకులస్థులు. మౌర్య చంద్రగుప్తుడు శూద్రుడు. రెడ్డిరాజులు, వెలమరాజులు. . . ఇలా ఎందరో క్షాత్రాన్ని నెరపి, క్షత్రియులయ్యారు.

వీటివల్ల మనకు అర్థమయ్యేదేమంటే - మన హిందూ ధర్మంగానీ, శాస్త్రాలుగానీ, మన పూర్వీకులుగానీ - ఏ వ్యక్తిమీద, ఏ వర్గం మీద, ఏ వంశం మీదా కూడా కులముద్ర వేయలేదు. వారి కర్మాచరణను బట్టి కులం సిద్ధించడం జరిగింది. జన్మతః కులముద్రలు వేయబడిన సందర్భాలు కనుక ఏవైనా ఉంటే, అవి మధ్యలో వచ్చిన స్వార్థపరుల మాయాజాలం తప్ప - మరొకటి కాదు.

❦ ❦ ❦

## ★ శ్రీ కృష్ణుడు ఏ కులస్థుడు? ★

శ్రీకృష్ణుడు గొల్లల కులానికి చెందినవాడని చెప్తారు. అయితే ఆయన క్షత్రియుడనీ, అందుకే కౌరవ, పాండవులకు బంధువయ్యాడనీ అంటారు కొంతమంది. ఇంతకూ శ్రీ కృష్ణుడు ఏ కులస్థుడు మరి? ఈ విషయమై చర్చిద్దాం.

పుట్టుకచే కాకుండా, ఏ కులమైనా కూడా ఆచరించే కర్మవల్లనే అపాదించ బడుతుందని ఇంతకు ముందే విపులంగా తెలుసుకున్నాం. ఈ విధంగా చూస్తే శ్రీకృష్ణుడు బ్రాహ్మణ కులానికీ, క్షత్రియ కులానికీ, వైశ్య కులానికీ, శూద్ర కులానికీ కూడా చెందుతాడు. ఎందువల్లనంటే చతుర్వర్ణాలకున్న లక్షణాలన్నీ ఆయనలో వున్నాయి. ఆ లక్షణాలన్నీ వరుసగా పరిశీలిద్దాం.

### బ్రాహ్మణలక్షణాలు :

మనం ఇంతకుముందు అధ్యాయాల్లో తెలుసుకున్న బ్రాహ్మణ లక్షణాలు శ్రీకృష్ణునికి చక్కగా సరిపోతాయి. శ్రీకృష్ణునికి తెలియని వేదరహస్యం లేదు.

ఉపనిషత్తులేదు ఉపనిషత్తుల సారాంశంగా భగవద్గీతను ప్రపంచానికి అందించిన ఆచార్యుడాయన. సృష్టి మొత్తానికి శ్రేష్ఠుడైన పండితుడు, శాస్త్రకారుడు, ఆచార్యుడూ ఆయనే కదా! వేద జ్ఞానం కలిగి, ఆ జ్ఞానాన్ని లోకానికందించిన ఆచార్య శ్రీకృష్ణుడు బ్రాహ్మణుడే అవుతాడు.

## క్షత్రియలక్షణాలు :

శ్రీకృష్ణుడు జన్మించినది దేవకీ వసుదేవులకు. వారు క్షత్రియులు. అనగా జన్మతః శ్రీకృష్ణుడు క్షత్రియుడే! అంతేకాక శ్రీకృష్ణుడు క్షాత్ర విద్యలన్నీ కూలంకషంగా నేర్చినవాడు. అస్త్రప్రయోగాలు, వ్యూహరచనలూ అన్నీ ఆయనకు తెలుసు. అధర్మపరులతో పోరాడుతూ వారిని సంహరిస్తూ - ఎన్నో రాజ్యాలనూ, వాటిలోని ప్రజలనూ రక్షించాడు. ఇదీ క్షాత్రధర్మమే! ఇలా క్షాత్రం నేర్చి, క్షాత్రం నెరపి, ప్రజల్ని కాపాడిన శ్రీకృష్ణుడు జన్మచేతనే కాకుండా, కర్మచేతకూడా క్షత్రియుడే అవుతాడు.

## వైశ్యధర్మాలు :

శ్రీకృష్ణుడు వైశ్య ధర్మాల్ని కూడా ఆచరించాడు. అయితే ఆ విషయాలు చెప్పుకనే ముందుగా కృష్ణుని వంశ చరిత్రను గురించి కాస్త తెలుసుకోవలసిన అవసరం వుంది. శ్రీకృష్ణుడు యదువంశస్థుడని అంటారు కదా! ఈ యదువంశం అనేది ఎలా వచ్చిందో తెలుసుకుందాం. యాదవ వంశానికి మూల పురుషుడు 'యదువు'. క్షత్రియుడైన యయాతి మహారాజు కుమారుడాయన.

ఒకానొక సందర్భంలో శుక్రుడిచ్చిన శాపకారణంగా యయాతి మహారాజు అకాల వార్ధక్యం పొందాడు. యవ్వనంపై మోజు తీరని యయాతి, తన కుమారులందరినీ పిలిపించి - వారిలో ఎవరైనా తన వార్ధక్యాన్ని తీసుకొని, వారి యవ్వనాన్ని తనకు ఇవ్వవలసిందిగా కోరాడట. పురూరవుడు తప్పించి మిగిలిన కుమారులంతా అందుకు నిరాకరించారట. అలా నిరాకరించిన వారిలో 'యదువు' కూడా ఉన్నాడు. పురూరవుడు తన తండ్రి వార్ధక్యాన్ని తాను స్వీకరించి, తన యవ్వనాన్ని తండ్రి కిచ్చాడు. తన యవ్వన సరదాలు తీరిన అనంతరం యయాతి - తన యవ్వనాన్ని తిరిగి పురూరవునికి ఇచ్చివేసి, తన వార్ధక్యాన్ని స్వీకరించాడు. తన కోరికను మన్నించినందుకు యయాతికి పురూరవునిపై ఎనలేని మమకారం కలిగింది. తన రాజ్యం మొత్తం అతనికే ఇచ్చివేశాడు. అంతటితో ఊరుకోలేదు. యదువుతో సహా మిగతా కుమారులందరికీ ఆయన ఒక

దండన విధించాడు. అది ఏమంటే - వారికి గానీ, వారి సంతానానికి గానీ రాజ్యం ఏలే హక్కులేదని ప్రకటించాడు. ఆ విధంగా యదువు, క్షత్రియ అర్హత కోల్పోయాడు. అతను, అతని సంతానమూ రాజ్యార్హత లేకుండా అయిపోయారు. ఆ విధంగా క్షత్రియత్వాన్ని కోల్పోయిన యదువు సంతానం 'యాదవ వంశం'గా రూపొంది - పశుసంరక్షణ, వ్యవసాయ వ్యాపారాలు చేపట్టారు. అయితే కాలక్రమేణా యాదవ వంశంలో చాలామంది యయాతి దండనను లెక్కచేయకుండా, రాజ్యాలు ఏలడం జరిగింది. కానీ శ్రీకృష్ణుడు మాత్రం తన వంశ మూలపురుషుడైన యయాతి శాసనానికి కట్టుబడి, చక్రవర్తి అయ్యే అవకాశాన్ని కూడా వదులుకున్నాడు. ఆయన ఏనాడూ రాజు కాలేదు.

యయాతి శాసనానికి విలువనిచ్చిన యదువంశస్థులు - రాజరికానికి దూరమై, పశుసంరక్షణ చేపట్టారు. పశుసంరక్షణ వైశ్యకుల ముఖ్యధర్మం. (మహాభారతంలోని శాంతి పర్వం చూడండి.) ఆ ధర్మాన్ని అనుసరించాడు శ్రీకృష్ణుడు. ఈ కారణంగా వంశరీత్యా, కర్మరీత్యా కూడా శ్రీకృష్ణుడు వైశ్యుడే అవుతాడు.

**శూద్రలక్షణాలు :**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలకు అండదండలుగా ఉంటూ కాయకష్టం చేసే వారే శూద్రులు. వ్యవసాయం, పశుపోషణ చేసే వైశ్యుల వద్ద పశువుల కాపరులుగా, పాలేర్లుగా ఈ శూద్రులు పని చేసేవారు. శ్రీకృష్ణుడు యాదవ నాయకుడైన నందుని కుమారునిగా పశుపోషకుడే అయినా, తానుకూడా మిగిలిన పశువుల కాపర్లతో కలసి ఒక పశువుల కాపరిగా పశువుల్ని కాచేవాడు. పశువులకు స్నానాలు చేయించేవాడు. గడ్డివేసి మేపేవాడు. పాలుపితికేవాడు. ఈ విధంగా కాయకష్టంతో శూద్రకర్మలు నిర్వర్తిస్తూ, శూద్రులతో కలసి తిరిగేవాడు. కంసుని సంహరించేంత వరకూ శ్రీకృష్ణుడు విద్యాభ్యాసమే చేయలేదు. ఏ విద్యా అభ్యసించకుండా కాయకష్టం చేస్తూ, శూద్రులతో కలసి తిరిగాడు. ఈ విధంగా ఆయన తన బాల్యకర్మల రీత్యా శూద్రుడౌతాడు.

చేసే కర్మను బట్టి 'కులం' ఏర్పడే రోజులు కనుక 'శూద్రులైన గొల్లవాళ్ళతో కలిసి తిరిగిన కారణంగా శ్రీకృష్ణుని గొల్లవాడన్నారు'. కంసుడు, శిశుపాలాది రాజులకు బంధువే అయినా - శ్రీకృష్ణుణ్ణి 'గొల్లవాడనీ, తక్కువ అంతస్తులో వాడనీ' ఎంచి నిందించేవారు కొందరు మూర్ఖులు.

పై వివరణ ప్రకారం శ్రీకృష్ణుడు శూద్రుడు కూడా అయ్యాడు.

ఇప్పుడు చెప్పండి... శ్రీకృష్ణుడు, ఏ వర్ణానికి, ఏ కులానికి చెందినవాడో..!

ఆయనలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్ర లక్షణాలన్నీ ఉన్నాయి. ఒకే వ్యక్తి ఇన్ని వర్ణాలకు చెంది ఉండడం మహా ఆశ్చర్యకరం. అదే శ్రీ కృష్ణావతారంలోని ప్రత్యేకత, విశిష్టత.

వర్ణవ్యవస్థలోని అన్ని భాగాలూ ప్రాముఖ్యమైనవేననీ, ఎవరూ ఎక్కువా తక్కువా కాదని నిరూపించేందుక శ్రీకృష్ణుడు ఇన్ని విధాల అభినయం చేసి చూపాడు. అంతేగాని... భగవంతునికి కులం ఏమిటి? సర్వజగత్తూ ఆయనే సృష్టిలో ప్రతీదీ ఆయన స్వరూపమే! జలచరాలు తానేనంటూ మత్స్యావతారం ఎత్తాడు. ఉభయచరాలు తానేనంటూ కూర్మావతారుడయ్యాడు. ఇంకా వరాహావతారం, నరసింహావతారం, హయగ్రీవ (వాజసనేయ) అవతారం... ఇలా ఎన్నో అవతార రూపాల్ని దాల్చాడు. వామనుడి వంటి పొట్టివాడయినా, పరశురాముని వంటి కోపిష్టివాడయినా, రామునివంటి ధర్మపరుడూ, ఏకపత్నీవ్రతుడయినా... అన్నీ ఆయన ప్రతిరూపాలే! పరశురాముడిగా అవతరించి బ్రాహ్మణుడయ్యాడు. శ్రీరామునిగా అవతరించి క్షత్రియుడయ్యాడు. శ్రీకృష్ణునిగా అన్ని వర్ణ ధర్మాలనూ పాటించి చూపి, సర్వసమానత్వాన్ని చాటాడు.

సామాజికపరంగా నేడు సృష్టించబడుతున్న హెచ్చుతగ్గులన్నీ స్వార్థపరుల కుతంత్రాలని గ్రహించండి.

## ★ మానవ జీవితమే ఓ కురుక్షేత్ర యుద్ధం ★

రాజ్యం కోసం కౌరవులకు పాండవులకు మధ్య జరిగిన యుద్ధమే కురుక్షేత్ర యుద్ధం. మంచీ - చెడుల, ధర్మ - అధర్మాల పోరాటం అది. ఆ పోరాటంలో ధర్మపరులైన పాండవుల పక్షాన నిలిచాడు శ్రీకృష్ణుడు. అధర్మపరులైన కౌరవులకు అపజయాన్ని కలిగించి, పాండవుల్ని గెలిపించాడాయన.

ఏనాడో ద్వాపరయుగాన జరిగిన ఆ కురుక్షేత్ర యుద్ధాన్ని కేవలం మహాభారతంలోని ఒక యుద్ధ సంఘటనగా మాత్రమే చూస్తే పొరబాటే! తాను నడిపిన కురుక్షేత్ర యుద్ధం ద్వారా శ్రీకృష్ణుడు మానవ జీవితానికి సంబంధించిన ఎన్నో సత్యాల్ని నిగూఢంగా

అందించాడు. కురుక్షేత్ర యుద్ధం - మన జీవన పోరాటాన్ని పోలి ఉంటుంది, గమనించండి. మన జీవితమే ఓ కురుక్షేత్రయుద్ధం! అదెలాగో తెలుసుకుందాం.

| కురుక్షేత్ర సంగ్రామం | మానవ జీవన పోరాటం |
|---|---|
| 1. ఈ యుద్ధం ధర్మపరులైన పాండవులకు, అధర్మపరులైన కౌరవులకు జరిగింది. | 1. ఈ పోరాటం ధర్మానికి, అధర్మానికీ నిత్యం జరుగుతూనే ఉంటుంది. |
| 2. కౌరవుల సంఖ్యాబలం ఎక్కువ. పాండవుల సంఖ్యా బలం తక్కువ. అయితే శ్రీకృష్ణుని తోడు పాండవులకే వుంది. | 2. కలికాలంలో దుర్మార్గుల సంఖ్య ఎక్కువ. ధర్మపరుల సంఖ్య తక్కువ. అయితే పరమాత్ముని దయ మాత్రం ధర్మపరులకే ఉంటుంది. |
| 3. కురుక్షేత్ర సంగ్రామంలో పాల్గొనేందుకు అర్జునుడు (నరుడు) రథం ఎక్కాడు. ఆ రథానికి నాలుగు గుర్రాలు కట్టబడ్డాయి. ఆ నాలుగు గుర్రాలనూ అదుపులో ఉంచుతూ రథాన్ని చక్కగా నడిపించేందుకు, శ్రీకృష్ణుణ్ణి (శ్రీమహావిష్ణువును) సారథిగా నిలుపుకున్నాడు అర్జునుడు. | 3. మానవ జీవన పోరాటంలో మానవుడే రథికుడు. పరుగులు తీస్తూ సాగిపోతున్న అతని జీవనమే ఒక రథం. ధర్మ, అర్థ, కామ, మోక్షాలనబడే పురుషార్థాలే - ఆ రథాన్ని లాగే గుర్రాలు. సక్రమమైన పురుషార్థాల ఆచరణలో మన జీవన ధర్మాన్ని ముందుకు నడిపించగల సామర్థ్యం భగవంతుడు చూపించిన మార్గానికే వుంది. ఆ మార్గాన పయనిస్తే, మానవుడు విజయాన్ని సాధించగలడని ఇందులోని భావం. |

అర్జునుడు రథి. శ్రీకృష్ణుడు సారథి. నరుడికి నారాయణుడు సారథిగా నిలిచాడిక్కడ. ఇందులో వున్న అంతరార్థాన్ని గమనించండి. పురుషార్థాల్లోని అర్థ, కామాలు బహు ప్రమాదకరమైనవి. ఈ అర్థ, కామాలనబడే గుర్రాల్ని అదిలించి అదుపులో ఉంచుకోలేకపోతే, జీవన రథం పెడదారి పట్టి అధోగతి పాలవుతాం. మనం విజయం సాధించాలంటే భగవంతుడు చూపిన మార్గంలో పయనించాలని సూచించబడుతోంది. నారాయణుడంతటివాడు ఒక నరునికి సారథ్యం వహించడంలోని అంతరార్థం ఇదన్నమాట.

| | |
|---|---|
| 4. శ్రీకృష్ణుడు తోడుగా ఉండి ఎన్నో ఆపదల నుండి రక్షిస్తూ ఉన్నా కూడా, కురుక్షేత్ర యుద్ధంలో ఎంతో మంది పాండవ పక్షం వారు కూడా మరణించక తప్పలేదు (ఇరావంతుడు, అభిమన్యుడు, ఘటోత్కచుడు, ఉప పాండవులు మొదలగు ఎందరో పాండవ పక్షం వీరులు మరణించారు కదా మరి) విధి విధానం అలా పాటించబడింది. | 4. మనం భగవంతుని ప్రసన్నం చేసుకుని, ఆయన నీడలో ఎంతగా తల దాచు కున్నా కూడా - మనం మన ఆత్మీయుల్నీ, బంధుమిత్రుల్నీ కాల గమనంలో ఎప్పుడో ఒకప్పుడు కోల్పోతూనే ఉంటాం. జనన మరణ చక్రం అనేది ఆగదు. భగవంతుడు తాను ఏర్పరచిన విధి విధానాన్ని తప్పక అనుసరిస్తాడు. గతంలోని మన కర్మల ఫలితాల్ని తప్పక అనుభవించాలి కదా మరి! |
| 5 18 రోజులు సాగిన ఆ కురుక్షేత్ర యుద్ధంలో ఏ రోజుకు ఆరోజు ఎందరో వీరులు మరణిస్తుండేవారు. ఆ మరణాల్ని చూసి, వారి వారి ఆప్తులు ఎంతో దుఃఖితులయ్యేవారు. అయితే మాత్రం వారంతా చనిపోయిన వారితోనే కూర్చోక, తిరిగి సంగ్రామంలోకి దూకి ముందుకు దూసుకుపోయేవారు. | 5. నిత్య జీవన పోరాటంలో మన ఆప్తులు కాలం తీరి మరణిస్తూ, మనకు దూరమౌతూ ఉంటారు. వారి కోసం మనమెంతో దుఃఖిస్తూ ఉంటాం. అయితే ఎంత కాలమైనా అలా దుఃఖిస్తూ, తమ జీవన యాత్రను ఆపి వేసి ఎవరూ కూర్చోరు. కాల ప్రవాహంలో దుఃఖాన్ని దిగమ్రింగి జీవన పోరాటాన్ని కొనసాగిస్తూ ముందుకు పోతూనే ఉంటారు. కురుక్షేత్ర సంగ్రామం చెప్తున్న నిత్య సత్యం ఇదే! |
| 6. భీష్ముడు, మరెందరో మరణించిన అనంతరం కర్ణుడు తన సైన్యంతో వచ్చి కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొన్నాడు. | 6. వృద్ధులు, కాలం తీరిన వారు మరణిస్తూ, కనుమరుగు అవుతుంటారు. కొత్తగా మళ్ళీ ఎందరో పుడుతూ, జీవన సంగ్రామంలోకి దిగుతూ ఉంటారు. |
| 7 శ్రీకృష్ణుని అండతో పంచపాండవులు విజయాన్ని సాధించారు. | 7. జీవన పోరాటంలో భగవంతుని అండతో, మన పాంచ భౌతికమైన శరీరం విజయాన్ని సాధిస్తుంది. |

కురుక్షేత్ర యుద్ధం ద్వారా ఎన్ని జీవన సత్యాలు తెలిసి వస్తున్నవో చూశారు కదా! పురాణేతిహాసాల్లోని అనేక పాత్రలు, సంఘటనలు నేటికీ మన జీవితాల కెంతో ఉపయుక్తంగా ఉంటాయి. మనకెంతో మనోబలాన్నీ, స్ఫూర్తినీ కల్గిస్తాయి. పురాణేతిహాసాల్ని కాకమ్మ కథలుగా కొట్టి పారేయకుండా - వాటిలోని అంతరార్థాలనూ, సందేశాలనూ గ్రహించగలిగే శక్తిని పెంపొందించుకోవాలి మనం.

## ★ సంసార జీవనమే ఓ పద్మవ్యూహం ★

కురుక్షేత్ర యుద్ధంలో ఒక ప్రముఖమైన ఘట్టం 'పద్మవ్యూహపోరాటం.' మన జీవితంలో ప్రముఖమైన భాగం 'సాంసారిక జీవనం.' మానవుల సాంసారిక జీవనం 'పద్మవ్యూహపోరాటాన్ని' తలపిస్తూ ఉంటుంది. అదెలాగో పరిశీలించి చూద్దాం.

| ఇతిహాస అంశం | అంతరార్థం |
|---|---|
| 1. పద్మవ్యూహంలో ప్రవేశించడం, విజయవంతంగా తిరిగి రావడం తెలిసినవారు కృష్ణార్జునులు. వీరిలో ఒకరు పరమాత్మ, మరొకరు పరమాత్మను మనసున నిలుపుకున్న ఉత్కృష్ట జీవాత్మ. | 1. పద్మవ్యూహం అంటే సంసార బంధం. దానిలోనికి ప్రవేశించిన తర్వాత, దాన్ని దాటుకుని విజయం సాధించడం అందరికీ సాధ్యంకాదు. సంసార బంధనాల్ని జయించాలంటే - సాక్షాత్తూ పరమాత్ముడైనా కావాలి, లేదా పరమాత్మను భక్తి శ్రద్ధలతో మనసున నిలుపుకున్న మహాత్ములైనా కావాలి. |
| 2. అభిమన్యుడికి పద్మవ్యూహంలో ప్రవేశించడం తెలుసు. అయితే ఆ వ్యూహంలో ప్రవేశించిన తర్వాత శత్రువులు చుట్టు ముట్టినప్పుడు, వారిని ఛేదించుకొని బయటకు రావడం తెలియదు. | 2. అభిమన్యుడు అనగా సాధారణ మానవుడనే అర్థంలో చూడాలి మనం. సాధారణ మానవులకు సంసార బంధాల్లో ప్రవేశించడం బాగానే తెలుసు. అతి ఉత్సాహంతో ఉరక లేస్తూ ప్రవేశిస్తారు. అయితే కాల క్రమేణా సంసారిక సమస్యలు శత్రు |

| | |
|---|---|
| | వులవలె చుట్టుముట్టినప్పుడు, వాటిని ఎదిరించి పరిష్కరించుకోగల శక్తి వారికి ఉండడంలేదు. |
| 3. పద్మవ్యూహం నుండి బయట పడడం తెలియని అభిమన్యునికి తామంతా వెనుక అండగా వుంటామంటూ ధర్మరాజు, భీముడు, నకులుడు, సహదేవుడు, సాత్యకి, ఘటోత్కచుడు, దృష్టద్యుమ్నుడూ మొదలైన యోధులంతా ధైర్యం చెప్పారు. | 3 వివాహం జరిపించి, సంసారిక జీవనంలోకి సాగనంపుతారు పెద్దలు. వారి సంసారిక ఒడిదుడుకులకు రక్షణగా తాము నిలబడతామని పెద్దలంతా కూడా భరోసా ఇస్తారు. |
| 4. పెద్దలందరినీ నమ్ముకున్న అభిమన్యుడు పద్మవ్యూహం మధ్య శత్రువుల చేతిలో చిక్కుబడ్డాడు. బయటకు రాలేకపోయాడు. | 4. పెద్దల దీవెనలతో సంసారిక వలయం అనబడే పద్మవ్యూహంలో పడిన వ్యక్తి, అనేక సమస్యల మధ్య చిక్కుకుపోతాడు. బయటకు రాలేకపోతాడు. |
| 5. సహాయం వస్తామని చెప్పిన ధర్మరాజు మొదలగు పెద్దలంతా సైంధవుని కారణంగా అభిమన్యుడికి అండగా నిలువలేకపోయారు. ఇక అభిమన్యుడొక్కడే చేతనైనంత వరకూ శత్రువులతో పోరాడి, ఆ పద్మవ్యూహంలోనే మరణించాడు. | 5. వివాహ బంధాన్ని దీవించిన పెద్దలు మరియు ఇతర బంధుమిత్రులూ ఎవరూ కూడా, అనంతర కాలంలో ఎదురయ్యే సంసారిక సమస్యల్లో తోడుగా నిలిచేందుకు రాలేకపోతారు. |
| 6. దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని, ద్రోణుడు, శల్యుడు - ఈ ఆరుగురు శత్రువులూ విడివిడిగా వచ్చి పద్మవ్యూహంలోని అభిమన్యుణ్ణి ఎదుర్కొన్నారు. విడివిడిగా వచ్చారు కనుక, అందరినీ ఓడించగలిగాడు | 6. అభిమన్యునిపై దాడి చేసిన కౌరవ పక్షం వీరులు ఆరుగుర్నీ - కామ, క్రోధ, మోహ, లోభ, మద మాత్సర్యాలతో పోల్చ వచ్చు. ఈ ఆరు దుర్గుణాలూ మన మనస్సుపై ఎప్పుడూ దాడి చేస్తూనే ఉంటాయి. అవి విడివిడిగా |

| | |
|---|---|
| అభిమన్యుడు. ఇక లాభం లేదని ఆ ఆరుగురూ కలసి ఒకేసారిగా అభిమన్యునిపై దాడిచేసారు. చుట్టు ముట్టారు. ఏకాకి అయిన అభి మన్యుడు పోరాడి పోరాడి చివరకు శక్తిహీనుడై దుర్మరణం పాలయ్యాడు. | దాడి చేస్తే, మనం ఎలాగోలా తట్టుకుంటూ వాటిని గెలవగలం. అయితే ఆ ఆరు దుర్గుణాలూ ఒకేసారి మనసును ఆక్రమిస్తే మాత్రం, మనం ఓడిపోయి అధోగతి పొందడం ఖాయం. |
| 7. అభిమన్యుడికి అప్పటి యుద్ధంలో సహాయం చేయగల శక్తి - శ్రీకృష్ణుడికీ, అర్జునుడికీ మాత్రమే ఉంది. వాళ్ళు తోడుంటే అభిమన్యుడు విజయం సాధించగలిగేవాడు. అయితే కృష్ణార్జునులు అతనికి చాలా దూరంగా మరెక్కడో ఉన్నారు. అందువల్ల లభించవలసిన సహాయం అభిమన్యునికి లభించలేదు. | 7. సంసారిక పోరాటంలో సఫలీకృతులం అయ్యేందుకు భగవంతుని యొక్క లేదా మహాత్ముల బోధనల యొక్క అండ కావాలి మనకు. భగవంతునకూ, మహాత్ముల బోధనలకూ దూరంగా ఉండే వారంతా - భవ బంధాల మధ్య అల్లాడుతూ, ఒంటరి పోరాటం చేస్తూ, ఓటమిని పొందుతారు. (కృష్ణార్జు నులకు దూరమైన అభిమన్యుని గతే వారికీ పడుతుందన్నమాట.) |

పై విషయాల నుండి మనం గ్రహించవలసిందేమంటే - మానవులంతా సంసార బంధాల్ని త్రెంచుకొని, సన్యాసం స్వీకరించమని కాదు. పద్మవ్యూహం వంటి సంసార జీవనంలోకి అడుగుపెట్టవద్దనీ కాదు. పద్మవ్యూహంలోకి వెళ్ళి విజయంతో తిరిగి వచ్చినవాడే మొనగాడు. అలాగే సంసార జీవితంలో ప్రవేశించి అందులోని మోహపాశాలకు లొంగకుండా, పై ఆరు దుర్గుణాలకూ లోనుకాకుండా విజయవంతంగా జీవనం గడిపిన వాడే ధన్యుడు. తామరాకుపై నీటి బొట్టులా ఆ విధంగా గడపడానికి మనకు దైవభక్తి, మహాత్ముల బోధనలు ఎంతగానో సహకరిస్తాయి. ఈ సందర్భంలో మనం గుర్తుంచుకోవలసిన పాఠం ఇదే!

❦ ❦ ❦

## ★ శ్రీకృష్ణుడు, పాండవులు, ద్రౌపది ★

శ్రీకృష్ణుడు, పాండవులు, ద్రౌపది... వీరియొక్క పాత్రలు, నడవడిక -

మానవశరీర నిర్మాణానికి, మానవ జీవనయాత్రకు అద్దం పడుతున్నాయి. వారి పాత్రల్ని మనం జాగ్రత్తగా పరిశీలించిచూస్తే, మానవ జీవనగమనమంతా వారిలో కన్పిస్తుంది. ఆ విషయాల్ని ఇప్పుడు తరచిచూద్దాం.

| ఇతిహాస విషయం | అంతరార్థం |
|---|---|
| 1. పాండవులు ఐదుగురూ వేర్వేరు దైవాంశాలవల్ల జన్మలనెత్తినా, ఒకే ఇ[illegible] సోదరులుగా జన్మించారు. | 1. నేల, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనబడే పంచభూతాలు వేర్వేరు శక్తులే! అయినా అవన్నీ కలసి, పంచ భౌతికమైన మన శరీరం తయారవు తోంది. ఈ సందర్భంలో పంచపాండ వుల్ని పంచభూతాలకు ప్రతీకలుగా చెప్పుకోవచ్చు. |
| 2. పాండవులకు ద్రౌవది అనబడే సౌందర్యరాశి అయిన భార్యవుంది. | 2. పంచభౌతిక శరీరానికి శోభనిచ్చే 'శారీరక తేజస్సు'ను ద్రౌపదికి ప్రతీకగా గుర్తించవచ్చు మనం. |
| 3. పాండవులకు, ద్రౌపదికి సదాతోడుగా ఉండేవాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడు తన అవతారాన్ని చాలించేవరకు వారి శ్రేయస్సుకై పాటుపడ్డాడు. శ్రీకృష్ణుడు చెప్పిన ప్రకారమే వారు నడచుకునే వారు. | 3. పరమాత్మలోని చిరు అంశ అయిన 'జీవాత్మ' శరీరంలోనికి చేరి దానితో నివసిస్తూ, చలనాన్ని కలిగిస్తుంది. (ఆ జీవాత్మయే 'ప్రాణం' అంటే!) జీవాత్మ శరీరంలో ఉన్నంతకాలం, అది ఆ శరీర శ్రేయస్సుకే పాటు పడు తుంది. జీవాత్మచెప్పినట్టే నడచుకుం టుంది శరీరం. శరీరానికి ప్రాణం ఎలాంటిదో పాండవులకు, ద్రౌపదికీ 'శ్రీకృష్ణుడు' అటువంటివాడని ఇక్కడ మనం గమనించవలసి ఉంటుంది. |
| 4. పాండవులు - యమ, వాయు, ఇంద్ర, అశ్విని దేవతల అంశలే అయినా, ఆ | 4. పంచభూతాలు వేర్వేరు ప్రకృతి శక్తులే అయినా, అవన్నీ విశ్వరూపంలోని |

| | |
|---|---|
| అంశలన్నింటికీ మూలం శ్రీమహా విష్ణువే! | భాగాలే! అంటే విశ్వరూపుడైన విష్ణువులో అంశలే అవన్నీ! |
| 5. శ్రీకృష్ణుడు మాత్రం నేరుగా మహా విష్ణువు అవతారం. | 5. మనిషిలోని జీవాత్మ (ప్రాణం) మాత్రం నేరుగా పరమాత్మనుండి సంక్రమించినదే! |
| 6. పాండవులకూ, ద్రౌపదికీ దుష్ట కౌరవులు కీడు తలపెట్టేవారు. అయినా పాండవులు వాటిని తట్టుకుంటూ ధర్మంగా నిలిచారు. శ్రీకృష్ణుని నమ్ముకుని విజయాన్ని పొందారు. రాజ్యాన్ని సాధించుకున్నారు. | 6. కామక్రోధాది దుర్గుణాలు మనకు కష్టాల్ని తెచ్చిపెడతాయి. (ఈ దుర్గుణాలకు ప్రతీకలు కౌరవులు.) ప్రాణశక్తిలోని భాగమైన విచక్షణా జ్ఞానాన్ని నమ్ముకుంటే, ఆ దుర్గుణాల నుండి బయటపడగలం. జీవితాన విజయాన్ని సాధించగలం. |
| 7. శ్రీకృష్ణుడు తన అవతారాన్ని చాలించిన అనంతరం, శ్రీమహా విష్ణువులో లీనమయ్యాడు. భూమిపై తనపని పూర్తి అయ్యేవరకే ఉంటాడాయన. తర్వాత విశ్వరూపునిలో కలిసి పోతాడు. | 7. ఈ భూమిపై మనపాత్ర ముగిసిన అనంతరం మన ప్రాణం, మనశరీరాన్ని విడిచి, అనంతంలో కలిసి పోతుంది. అదే మన మరణం. |
| 8. శ్రీకృష్ణుడు వెళ్ళిపోయాకా పాండవులు నిర్వీర్యులయ్యారు. తన కళ్ళముందే యాదవ స్త్రీలను దొంగలు దోచుకు పోతున్నా, అర్జునుడు రక్షించలేకపోయాడు. అస్త్రాలు గుర్తుకు రాలేదు. శస్త్రాలు విఫలమయ్యాయి. | 8. ప్రాణం పోయిన తర్వాత శరీరం అచేతనమౌతుంది. మెదడు ఆలోచించలేదు. అవయవాలు పని చెయ్యవు. ఇదీ దాని భావం. |
| 9. శ్రీకృష్ణుడు లేని తమ ఉనికి నిరర్థకమని గమనించిన పాండవులు, | 9. ప్రాణంలేని శరీరం నిలువ ఉండదు. నిరర్థకమౌతుంది. ప్రాణం కోల్పోగానే, |

| | |
|---|---|
| ద్రౌపది - తమ బంధాలన్నింటినీ త్రెంచుకుని, అయినవారందరినీ విడిచి ఉత్తరదిశగా మహాప్రస్థానానికి బయలుదేరారు. (పరమాత్ముని తలచుకుంటూ, ప్రాణత్యాగం చేసే వరకూ వారు చేసిన ప్రయాణమే 'మహాప్రస్థానం'.) | శరీరం భవబంధాల్ని తెంచుకుంటుంది. అయినవారందరి వీడ్కోలుతో పాడె ఎక్కి, స్మశానం వైపుకు దారి తీస్తుంది. (పూర్వం స్మశానాన్ని కేవలం ఉత్తర దిశవైపే ఏర్పాటు చేసేవారు.) |

ఇక్కడ మనం ఒక చిన్న విషయాన్ని గమనించాలి. ద్రౌపది కాకుండా పాండవులకు వేర్వేరుగా భార్యలున్నారు. వారికి పిల్లలూ ఉన్నారు. పాండవుల మహాప్రస్థాన సమయానికి ఉపపాండవులు తప్ప, మిగిలిన వాళ్ళెవరూ కూడా మరణించిన దాఖలాలు లేవు. అంతకు ముందయినా అరణ్యవాసంలో గానీ, అజ్ఞాతవాసంలో గానీ వాళ్ళెవరూ పాండవుల వెంట రాలేదు. చివరకు అంతిమ దశ అయిన మహాప్రస్థాన సమయంలో కూడా, వాళ్ళు పాండవుల్ని అనుసరించలేదు. కేవలం అప్పుడూ, ఎప్పుడూ కూడా ద్రౌపది మాత్రమే పాండవుల వెంట ఉంది. ఇందులో ఒక అంతరార్థాన్ని మనం గమనించవచ్చు. పాండవులు మానవశరీరమైతే, ద్రౌపది ఆ శరీరతేజస్సు అని చెప్పుకున్నాం కదా! శారీరక తేజస్సు, శరీరాన్ని ఎలా అంటిపెట్టుకుని ఉంటుందో, ద్రౌపదికూడా పాండవుల్ని అలాగే అంటిపెట్టుకుని ఉంది.

పాండవుల ఇతర భార్యల్నీ, కుమారుల్నీ - మానవుడు ఈలోకంలో సంపాదించుకున్న కాంతా కనకాలు, సంపదలు, బంధుమిత్రులతో పోల్చుకోవచ్చు. ఎందుకంటే మన సంపదలుగానీ, ఇతరితరంగా అయినవాళ్ళుగానీ అన్నివేళలా మనతో ఉండటం జరగదు. ఎల్లవేళలా ఏదీ వెంటరాదు. పాండవుల్ని అడుగడుగునా అనుసరించిన ద్రౌపదివలె, "శారీరక తేజస్సే" జీవితాన చివరివరకూ మన వెంట ఉంటుంది.

చనిపోయిన తరువాత భార్యాబిడ్డలు, బంధుమిత్రులూ ఎవరూ మన కూడా రారు. అయితే చనిపోయిన కాస్సేపటి వరకూ, శారీరక తేజస్సు మాత్రం మనతో ఉంటుంది. అనంతరం అదీ మాయమౌతుంది. శారీరక తేజస్సు నిర్వహిస్తున్న ఈపాత్రను ద్రౌపదితో పోల్చి చూద్దాం.

| | |
|---|---|
| 10. మహాప్రస్థాన సమయంలో హిమాలయాలు ఎక్కుతూ, ముందుగా ద్రౌపది పడిపోయింది. తనకంటే ముందు ప్రయాణిస్తూ వెళ్తున్న ఐదుగురు భర్తల్నీ వదిలేసి, మరణానికి లోనయిందామె. ఆమె ప్రాణాంశ, శ్రీమహాలక్ష్మిలో లీనమైంది. | 10. శ్రీకృష్ణుడు వెళ్ళిపోయిన అనంతరం పాండవులు, ద్రౌపది మృతతుల్యులయ్యారు. ద్రౌపది అనబడే శారీరక తేజస్సు కలిగిన శవంగా మారారు పాండవులు. మరణానంతరం కూడా శారీరక తేజస్సు కాస్సేపు అంటిపెట్టుకుని ఉంటుంది. ఆ తర్వాత అదృశ్యమై విశ్వంలో లీనమౌతుంది. ఆ విధంగానే ద్రౌపది, మృతతుల్యులైన పాండవులతో కొంతకాలం కలిసి ప్రయాణించింది. అనంతరం మరణానికి లోనై, లక్ష్మీదేవిలో విలీనమైంది. |
| 11. ద్రౌవది తర్వాత ఒకరొకరుగా సహదేవుడు, నకులుడు, అర్జునుడు, భీముడు పడిపోయి మరణించారు. ధర్మరాజు మాత్రం ప్రయాణిస్తూ వెళ్ళి, స్వర్గాన్ని చేరుకున్నాడు. | 11. శవదహన కార్యక్రమంలో శరీరం - 'గాలి, అగ్ని, నీరు, భూమి' అనే భాగాలుగా విడిపోతుంది. ఈ నాలుగూ భూవాతావరణంలో కలిసి పోగా, పంచభూతాల్లో 5వది అయిన ఆకాశ అంశ మాత్రం అంతరిక్షం (ఆకాశం) లోకి వెళ్ళిపోతుంది. (గాలి, అగ్ని, నీరు, భూమి అంశల్ని - భీమ, అర్జున, నకుల సహదేవులతోనూ, ఐదవది అయిన ఆకాశ అంశను ధర్మరాజుతోనూ పోల్చడం జరిగిందిక్కడ.) |
| 12. పాండవులు స్వర్గారోహణయాత్ర ప్రారంభించినప్పటినుండీ, ఒకకుక్క వారిని అనుసరిస్తూ ప్రయాణించ | 12. మరణానంతరం అన్నీ వదులుకుని సాగిపోయే మనకు తోడుగా నీడగా వచ్చేది - మనం చేసుకున్న ధర్మం |

| | |
|---|---|
| సాగింది. ద్రౌపది, నలుగురు తమ్ముళ్ళూ మరణించినా సరే - ధర్మరాజు అలా ముందుకు సాగిపోతూనే ఉన్నాడు. ఆ కుక్క మాత్రం ధర్మరాజును అనుసరిస్తూనే ఉంది. స్వర్గం చేరుకునే సమయంలో ధర్మరాజు ప్రక్కన ఆ కుక్క మాత్రమే ఉంది. ఆ కుక్క ఎవరో కాదు ధర్మానికి ప్రతినిధి అయిన 'యమధర్మరాజు' | ఒక్కటే అదే ఇందులోని అంతరార్థం. (చేసుకున్న పాపపుణ్యాల ఫలాలు మరణానంతరం మన వెంట వస్తాయని ఇందుమూలంగా తెలుస్తోంది.) |
| 13. మహాభారత స్వర్గారోహణ పర్వంలో చెప్పబడినట్లుగా శ్రీకృష్ణ, ద్రౌపది, పాండవులంతా - ఏ అంశలవల్ల పుట్టారో, తిరిగి ఆ మాతృ అంశల్లో లీనమయ్యారు. | 13. అంటే మనిషి మరణించాకా, అతని జీవాత్మ పరమాత్మలోనూ; మిగిలిన శరీరం తిరిగి పంచభూతాల్లోనూ లీనమైపోతాయని తెలుస్తోంది. |

పైన తెలుసుకున్న అంతరార్థాలన్నీ మనం ఏనాటికీ గుర్తుంచుకోవలసిన సత్యాలు. ధర్మపరమైన జీవనానికి అవి మార్గదర్శకాలు.

చివరిగా తెలుసుకోవలసిన మరో చిన్న విషయమేమంటే - చనిపోయిన ప్రతివారి జీవాత్మా కూడా వెంటనే పరమాత్మలో లీనం కాదు (అంటే ముక్తిని పొందదు). వారు చేసిన పాపపుణ్యాల ఆధారంగా పరమాత్మలో లీనం కావడం, నరకప్రాప్తి, పునర్జన్మ అనే ఫలితాలు కలుగుతుంటాయి.

## ★ కర్మఫలం - భక్తి ఫలం ★

చేసిన పనిని 'కర్మ' అంటాం. అది మంచి పని కావచ్చు. చెడ్డ పనికావచ్చు. ఏదయినా కర్మే! మంచిపనికి సత్ఫలితాన్ని, చెడుపనికి దుష్ఫలితాన్ని మనకు అందిస్తుంది దైవశక్తి. మంచిగాని, చెడుగాని - చేసిన కర్మకు ఫలితాన్ని మాత్రం మనం అనుభవించి

తీరాలనేది శాశ్వత సత్యం. కొన్ని కర్మలకు ఫలితాలు ఈ జన్మలో లభిస్తాయి. మరికొన్ని మరుజన్మలకు కేటాయించబడతాయి. ఏ కర్మకు సంబంధించి ఏ జీవికి యేయే జన్మల్లో ఎలాంటి ఫలితాలను అందించాలో దైవానికి బాగా తెలుసు. ఆ విషయం అర్థం చేసుకోలేని మనం మాత్రం, అప్పుడప్పుడూ దైవాన్ని అపార్థం చేసుకుంటూ ఉంటాం. సత్కర్మలకు సుఖాలు ప్రాప్తిస్తే, మనకేం ఇబ్బందిలేదు. ఎటొచ్చీ పాపకర్మలకు కష్టాల్ని పొందాలంటేనే మనకు బాధ. క్రితం జన్మల పాపకర్మలకు, ఈ జన్మలో కష్టాల్ని పొందడం మనకు మరీ ఇబ్బందిని కల్గిస్తుంది. "ఇంత ఘోరమైన శిక్ష వేశాడు భగవంతుడు. అంత దారుణమైన పాపం ఏం చేశాననీ!" అని బాధపడుతుంటాం మనం. అంతదారుణమైన పాపం ప్రస్తుత జన్మలో చేసి ఉండకపోవచ్చు. క్రితం జన్మల్లో చేసి ఉంటామని మనం గ్రహించగలగాలి.

ప్రస్తుతపు జన్మలో చక్కటి పుణ్యకర్మ ఏదీ చేయకుండానే మనకు ఏదయినా గొప్ప లాభం కలిగిందనుకోండి. "అరె! ఈ జన్మలో నేను ఏమంత పుణ్యం చేశానని ఇంత లాభం కలిగింది!" అని ఎవరైనా ఆలోచిస్తారా. . . ? ఆలోచించరు. అదంతా గత జన్మల పుణ్యఫలమని కూడా అనుకోరు కనీసం. కేవలం తమ ఘనత వల్లనే, అంత లాభం కలిగిందని విర్రవీగుతారు. ప్రస్తుత జన్మలోని నడవడిక ప్రకారం ఆ సుఖసంతోషాలు తమకెలా కలిగాయని ఆలోచించరు. కష్టాలొస్తే మాత్రం విపరీతంగా గోలపెడుతూ అందరినీ తిట్టుకోవడం మొదలెడతారు. తన ప్రమేయం లేకుండా ఒకనాడు సుఖాలు వచ్చినట్లే, ఈ కష్టాలు కూడా వచ్చాయని భావించరు. ప్రస్తుతపు మరియు గత జన్మలలోని కర్మలే ఈనాటి సుఖ దుఃఖాలకు కారణాలని గ్రహించలేక పోతున్నారు చాలామంది. అందువల్లనే కష్టాలు కలిగినప్పుడల్లా, దేవుణ్ణి తిట్టుకోవడం పరిపాటి అయింది.

దుర్మార్గులైన వ్యక్తులు భోగభాగ్యాలతో సుఖంగా ఉండడం కనిపించిందనుకోండి. "ఇంకెక్కడి భగవంతుడు! ఓ న్యాయం లేదు, ధర్మంలేదు. పాపిష్టి వాళ్ల పనే బావుంది" అనుకుంటాం మనం. ఇది చాలా పొరబాటు అభిప్రాయం. దుర్మార్గులైన ఆ వ్యక్తులు, తమ గత జన్మలలోని పుణ్యకర్మల ఫలాల్ని, ఇప్పుడిలా అనుభవిస్తున్నారని మనం గ్రహించాలి. ఇప్పటి వారి దుర్మార్గాలకు తగిన పాపఫలం - ఈ జన్మలోనో లేదా రాబోయే జన్మల్లోనో తప్పక అనుభవిస్తారు. భగవంతుడు వేసే బాలెన్స్‌షీటు నుండి వాళ్ళు తప్పించుకోలేరు. ఒక జీవి యొక్క కర్మఫలాలు, అది ఎత్తే అన్ని

జన్మల(జీవితకాలాల)కూ సర్దబడి ఉంటాయి. అదే భగవంతుడు వేసే బాలెన్స్‌షీటు అంటే! దుర్మార్గులకు తక్షణం శిక్షపడిపోవాలనీ, సన్మార్గులకు వెనువెంటనే సుఖాలు కలగాలనీ - ఆవేశంతో భావించడం సాధారణ మానవ లక్షణం. భగవంతుడు మన వలే ఆవేశపడిపోడు. కాలక్రమేణా ఎవరికి ఏ ఫలితం ఎలా ఇవ్వాలో, ఆ విధంగా ఇచ్చి తీరుతాడు.

రాక్షసులకు విరివిగా వరాలివ్వడం, మళ్ళీ వారిని అంతం చేసేందుకు అవతారాల్ని ఎత్తడం... ఇవన్నీ భగవంతుడు ఎందుకు చేస్తుంటాడని మనకు సందేహం కలుగుతూ ఉంటుంది. కర్మఫలం, భక్తిఫలం గురించి చర్చిస్తున్న ఈ సందర్భంలో ఇటువంటి అంశం గురించి తెలుసుకోవలసిందే! పుణ్యకర్మలకు పుణ్యఫలం, పాపకర్మలకు పాపఫలం లభించి తీరుతుందనీ, దేని లెక్క దానిదేననీ చెప్పుకున్నాం కదా! ఎంతటి పాపాత్ముడైనా సరే పవిత్రమైన పుణ్యకర్మ చేసాడంటే - అతనికి పుణ్యఫలం వచ్చితీరుతుంది. ఆ ఫల సౌఖ్యాన్ని అతడు పొంది తీరుతాడు. అతడు చేసే చెడు కర్మలకు శిక్ష, వేరేగా వుంటుంది. అంతేగాని అతని పుణ్య ఫలం మాత్రం తరిగిపోదు. భగవంతుడు ఏర్పరచిన సమాన న్యాయం ఇది. వరాలు పొందిన రాక్షసుల విషయంలో దీని ప్రకారమే జరిగింది. పవిత్రమైన తపస్సు అనే పుణ్యకర్మ ద్వారా ఆ రాక్షసులకు భగవంతుని వరాలు ప్రాప్తిస్తాయి. దానితో అజేయులవుతారు వారు. ఆ పరిస్థితి వారిలో అహంకారాన్నీ, దురాశనూ రేపుతుంది. దుష్కర్మలు ప్రారంభిస్తారు. తపస్సుతో సాధించిన పుణ్యఫలం మిగిలి వున్నంత వరకూ, వారి దుష్కర్మలన్నీ సాగనిస్తాడు భగవంతుడు. పుణ్యఫలం తరిగి పోయిన మరుక్షణం, కర్మఫలం వెంటాడుతుంది వారిని. అప్పుడు భగవంతుడు ఏదొక విధంగా వారికి తగిన శిక్షను విధిస్తాడు. ఇంత చక్కటి సమన్యాయం, సృష్టిలో ఒక అద్భుతం. విశ్వం మొత్తానికే న్యాయాధికారి అయిన భగవంతుడు చేసే అద్భుతం ఇది.

చేసిన మంచికి సత్ఫలితాలు వెంటనే కనపడాలనీ, చెడు ఏదయినా చేసినా, దేవుడు దాన్ని క్షమించి వదలివేయాలనీ మనం కోరుకుంటూ ఉంటాం. మనుషులకు ఇలా వెర్రి మొర్రి కోరికలు అనేకం ఉండొచ్చు. కానీ భగవంతుడు వాటినేం లక్ష్యపెట్టడు. ధర్మబద్ధమైన నియమం ప్రకారం, కర్మఫలాల్ని అందించి తీరుతాడు. ఆయన తాను రూపొందించిన నియమాలను, చివరకు తన కోసం కూడా మార్చుకోడు. (భూమిపై అవతరించిన ప్రతి జీవికీ మరణం ఉంటుందని భగవంతుడు శాసనం చేశాడు.

అందువల్లనే తాను రామావతారం ఎత్తినా, కృష్ణావతారం ఎత్తినా - మరణాన్ని ఆహ్వానించడం ద్వారానే అవతారం చాలించాడాయన.)

జీవుల కష్టసుఖాల్నీ జయాపజయాల్నీ "కర్మలే" నిర్దేశిస్తూ ఉంటే - ఇక "దైవభక్తి" ఎందుకు పనికొస్తుందని సందేహం రావచ్చు. ఈ విషయమై కొస్త చర్చిద్దాం. దైవభక్తి అనేది అత్యుత్తమమైన సత్కర్మ. దానికి అనంతమైన సత్ఫలితాలు కలుగుతాయి. గతంలో చేసిన చెడు కర్మల నుండి దైవభక్తి మనల్ని రక్షించలేకపోవచ్చు. కానీ వర్తమాన, భవిష్య కర్మల్ని పవిత్రం చేయగల శక్తి దైవభక్తికి ఉంది. అనగా చెడు కర్మల పాపఫలాన్ని అనుభవించిన తర్వాత, దైవభక్తి కారణంగా మనకన్నీ శుభాలూ, విజయాలూ కలుగుతాయన్నమాట.

కర్మఫలం నుండి తప్పించుకోవడం మనకు సాధ్యంకాదు. "చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవ!" అంటారు కదా! అది అక్షరాలా యథార్థం. గత కర్మఫలాన్ని భక్తిఫలం కూడా మార్చలేదు. ఎంతటివారయినా అక్కడికది అనుభవించి తీరవలసిందే! కర్మఫలం అకౌంటు వేరు. భక్తిఫలం అకౌంటు వేరు. అయితే వీటికొక విధమైన సంబంధం ఉంది. భక్తిఫలం అనేది మనల్ని సత్కర్మలవైపు నడిపిస్తుంది. తద్వారా మన కర్మఫలం శుభకరంగా ఉంటుంది.

పైన తెలిపిన విషయాలకు ఒక చిన్న ఉదాహరణగా 'భక్త రామదాసు' విషయం చెప్పుకోవచ్చు. భక్త రామదాసు, తానీషాచే చెఱసాలలో వేయించబడి తన పూర్వజన్మ కర్మకు శిక్ష అనుభవించాడు. అది పూర్తికాగానే ఆయన భక్తి ఫలం మెండుగా ప్రకాశించింది. శ్రీరామచంద్రుని దయతో చెఱ నుండి విడుదలయి, విశేష కీర్తిని ఆర్జించాడు.

కుచేలుని సంగతి చూడండి. సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మ అతనికి బాల్యమిత్రుడు. అయినా కూడా అతను ఎంతో కాలం, కటిక దారిద్ర్యాన్ని అనుభవించవలసి వచ్చింది. దానికి కారణం అతని పూర్వజన్మ కర్మయే! ఆ కర్మఫలం ముగిసిన అనంతరం, అతని భక్తిఫలం విరబూసింది. శ్రీకృష్ణుడు స్వయంగా అతన్ని ఆదుకున్నాడు. దాంతో కష్టాలన్నీ గట్టెక్కి, విశేష భోగాలు అనుభవించాడు కుచేలుడు.

సాధుసజ్జనులైన ఎందరో మునీశ్వరులు రాక్షసుల చేతుల్లో చిత్రహింసలను భవించి మరణించడం పురాణేతిహాసాల్లో అనేకచోట్ల కన్పిస్తుంది. అంత ఘనులైన

ఆ మునీశ్వరులకు, అంతటి దారుణ మరణం ఎందుకు సంభవించిందంటారు? ... అదే కర్మఫలం! వారు క్రితం జన్మలో చేసుకున్న పాపకర్మల ఫలితం అది! దాన్ని ఎవరూ తప్పించలేరు. అనుభవించి తీరవలసిందే! అయితే ప్రస్తుత జన్మలోని వారి యొక్క భక్తి, తపస్సూ ఏమాత్రం వృధా కావు. వాటి ద్వారా లభించిన పుణ్యఫలంతో మోక్షం పొందుతారు వారంతా.

కర్మఫలాన్ని తప్పించుకోవడం ఎంతటివారికయినా సాధ్యం కాదని, పై విషయాల ద్వారా నిరూపణ అవుతోంది. సాక్షాత్తూ భగవంతుడు మన మిత్రునిగా అవతరించినా కూడా, కర్మఫలం అనేది అనుభవించి తీరవలసిందేనని కుచేలుని గాథ చెప్తుంది. మహాభారతంలో పాండవుల విషయమే చూడండి! వారంతా ధర్మాత్ములు. సాక్షాత్తూ శ్రీకృష్ణపరమాత్మ వారి పక్షాన్నే నిలిచాడు. అయితే మాత్రం వారికి కష్టాలు తప్పాయా? ... లేదు. పడరాని పాట్లు పడ్డారు. తమ సంతతినంతనూ (అభిమన్యుడు, ఘటోత్కచుడు, ఉపపాండవులు మొదలగువారిని) యుద్ధంలో కోల్పోయారు. బంధు మిత్రుల్నీ, హితుల్నీ కూడా పోగొట్టుకున్నారు. అయితే శ్రీకృష్ణుని ఎడల వారికున్న భక్తి ఏమాత్రం సడలి పోలేదు. అచంచలమైన ఆ భక్తి ఫలంగా, చివరకు విజయులై చరిత్రలో అజేయులై నిలిచారు.

ఇక్కడొక ప్రముఖ విషయాన్ని మనం గుర్తుంచుకోవలసి ఉంది. ఒక విధమైన ఉదాహరణగా మాత్రమే ఇక్కడ మనం పాండవుల సంగతిని చెప్పుకున్నాం. నిజానికి పాండవులూ ద్రౌపదీ అనుభవించిన ఏ కష్టమైనా కూడా, వారి క్రితం జన్మల పాప ఫలమేమీకాదు. వాళ్ళకు క్రితం జన్మలేవీ లేవు. దైవాంశలతో ద్వాపరయుగాన జన్మలనెత్తిన అవతారమూర్తులు వారు. ఆ యుగంలోని దుష్టులను అంతం చేసే జగన్నాటకంలో తమతమ పాత్రల్ని పోషించడానికి ఉద్భవించారు. (అవతారమూర్తులకూ, సాధారణ జీవులకూ చాలా వ్యత్యాసం వుంటుందని చెప్పుకున్నాం కదా!)

❦ ❦ ❦

## ★ దేవుడెంతవరకూ సహాయపడతాడు? ★

కర్మఫలం అనుభవించడం తప్పనిసరి అయినప్పుడు, ఇక దైవభక్తి వల్ల ఫలితం ఎంతవరకూ ఉంటుందో కాస్త చర్చిద్దాం.

దైవభక్తి వల్ల కలిగే ఫలంతో పాపకర్మలు మరిన్ని ప్రోగుపడకుండా ఉంటాయి.

అందువల్ల గతంలోని పాపకర్మలకు శిక్ష అనుభవించడంతో కష్టాలు ముగిసిపోతాయి. మిగిలిన కాలమంతా పుణ్యఫలంతో సుఖమయమౌతుంది. ధర్మాచరణ, తనపై భక్తి శ్రద్ధలూ ఉన్న వారిని భగవంతుడు గాలికి వదిలెయ్యడు. వాళ్ళు అనుభవించ వలసిన కర్మఫలాలు అనుభవించిన అనంతరం, వారియొక్క యోగక్షేమాలన్నీ అయనే స్వయంగా చూసుకుంటాడు. అయితే మనం ఈ విషయంపై నమ్మకం ఉంచలేక, అనేకవిధాల సతమతమౌతుంటాం. భగవంతునిపై భారం మోపిన ఒక పని సఫలం కాలేదనుకోండి... మనకు భగవంతునిపై చికాకు కలుగుతుంది. మనకు అత్యంత ప్రియమైన వ్యక్తి మన కళ్ళముందే మరణించాడనుకోండి. మనకు భగవంతునిపై ద్వేషం కలుగుతుంది. ఆ ద్వేషంతో మనం బాధకు లోనై - "నేనెన్నో పూజలూ, వ్రతాలూ చేశాను. మ్రొక్కుబడులు చెల్లించాను. అయినా కూడా చివరకు భగవంతుడు నాకు చేసింది ఇదా! నాకు ప్రియమైన వ్యక్తిని నాకళ్ళ ముందే ఇలా అర్థాంతరంగా తీసుకుపోతాడా!" అంటూ నిష్ఠురాలు పలుకుతాం. ఎవరికో బాకీ తీర్చినట్టుగా మ్రొక్కులూ, ముడుపులూ చెల్లించినంతలో మనకోసం భగవంతుడు విధి విధానాన్ని మార్చివేయాలా? 'సృష్టి క్రమాన్ని' నిలిపివేయాలా? మనం చెల్లించే ముడుపులపై భగవంతునికి ఆశ ఉంటుందా అసలు? మనం ఇచ్చే బంగారాన్నీ, సంపదల్నీ ఆయనేం చేసుకుంటాడు? అయినా ఆ సంపదలన్నీ కూడా ఆయనవే కదా! స్వచ్ఛమైన భక్తితో నిండిన మనసును మాత్రమే ఆయన మననుండి ఆశిస్తాడు. ఆ భక్తిని బట్టి ఫలాన్ని అందిస్తాడు. అంతేగాని ముడుపులకు లొంగిపోయి, మన కోరికలు నెరవేర్చడానికి ఆయనేమీ 'లంచగొండి' కాదు కదా! లంచాలతో భగవంతుణ్ణి కొనివేయగలిగితే, లోకంలో ఇక పుణ్యకార్యాలు చేసేవారెవరుంటారు? కేవలం స్వార్థం, పాపం, లంచం... ఇవే రాజ్యం ఏలుతాయి. అందుకే ఎవరికీ దేనికీ లొంగని ధార్మిక విధానంతో ఒక విధి విధానాన్ని ఏర్పరచాడు భగవంతుడు. ఆ విధివిధానాన్ని తన కోసం కూడా ఎన్నడూ మార్చుకోడాయన.

ఒక ప్రక్క కర్మఫలాల్ని అందిస్తూనే, మన భక్తి ఫలాన్ని బట్టి ఆయన మనకు సహకరిస్తూ ఉంటాడు. ఇందుకు సాక్ష్యాలు కృష్ణావతారంలో కూడా అనేకం కన్పిస్తున్నాయి. పాండవుల ధర్మనిరతి, భక్తిశ్రద్ధలూ చూసి ప్రసన్నుడయ్యాడు శ్రీకృష్ణుడు. అందువల్లనే అడుగడుగునా తాను అండగా ఉంటూ వారిని రక్షిస్తూ వచ్చాడు. ఎన్నెన్ని కష్టాలు పడినా కూడా, శ్రీకృష్ణుని దయ ఉండడం వల్లనే పాండవులు క్షేమంగా

ఉండగలిగారు. ముందు ముందు పాండవులకు కౌరవులతో యుద్ధం చేయవలసిన పరిస్థితి వస్తుందని శ్రీకృష్ణుడికి తెలుసు. అందువల్ల ఆయన మొదటి నుండీ కూడా పాండవులకు విజయం కలిగేందుకై బాటలు వేస్తూవచ్చాడు. భవిష్యత్తులో దుర్యోధనుడికి సహాయం రాగల దుర్మార్గులనెందరిలో కురుక్షేత్ర యుద్ధం కంటే ముందుగానే కడతేర్చాడు. (ఎందరినో తానే వధించాడు. కొందరిని భీమార్జునుల చేత వధింపజేశాడు.) పాండవుల చేత రాజసూయయాగం చేయించాడు. తద్వారా పాండవులు ఎన్నో ధన సంపదల్నీ పొందగలిగారు. ఎందరో రాజుల్ని మిత్రులుగా చేసుకోగలిగారు. అనేక వైవాహిక సంబంధాల ద్వారా పాండవుల బంధుకోటి వృద్ధి చెందేలా చేశాడు శ్రీకృష్ణుడు. జరగబోయే కురుక్షేత్ర యుద్ధం గురించి శ్రీకృష్ణుడు తీసుకున్న ముందు జాగ్రత్త చర్యలే ఇవన్నీ!

మన పుణ్యఫలాన్ని బట్టి అవసరానికి అనువైన ఆలోచనను స్ఫురింపజేస్తాడు భగవంతుడు. జరాసంధుని వధ విషయంలో గడ్డిపరకను చీల్చి చూపించడం ద్వారా భీముడికి శ్రీకృష్ణుడిచ్చిన ఆలోచన ఇందుకో ఉదాహరణ.

తన వస్త్రాపహరణ సమయంలో ద్రౌపది తన శక్తి మేరకు కౌరవ పక్షం పై తిరగబడింది. ఎక్కడో ఉన్న శ్రీకృష్ణుడు, అక్కడి నుండే అదంతా గమనిస్తూ ఉన్నాడు. ద్రౌపది తన శక్తి ఉడిగిపోయి "శ్రీకృష్ణా! నువ్వేదిక్కు" అని రెండు చేతులూ ఎత్తగానే, ఆమె మానాన్ని కాపాడాడు. భగవంతుడు రక్షించే విధానం అలాగే ఉంటుంది. ఆపదల నుండి రక్షణపొందడానికి మనం ముందుగా మన శక్తినంతా వినియోగించి చూస్తాం. ఇక మనవల్ల కాకపోతే దేవుణ్ణి శరణు వేడుతాం. గజేంద్రమోక్షం గాథ కూడా ఇటువంటిదే కదా! మన ప్రార్థనలోని భక్తినీ, కర్మఫలాన్నీ అనుసరించి భగవంతుడు మనకు సహకరిస్తాడు.

భగవంతుడెప్పుడూ కూడా తన భక్తుణ్ణి సరైన సమయంలో ఆదుకుంటూ ఉంటాడు. సైంధవ వధ విషయంలో శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఎలా కాపాడాడో ఒక్కసారి గుర్తుకుతెచ్చుకోండి. (వివరాలను 'సైంధవ వధ' అనే వ్యాసంలో ఇచ్చాం.) సూర్యుణ్ణి మరుగుపరచి సైంధవుడు బయటపడేలా చెయ్యడం, సైంధవుని శిరస్సు కారణంగా అర్జునుడు మరణించకుండా కాపాడడం. . . ఇవన్నీ శ్రీకృష్ణుని లీలలే కదా!

కవచకుండలాల్ని కర్ణుడు తనకు దానం ఇచ్చిన సందర్భంలో ఇంద్రుడు-'శక్తి'

అనే ఒక ఆయుధాన్ని కర్ణునకు అందిస్తాడు. ఆ ఆయుధం ఒకే ఒకసారి ప్రయోగించేందుకే ఉపకరిస్తుంది. ఉపయోగించినప్పుడు మాత్రం శత్రువు ఎంతటి వాడయినా సరే, వాణ్ణి చంపేస్తుంది. ఆ శక్తి ఆయుధంతో అర్జునుణ్ణి చంపాలని తలచాడు కర్ణుడు. కర్ణుడు కనుక ఆ శక్తిని ప్రయోగిస్తే, ఖచ్చితంగా అర్జునుడు మరణిస్తాడు. అందుకు సందేహం లేదు. అయితే అక్కడే అడ్డుపడ్డాడు శ్రీకృష్ణుడు. ఆ వివరం తెలుసుకుందాం. కురుక్షేత్రయుద్ధంలోకి ప్రవేశించిన నాటినుండి కర్ణుడు ఏ రోజుకు ఆ రోజే శక్తి ఆయుధాన్ని ప్రయోగించాలని అనుకోవడం, వెనువెంటనే దాని సంగతి మరచిపోవడం జరుగుతుండేది. ఒక్క కర్ణుడికే కాదు. కౌరవపక్షం అంతటికీ 'శక్తి ఆయుధ విషయంలో' ఈ మరుపు వచ్చేది. దానికి కారణం 'కృష్ణమాయ'. శ్రీకృష్ణుడు వారందరికీ అలా మరుపును కలిగించేవాడు. కురుక్షేత్ర యుద్ధం 14వ రోజున ఘటోత్కచుడు చేస్తున్న ఘోరయుద్ధాన్ని కౌరవపక్షం తట్టుకోలేక పోయింది. దుర్యోధనాదులంతా తమ మరణం ఖాయం అనుకున్నారు. ఎలాగోలా ఘటోత్కచుణ్ణి త్వరగా చంపేయమని కర్ణుడిపై వత్తిడి తెచ్చాడు దుర్యోధనుడు. తమ రక్షణకు వేరే దిక్కులేని సమయంలో శక్తి ఆయుధం చటుక్కున గుర్తుకొచ్చింది కర్ణుడికి. 'అర్జునుడి సంగతి తర్వాత చూద్దాం. ఈలోగా ఘటోత్కచుడి చేతిలోంచి బ్రతికి బయటపడాలి కదా!' అనుకుంటూ కర్ణుడు తన శక్తి ఆయుధాన్ని ఘటోత్కచునిపై ప్రయోగించాడు. దాంతో మహావీరుడైన ఘటోత్కచుడు మరణించాడు. శక్తి ఆయుధంతో వచ్చే ముప్పునుండి అర్జునుణ్ణి ఈ విధంగా తప్పించాడు శ్రీకృష్ణుడు. కురుక్షేత్రయుద్ధంలో అర్జునుణ్ణి ఇంకా అనేకవిధాల కాపాడాడు శ్రీకృష్ణుడు. భగదత్తుడు వేసిన నారాయణాస్త్రం అర్జునునిపైకి దూసుకు వస్తూండగా శ్రీకృష్ణుడు అడ్డుపడి, దాన్ని పూలహారంగా మార్చుకుని, మెడలో ధరించాడు. కర్ణుడు వేసిన నాగాస్త్రం నుండి అర్జునుణ్ణి తప్పించేందుకు రథాన్ని 5 అంగుళాలు భూమిలోకి అణగద్రొక్కాడు. ఈ విధంగా అనేక ఆపదల నుండి అర్జునుణ్ణి గట్టెక్కించాడాయన. దైవమే సహాయం చేయదలచుకుంటే, అలా మారిపోతాయి పరిస్థితులు.

కౌరవపక్షంలోని మహావీరులందరినీ పాండవుల విజయపథంనుండి వివిధ రకాలుగా ఏరి పారవేశాడు శ్రీకృష్ణుడు. చివరకు దుర్యోధనుని వధ సమయంలో కూడా, భీముడికి అలనాటి ప్రతిజ్ఞ గుర్తుకు వచ్చేటట్లు చేశాడు. దాంతో భీముడు దుర్యోధనుని తొడలు విరగ్గొట్టి విజయం సాధించాడు.

18 రోజుల కురుక్షేత్రం యుద్ధం ముగిసింది. పాండవులు విజయాన్ని పొందారు.

శిబిరాలకు చేరి అందరూ రథాలు దిగుతున్నారు. శ్రీకృష్ణుడు అర్జునునివైపు చూసి, "గాండీవమూ, మిగతా ఆయుధాలతో పాటూ ముందుగా నువ్వు రథం దిగు. ఆ తర్వాత నేను దిగుతాను. అంతా శుభం జరుగుతుంది" అన్నాడు. ఆ ప్రకారమే అర్జునుడు ముందుగా రథం దిగాడు. అనంతరం శ్రీకృష్ణుడు దిగాడు. ఆ రథం పైనుండే కపిధ్వజం విడివడి పైకి వెళ్ళిపోయింది. మరుక్షణం గుర్రాలతో సహా భగ్గున మండిపోయింది రథం. ఆశ్చర్యపోయాడు అర్జునుడు. ఎందుకలా జరిగిందని శ్రీకృష్ణుణ్ణి అడిగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వి, "అర్జునా! కౌరవపక్షంలోని యోధానయోధులు ప్రయోగించిన మహాస్త్రాల కారణంగా ఈ రథం ఏనాడో కాలిపోవలసిందే! అయితే అలా జరగకుండా ఇంతవరకూ ఆ ప్రమాదాన్ని నిలువరించాను" అని చెప్పాడు. శ్రీకృష్ణుడు తనను రక్షించిన తీరు చూసి చలించిపోయాడు అర్జునుడు.

అర్జునుడి రథం కాలిపోయిన సంఘటన మన జీవితాలకు ఒక ముఖ్య సందేశాన్ని అందిస్తోంది గమనించండి. కురుక్షేత్ర యుద్ధాన్ని మానవజీవన పోరాటంతో పోల్చి చెప్పుకున్నాం గుర్తుంది కదా! మన జీవన రథమే, అర్జునుని రథంగా భావించుకోవాలి మనం. అలనాటి ఆ రథంపై రథికుడు అర్జునుడు కాగా, ఈనాటి మానవుడే నేటి జీవన రథంపై రథికుడు. అర్జునుడు తన రథసారధ్యాన్ని కృష్ణునకు అప్పగించినట్లుగానే మనం కూడా మన జీవనరథాల సారధ్యాన్ని భగవంతునకు అప్పగించాలి. అప్పుడే జీవన పోరాటంలో విజయాన్ని సాధించగలం. జీవన రథసారధ్య భారం భగవంతునిపై వేసి మనం ధర్మమార్గాన జీవించాలని దీని భావం. ఆ విధంగా భగవంతునిపై భారం వేసినప్పుడు - కౌరవ పక్షం వారు వేసిన మహాస్త్రాల నుండి అర్జునుడి రథాన్ని రక్షించినట్లుగానే, నిత్య జీవన సమస్యల నుండి మన జీవనరథాన్ని భగవంతుడు రక్షిస్తాడు. కౌరవ పక్షవీరులు ప్రయోగించిన అస్త్రాల్ని ఈ సందర్భంలో 'మన నిత్య జీవన కష్టనష్టాలతో' పోల్చి చూసుకోవాలి. మన జీవనరథాన్ని ఈ నిత్యజీవన కష్టాలెన్నో చుట్టుముడుతూ ఉంటాయి. మనం నిజమైన భక్తిని కలిగి ఉన్ననాడు, అలాంటి కష్టాలెన్ని చుట్టుముట్టినా - వాటివల్ల మన జీవన రథం నాశనం కాకుండా భగవంతుడు అడ్డుపడతాడు. హృదయ రథంలో మనం భగవంతుని నిలుపుకుని ఉన్నంతకాలం మన జీవన రథం ఆహుతి కాదు. మనం గాని అజ్ఞానంతో భగవంతుణ్ణి హృదయం నుండి తొలగిస్తే మాత్రం, తక్షణం మన జీవనరథం కాలి బూడిదవుతుంది. అందువల్ల జీవితాంతం వరకూ మనం భగవంతుణ్ణి మన మనసులో నిలుపుకోవాలి. అప్పుడే

మన జీవన రథానికి ఆయన సారథిగా చివరి వరకూ నిలుస్తాడు. కురుక్షేత్ర యుద్ధం చివరి వరకూ అర్జునుడు తన రథంపై శ్రీకృష్ణుణ్ణి నిలుపుకున్నాడు. మనం కూడా మన జీవితాంతం వరకూ భగవంతుని మనసులో నిలుపుకోవాలని దాని అంతరార్థం.

కురుక్షేత్ర యుద్ధం ముగింపును, మానవ జీవితం ముగింపుతో పోల్చిచూడండి. కురుక్షేత్ర యుద్ధానంతరం అర్జునుణ్ణి రథం దిగిపొమ్మంటూ ఆదేశించాడు శ్రీకృష్ణుడు. మన జీవితం ముగిసిపోగానే శరీరాన్ని వదిలివేయమంటూ మన జీవాత్మకు భగవంతుడిచ్చే ఆదేశం ఇటువంటిదే! అర్జునుడు రథాన్ని దిగిపోయినట్లుగా, 'శరీరాన్ని' విడుస్తుంది జీవాత్మ అనంతరం శ్రీకృష్ణుడు రథాన్ని వదిలి పెట్టినట్టుగా, దైవకృప ఆ శరీరం నుండి తప్పుకుంటుంది. తక్షణం జీవి మరణాన్ని పొందుతుంది. అప్పుడు అర్జునుని రథం మాదిరిగా, ఆ మృత కళేబరం అగ్నికి ఆహుతి అవుతుంది. (అంటే దహన పరచబడుతుందని అర్థం.)

శ్రీకృష్ణుని నమ్ముకున్న అర్జునుడికి రథం దిగిన అనంతరం రాజ్యం ప్రాప్తించింది. భగవంతుని నమ్ముకున్న జీవాత్మ, శరీరం నుండి బయటకు రాగానే మోక్షాన్ని పొందుతుంది. అర్జునుడి రథం కాలిపోయిన సంఘటన ద్వారా మనం తీసుకోవలసిన సందేశం ఇదే!

భగవంతుడు తన భక్తుల్ని అనేక విధాల రక్షిస్తూ ఉంటాడు అందుకు మరో ఉదాహరణ కూడా చూద్దాం.

కురుక్షేత్రంలో విజయం సాధించిన అనంతరం పాండవులు, ధృతరాష్ట్రునికి నమస్కరించడానికి వెళ్ళారట. తన బిడ్డలందరినీ వధించిన భీమునిపై ధృతరాష్ట్రునికి పట్టలేనంత కోపం ఉంది. ఆ విషయం శ్రీకృష్ణునకు బాగా తెలుసు. గ్రుడ్డివాడయిన ధృతరాష్ట్రునికి నమస్కరించడానికి వెళ్తున్న భీముణ్ణి వెనక్కిలాగి, తాను అంతకుముందే తయారుచేయించి ఉంచిన 'భీముని ఇనుప విగ్రహాన్ని' ధృతరాష్ట్రుని ముందు పెట్టించాడు శ్రీకృష్ణుడు. ఆ విగ్రహాన్ని నిజమైన భీముడే అనుకున్నాడు ధృతరాష్ట్రుడు. వల్లమాలిన క్రోధంతో ఆ విగ్రహాన్ని గుండెలకు హత్తుకుని గట్టిగా నొక్కేశాడు. ఆ ఇనుప విగ్రహం ముక్కముక్కలైపోయింది. పదివేల ఏనుగుల బలశాలి ధృతరాష్ట్రుడు. అందులోనూ అమిత క్రోధంతో ఉన్నాడు. విపరీతమైన బలంతో నొక్కేయడంతో, అంతటి గట్టి విగ్రహమూ మట్టికుండ మాదిరిగా చితికిపోయింది. నిజంగానే భీముడే

ముక్కముక్కలై మరణించాడని తలచాడు గ్రుడ్డి ధృతరాష్ట్రుడు. "అయ్యో! చచ్చిపోయావా నాయనా " అంటూ కల్లబొల్లి ఏడుపులు మొదలెట్టాడు. అప్పుడు శ్రీకృష్ణుడు నవ్వి "ధృతరాష్ట్రా! మరేం బాధపడకు. భీముడు నిక్షేపంగా ఉన్నాడు. నువ్వు ముక్కలు చేసింది భీముని విగ్రహాన్ని మాత్రమే! నీ దురాలోచన ముందుగానే గమనించి నేనే ఈ ఏర్పాటు చేశాను" అన్నాడు. ఆ మాటలకు సిగ్గుతో తలెత్తుకోలేకపోయాడు. ధృతరాష్ట్రుడు.

కురుక్షేత్రయుద్ధానంతరం పాండవుల వంశాంకురాలైన ఉపపాండవుల్ని అధర్మంగా సంహరించాడు అశ్వత్థామ. అభిమన్యుని భార్య అయిన 'ఉత్తర' గర్భంలో పెరుగుతున్న బిడ్డ ఒక్కడే, పాండవుల వంశాంకురంగా నిలిచి ఉన్నాడు. అశ్వత్థామ బ్రహ్మశిరాస్త్రంతో, ఆ బిడ్డను కూడా తల్లి గర్భంలో ఉండగానే చంపేశాడు. చనిపోయిన బిడ్డను ప్రసవించింది ఉత్తర. పాండవులకు వంశాంకురం కరువైనందుకు అందరూ ఎంతగానో విలపించారు. అప్పుడు కూడా శ్రీకృష్ణుడు ఆదుకున్నాడు. చనిపోయిన ఆ బిడ్డను బ్రతికించి, పాండవుల వంశాన్ని నిలిపాడు. (ఆ బిడ్డ పేరే పరీక్షిత్తు.) విధి విధానాన్ని అనుసరించి చేసిన సహాయమే ఇది. భగవంతుని భక్తవత్సలతకు పరాకాష్ఠ ఈ సంఘటన.

దేవుడు ఎంతవరకూ సహాయపడతాడనే విషయం ఈసారి అర్థమయింది కదా!

## ★ యుగాలు - ధర్మస్థాపన విధానాలు ★

కురుక్షేత్ర యుద్ధంలో తాను ఆయుధం పట్టననీ, యుద్ధం చేయననీ, తనకు తోచిన సలహాసహకారాల్ని మాత్రమే అందిస్తాననీ అర్జునుడికి ముందే చెప్పాడు శ్రీకృష్ణుడు.

ఎన్నో ఆయుధాలతో ఎన్నెన్నో యుద్ధాలుచేసి అనేక అక్షౌహిణీల పాపాత్ముల్ని వధించిన శ్రీకృష్ణుడు - ద్వాపరయుగం చివరకొచ్చేసరికి కురుక్షేత్ర యుద్ధ సమయాన తన పంథా మార్చుకున్నాడు. ఆయుధం పట్టలేదు. యుద్ధం చేయలేదు. కేవలం సలహా సహకారాలందించే శ్రేయోభిలాషిగా ధర్మపక్షాన నిలిచాడంతే! ఆయన ఇలాచేయడంలో ఎంతో పరమార్థం ఉంది. దాన్ని తెలుసుకుందాం ఇప్పుడు.

ధర్మసంస్థాపన కోసం భగవంతుడు అనుసరించే విధానాలు యుగయుగానికీ మారుతూ ఉంటాయి. శిష్టరక్షణ, దుష్టశిక్షణ చేయడానికి భగవంతుడు ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క రకమైన యుగధర్మాన్ని నెలకొల్పుకున్నాడు. దాన్నే ఆచరిస్తూ ఉంటాడాయన. యుగాలు మారుతున్నకొద్దీ అధర్మం పెరుగుతూ, ధర్మం క్షీణిస్తూ ఉంటుంది. దాన్నిబట్టే భగవంతుని జోక్యం కూడా యుగయుగానికీ మారుతూ ఉంటుంది. యుగాలు గడిచేకొలదీ దుష్టశిక్షణ, శిష్టరక్షణల కోసం భగవంతుడు తన ప్రత్యక్ష ప్రమేయాన్ని తగ్గించుకుంటూ, పరోక్షచర్యల్ని ఎక్కువ చేస్తాడు. ఈ విషయాన్ని మరింత వివరంగా చర్చిద్దాం.

## వివిధ యుగాల్లో కలి ప్రవర్తన :

కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అనే నాలుగు యుగాలున్నాయని మనకు తెలుసు. ధర్మానికి ప్రతీక అయిన ధర్మదేవత - కృతయుగంలో నాలుగు పాదాలతో నడుస్తుంది. చెడుకు ప్రతినిధి అయిన కలిపురుషుడు 'ధర్మదేవత'ను దెబ్బతీయాలని చూస్తూంటాడు. కృతయుగంలో అతని ఆటలేం సాగవు. అయితే త్రేతాయుగం వచ్చేసరికి ధర్మదేవత నాలుగు పాదాల్లో ఒక పాదాన్ని విరిచేస్తాడు కలిపురుషుడు. అందువల్ల త్రేతాయుగంలో ధర్మదేవత మూడు పాదాలతోనే సంచరిస్తుంది. ద్వాపరయుగం వచ్చేసరికి ధర్మదేవత మరో పాదాన్ని విరిచేస్తాడు కలి. అందువల్ల ద్వాపరయుగంలో ధర్మదేవతకు రెండే పాదాలు. కలియుగం వచ్చే సరికి ఇక చెప్పేదేముంది? ధర్మదేవతకు ఇంకో పాదాన్ని విరిచేస్తాడు కలి. ఆ కారణంగా ధర్మదేవత కలియుగంలో ఒంటి కాలిపై కుంటుతూ సంచరిస్తుంది. యుగయుగానికీ ఇలా ధర్మదేవతను దెబ్బతీస్తూ, కలిపురుషుడు లోకంలో పాపాన్ని పెంచుకుంటూ పోతుంటాడు. కలియుగం చివరిలో ధర్మదేవత నాలుగవ పాదాన్ని కూడా విరిచేస్తాడు కలి. కలి పురుషుడు విజయగర్వంతో స్వైరవిహారం చేసే ఆ కాలమే 'ఘోరకలి'. అప్పుడు మహావిష్ణువు 'కల్కి భగవానుని' రూపంలో అవతరించి కలిపురుషుణ్ణి వధించి, మళ్ళీ ధర్మ సంస్థాపన చేస్తాడు. తిరిగి కృతయుగం వస్తుంది. ధర్మం మళ్ళీ నాలుగు పాదాలా విలసిల్లుతుంది. (కలియుగ కాలం మొత్తం 4,32,000 సంవత్సరాలు. అందులో క్రీ.శ. 1998 నాటికి 5,100 సంవత్సరాలు గడిచాయి. కలియుగాంతానికి ఇంకా చాలా సమయం ఉందని గుర్తుంచుకోండి.)

ధర్మదేవత, కలిపురుషుడూ అంటే నిరాకారమైన శక్తులని మనం గ్రహించవలసి ఉంది. జీవులు అనుసరించే ధర్మ, పుణ్యకర్మలే 'ధర్మదేవత' అంటే! జీవులు ఆచరించే పాపకర్మలే 'కలిపురుషుడంటే'! కలిపురుషుడు ధర్మదేవతను దెబ్బతీయడమంటే - పాపాత్ములు విజృంభించి, ధర్మాత్ముల్ని దెబ్బతీయడమే! ధర్మదేవత పాదాలు తరిగి పోవడమంటే - లోకంలో పాపం పెరుగుతూ, ధర్మం అంతకంతకూ నశిస్తూ ఉంటుందని అర్థం. కలియుగంలో ధర్మదేవత ఒంటిపాదంపై కుంటుతుందని చెప్పుకున్నాం కదా! అంటే ధార్మికుల సంఖ్య మరీ తక్కువైపోతుందనీ, వారు వివిధ కష్టాలు పడుతూ ఉంటారనీ భావం. కలిపురుషుడు విజృంభించడమంటే ధర్మాన్ని అణచివేసే దుర్మార్గుల సంఖ్య పెరిగిపోతుందని అర్థం. నేటి కలియుగ రీతి ఇదేకదా మరి!

## వివిధ యుగాల్లో భగవంతుని పాత్ర :

పైన తెలిపిన యుగాల నడవడిక అంతా భగవంతుడు నడిపే జగన్నాటకమే! ఆయనకు ఇందులో పాత్ర అంటూ ఏమీ లేదు నిజానికి. ఆయన కేవలం సూత్రధారి మాత్రమే! అయితే మరీ అవసరమైనప్పుడు, పాత్రధారిగా కూడా దిగి వస్తుంటాడు. భువిపై దిగే "భగవంతుని అవతారం" అంటే అదే మరి!

నాలుగు యుగాల్లోనూ భగవంతుడు వ్యవహరించే తీరును ఒకసారి పరిశీలించి చూద్దాం.

## 1. కృతయుగం :

సోమకుడు, హిరణ్యాక్షుడు, హిరణ్య కశిపుడు మొదలయిన రాక్షసులు - విష్ణు భక్తులను హింసిస్తూ, ధర్మానికి హాని కల్గించేవారు. శ్రీమహావిష్ణువు ఒంటరిగానే మత్స్య, వరాహ, నరసింహ అవతారాల్ని దాల్చి, ప్రత్యక్ష పోరాటం జరిపి, ఆ రాక్షస ప్రముఖుల్ని చంపివేయడంతో సమస్య తీరి, శాంతి నెలకొనేది. ఆ యుగంలో అవతారం ఎత్తిన వెంటనే మహావిష్ణువు దుర్మార్గుల్ని చంపివేసేవాడు. అలా దుష్టశిక్షణ చేయగా, ఆ దుర్మార్గుల తరపున రెచ్చిపోయే వారెవరూ లేరు ఆనాడు. పైగా దుష్టశిక్షణ జరిగినందుకు అందరూ ఆనందించేవారు. అది కృతయుగ విధానం.

## 2. త్రేతాయుగం :

ఈ యుగాన ధర్మానికి హాని కల్గించినవారిలో ముఖ్యులు రావణాసురుడు, అతని పరివారం. వీళ్ళు విష్ణుభక్తులనే కాక, ఇతరులను కూడా హింసించేవారు.

ఈసారి కృతయుగం మాదిరిగా కాకుండా దుష్ట శిక్షణా విధానంలో మార్పు చేశాడు భగవంతుడు. ఎందుకంటే రావణుణ్ణి చంపినంతలో సమస్య తీరదు. అతని వెంట కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు, ప్రహస్తుడు మొదలైన రాక్షస వీరులెంతోమంది వున్నారు. వారందరినీ సమూలంగా చంపవలసిన అవసరం వుంది. అందువలనే ఈ సారి దుష్టుల సంహారానికి భగవంతుడు, ఒంటరిగా అవతారం ఎత్తలేదు. ఆదిశేషుడు అంశతో జన్మించిన లక్ష్మణుడు, శివాంశతో జన్మించిన హనుమంతుడు, ఇంకా అనేక దేవతల అంశలతో జన్మించిన వానర, భల్లూక సైన్యాలు మొదలగు వారందరితో కలిసి రాక్షస సంహారం చేసి, ధర్మాన్ని రక్షించాడు. పైగా ఇందులో మరో విశేషం వుంది. రావణాదుల సంహారం కోసం రామావతారాన్ని దాల్చిన మహావిష్ణువు దుష్టశిక్షణ వెనువెంటనే చేయలేదు. దుష్టుల పాపాలు పండే వరకూ ఆగాడు. తన భార్య అయిన సీతను అపహరించి హింసించాడనే నేరంపై, రావణుని మీద దండెత్తి, అధర్మాన్ని సమూలంగా నాశనం చేశాడు.

త్రేతాయుగంలో భగవంతునిది ఒంటరి అవతారం కాదు. మానవునిగా రామావతారం ఎత్తి - దేవతాంశల సహాయం తీసుకుంటూ, సమయ సందర్భాలకై వేచి వుండి, పాపం పండిన దుర్మార్గుల్ని వధించాడు. దుష్టశిక్షణకై భగవంతుడు త్రేతాయుగంలో అనుసరించిన విధానం అది.

## 3. ద్వాపరయుగం :

త్రేతాయుగం మాదిరిగా ఒక రాక్షసుడు, అతని బలగం కాకుండా ద్వాపరయుగాన రకరకాల దుష్టులు విజృంభించారు. కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు, కాలయవనుడు, నరకాసురుడు, కౌరవులు, వారి మద్దతుదారులు ... ఇలా ఎందరెందరో అధర్మపరులు పెచ్చు పెరిగిపోయారు ఈ యుగంలో. ధర్మ రక్షణకు భగవంతుడు దైవత్వంతో కూడిన కృష్ణావతారం ఎత్తాడు. దుష్టుల పాపాలు పండగానే, వారివారి నేరాల్ని ఎత్తిచూపిస్తూ, సంహారం సాగించేవాడు శ్రీకృష్ణుడు. దుష్టసంహారం స్వయంగా చేయడమే కాకుండా వివిధ దేవతాంశలతో పుట్టిన వారిచేత కూడా చేయించాడు. ద్వాపరయుగంలో పాపాత్ములు పలువిధాలుగా తయారుకావడంతో, దుష్టశిక్షణలో తన విధానాన్ని అలా మార్చుకున్నాడు భగవంతుడు. కాలం తీరిన దుర్మార్గుల్ని అంతం చేసేందుకు శ్రీకృష్ణరూపంలో ఇంచుమించు తన జీవితమంతా యుద్ధాలు చేశాడు, చేయించాడు. అంత చేసినా కూడా, ఇంకా పాపభారం పెరుగుతూనే వుంది.

పాపభారం పెరిగేకొలదీ భగవంతుడు తన ప్రత్యక్ష ప్రభావాన్ని తగ్గిస్తూ, పరోక్ష ప్రభావాన్ని పెంచుతుంటాడు. అందువల్ల ద్వాపరయుగం చివరికి వచ్చేసరికి ఆయన తన పంథాను మార్చుకున్నాడు. తాను స్వయంగా ఆయుధం పట్టడం, యుద్ధాలు చేయడం మానుకున్నాడు. అధర్మంతో పోరాడే ధర్మాత్ములకు (అనగా పాండవులకు) అండగా నిలబడ్డాడంతే! అలా ధర్మపక్షాన నిలిచి, అధర్మంపై కురుక్షేత్ర యుద్ధాన్ని జరిపించాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేశాడు.

ద్వాపరయుగాన కూడా భగవంతునిది ఒంటరి అవతారం కాదు. దుష్టశిక్షణకోసం తాను నడుంకట్టడమే కాకుండా, మరెందరికో ఆ ప్రక్రియలో పాలుపంచాడు. అంటే ఏ పని ఎవరిచేత ఎలాచేయిస్తే బావుంటుందో, అలా చేయించాడు. జరాసంధ వధ, కాలయవనుని వధ, సైంధవుని వధ, దుర్యోధనుని వధ మొదలైనవి ఇందుకు కొన్ని ఉదాహరణలు. త్రేతాయుగం కంటే కూడా భగవంతుడు ఇలా తన ప్రమేయాన్ని మెల్లగా తగ్గించుకుంటూ వచ్చాడు. యుగాంతంలోని కురుక్షేత్రయుద్ధ సమయానికి ఆయుధం పట్టకుండా, యుద్ధం చేయకుండా కూడా తప్పుకున్నాడు. ధర్మాత్ములచే అధర్మపరుల్ని అంతమొందింపజేశాడు.

దుష్టశిక్షణకై భగవంతుడు ద్వాపరయుగ ధర్మాన్ని అలా నిర్ణయించుకున్నాడు. ఆ యుగ ధర్మ ప్రకారమే శ్రీకృష్ణుడు కురుక్షేత్రంలో యుద్ధం చేయలేదు.

## 4) కలియుగం :

ఈ యుగం సంగతి వేరే చెప్పేదేముంది? ధర్మం ఒంటి పాదాన కుంటుతూ ఉండడం, మనం నిత్యం చూస్తూనే ఉన్నాం. నేడెక్కడ చూసినా కలియుగ రాక్షసులే! అంతటా అధర్మం, అరాచకాలేకదా రాజ్యమేలుతున్నాయి. స్వార్థం, పైశాచికత్వాలు అంతకంతకూ పెరిగిపోతున్నాయి. గత మూడు యుగాల దుర్మార్గులూ, ఈనాటి దుష్టుల దృష్టిలో 'హీరోలు'. విపరీతంగా వ్యాపించివున్న ఈ కలియుగ దుష్టగణాల్ని అంతం చేయడం అంత తేలికేం కాదు. ఊరు ఊరుకీ, వాడవాడకీ, సందుసందుకీ పాపాత్ముల సంఖ్య ఎక్కువౌతోంది. పాపభారం పెరిగేకొలదీ భగవంతుడు తన ప్రత్యక్ష ప్రభావాన్ని తగ్గిస్తూ, పరోక్ష ప్రభావాన్ని పెంచుతాడని తెలుసుకున్నాం కదా! పాపానికి దూరంగా జరుగుతూ, అంతకంతకూ ఆయన తన ప్రత్యక్ష ఉనికిని దూరం చేస్తాడు. అందువల్లనే కలియుగాన ఎంతపిలిచినా భగవంతుడు ప్రత్యక్షంగా రావడం జరగదు. ద్వాపరయుగం వరకూ అయితే పిలిచినంతనే భగవంతుడు ప్రత్యక్షమై

సహకరించేవాడు. పాపం విలయతాండవం చేసే ఈ కలియుగంలో భగవంతుడు తన పద్ధతిని మరింత విలక్షణంగా మార్చుకున్నాడు. ఆయన ప్రత్యక్షంగా ఎవరికీ కన్పించడు. కానీ ధర్మపక్షాన అదృశ్య రూపంలో ఉంటాడు. పుణ్యాత్ములకు సహకరిస్తాడు. పాపాత్ములను శిక్షిస్తాడు. అయితే ఇందుకోసం ఆయన ప్రత్యక్షంగా మాత్రం పూనుకోడు. అవతారం ఎత్తి కూడా రాడు. వివిధ రకాల సంఘటనలు సృష్టించడం ద్వారా ఆయన తన చర్యల్ని పరోక్షంగా నిర్వహిస్తూ ఉంటాడు. పాప పుణ్య కర్మలకు ఫలాలను ఇచ్చే వివిధ సంఘటనలు నిత్యం అన్నిచోట్లా జరుగుతూనే ఉంటాయి. వాటిలో భగవంతుని ప్రమేయం ఉందని మనం ఊహించం. నిజానికి ఆ సంఘటనల కర్త 'భగవంతుడే'! ఆయన కలియుగంలో ఈ విధంగా పరోక్ష పద్ధతి ద్వారా, జీవుల పాపపుణ్యాలకు ఫలితాల్ని వివిధ జన్మల్లో అందిస్తూ ఉంటాడు. కలియుగం చివరికొచ్చేసరికి కలి మరింత విజృంభించి ధర్మదేవత 4వ పాదాన్ని కూడా విరిచేస్తాడు. అప్పుడిక ధర్మం అనేది ఎక్కడా కన్పించదు. అంతటా దారుణమైన అరాచకత్వం తాండవిస్తుంది. అదే ఘోరకలి. అప్పుడు శ్రీమహావిష్ణువు కల్కి అవతారంలో వచ్చి పూర్తిగా పాపపంకిలమైపోయిన జీవరాశిమొత్తాన్ని కడతేరుస్తాడు. ఇదే కలియుగ ధర్మం. (ఈ కలియుగ ధర్మాన్ని సరిగా అర్థం చేసుకోలేక మనం అనేక సందర్భాల్లో భగవంతుణ్ణి శంకిస్తాం, నిందిస్తాం కూడా!)

(పాఠకులకు ఒక సూచన : పైన తెలిపిన "యుగధర్మాలనూ, కర్మఫలం-భక్తిఫలం, దేవుడెంతవరకూ సహాయపడతాడు? అనే వ్యాసాలనూ" జాగ్రత్తగా అవగాహన చేసుకోండి. భగవంతునిపై మనకుండే అపోహలు చాలావరకూ తొలగిపోతాయి.)

## ★ కలిని అదుపు చేసిన శ్రీకృష్ణుడు ★

కలిపురుషుడు ధర్మదేవత యొక్క మూడవ పాదాన్ని విరిచివేయడంతో ద్వాపరయుగాన ధర్మం రెండు పాదాలే నడచింది. రెండు పాదాల్లో మరోదాన్ని కూడా విరిచేయాలని కలిపురుషుడు ఎదురు చూసేవాడు. (యుగంలో పెరుగుతున్న అధర్మం గురించి ఇలా పోల్చబడిందని గ్రహించండి.) అధర్మాన్ని అణచివేస్తూ ద్వాపరయుగాన్ని కలి బారినుండి రక్షిస్తూ వచ్చాడు శ్రీకృష్ణుడు. పరమాత్ముడు తోడుగా ఉన్నంతవరకూ

దుర్మార్గులు దగ్గరకు రాలేరు కదా! అలాగే శ్రీకృష్ణుడున్నంతవరకూ ద్వాపరయుగంలో కలిపురుషుని ఆటలు సాగలేదు. లక్ష్యాలన్నీ నెరవేరిన అనంతరం శ్రీకృష్ణపరమాత్మ తన అవతారాన్ని చాలించాడు. దాంతో కలిపురుషుని విజృంభణకు అవకాశం ఏర్పడింది శ్రీకృష్ణుడు అవతారం చాలించిన క్షణం నుండీ "కలియుగం" ఆరంభమయింది అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు మహారాజు, కలిపురుషుని కొంతవరకూ అదుపు చేశాడు అయినా క్రమంగా ధర్మదేవత రెండో పాదం విరిచేసి, కలిపురుషుడే గెలిచాడు.

పరమాత్ముడున్నంత వరకూ ధర్మదేవతకు రక్షణ ఉంటుంది. కలి ప్రభావం విజృంభించలేదు అందువల్ల మన మనసులో ఎప్పుడూ భగవంతుణ్ణి నిలుపుకోవాలి. అప్పుడు కలిపురుషుని ప్రభావం మనపై పడదు. మనసులోంచి భగవంతుణ్ణిగాని తప్పించామంటే, మనం కలికి లొంగిపోయి పతనం కావడం ఖాయం. తస్మాత్ జాగ్రత్త!

## ★ ముసలం ★

పుట్టిన ప్రతిజీవీ మరణించక తప్పదు. ఎంత కీర్తి ప్రతిష్ఠలుగల వారయినా - ఎంత సంపద, అధికారాలు గలవారయినా - చివరకు దైవాంశసంభూతులైనా కూడా ఏదొక రోజు మరణాన్ని ఆహ్వానించక తప్పదు. ఇది భగవంతుడు ఏర్పరచిన విధివిధానం.

ద్వాపరయుగాంతం దగ్గరపడుతోంది. దుష్టశిక్షణ, శిష్టరక్షణలు జరిపి - భూభారాన్ని చాలావరకూ తగ్గించాడు శ్రీకృష్ణపరమాత్మ అవతార లక్ష్యాలన్నీ నెరవేరడంతో తన అవతార సమాప్తికి ఏర్పాట్లు మొదలెట్టాడాయన.

అప్పటికి భూమిపై మిగిలిన ఉన్న యోధుల్లో యాదవులు మహాబలవంతులు. వారి సైన్యం కూడా చాలా పెద్దది. శ్రీకృష్ణుని అండతో యాదవ కులం శత్రువులెవరూ కన్నెత్తి చూడలేనిదిగా, అజేయమైనదిగా ఉంటూ వచ్చింది. ఈ కారణంగా యాదవ వీరులకు అహంకారం పెరిగింది. బలగర్వంతో విర్రవీగుతున్నారు వాళ్ళు వారు అంతరించవలసిన సమయం ఆసన్నమయిందని గ్రహించాడు శ్రీకృష్ణుడు. స్వయంగా తానే వారందరికీ రక్షకుడు కనుక, ఇతరులెవరూ వారిని నశింపజేయలేరని ఆయనకు తెలుసు. అందుకు వారిలో వారే కలహించుకోవడం ద్వారా, యాదవకులాన్ని

నశింపజేయాలని ఆయన తలచాడు. (యాదవ కులం నశించిపోవాలని - మునులూ, గాంధారీ ఇచ్చిన శాపాలు శ్రీకృష్ణుని అభీష్టానికి అనుగుణంగా జరిగినవే )

## మునుల శాపం - ముసలం పుట్టుక :

ఒకనాడు విశ్వామిత్రుడు, అసితుడు, కణ్వుడు, దూర్వాసుడు, భృగువు, అంగీరసుడు, కశ్యపుడు, వామదేవుడు, అత్రి, వశిష్టుడు, నారదుడు మొదలైన మహామునులు పిండారక క్షేత్రానికి వెళ్ళారు. అక్కడ ఆటలాడుకుంటున్న యాదవ యువకులు కొంతమంది (కర్మవశాన) ఆ మునులను ఆటపట్టించాలనుకున్నారు. జాంబవతి కొడుకైన సాంబుడికి ఆడవేషం వేసి, గర్భవతిగా ఉన్నట్లు కడుపుకు చీరలవీ చుట్టి, మునులవద్దకు తీసుకువెళ్ళి "మహా మునులారా! తనకు ఏ బిడ్డ జన్మిస్తుందో అడగడానికి ఈమె సిగ్గుపడుతోంది. ఈమెకు మగబిడ్డ పుడతాడా? ఆడబిడ్డ పుడుతుందా? తమరు దైవజ్ఞులు కనుక చెప్పండి" అని పరిహాసం ఆడారు. యాదవ యువకుల నాటకం మునులకు అర్థమైపోయింది. వారిలో కోపం పెల్లుబికింది. "ఓరీ మూర్ఖులారా! ఈమెకు పుట్టేది ఆడపిల్లాకాదు, మగపిల్లవాడూ కాదు. మీ కులనాశనానికి కారణమయ్యే ముసలం పుడుతుంది. పొండి" అని శపించి వెళ్ళిపోయారు వారు. (ముసలం అనగా 'రోకలి' అని అర్థం.) వారి శాపానికి భయపడిపోయారు యాదవ యువకులు. జరిగినదంతా శ్రీకృష్ణుడితో చెప్పారు "అంతా విధి విధానం! మునులు చెప్పినట్లే జరుగుతుంది" అన్నాడాయన.

మరునాడు సాంబుని కడుపు నుండి ఇనుపరోకలి (ముసలం) బయటపడింది. దాన్ని చూసి యాదవులు భయంతో వణికిపోయారు విషయమంతా వసుదేవుడితో చెప్పారు. తమ కులనాశనానికి కారణంకానున్న ఆ రోకలిని ఏం చెయ్యాలా అని ఆలోచించారంతా. వసుదేవుని సూచన ప్రకారం, ఆ ఇనుపరోకలిని ముక్కలు ముక్కలు చేసి చూర్ణం చేశారు. ఆ చూర్ణాన్ని సముద్రజలాల్లో కలిపేశారు. అక్కడితో సమస్య తీరిపోయిందనుకుని శాంతించారు. ఎన్ని ఉపాయాలు పన్నినా, కాబోయే వినాశనం ఆగదని ఒక్క శ్రీకృష్ణునకే తెలుసు. ఆయన సంకల్పమే కదా ఇదంతా!

యాదవులు ఇనుపరోకలిని చూర్ణం చేసి సముద్రంలో పారవేసినప్పుడు, ఆ చూర్ణంలో ఒక ఇనుప ముక్క ఉండిపోయింది. సముద్రంలోని ఒక చేప దాన్ని మ్రింగింది. చేప మ్రింగిన ఆ ఇనుపముక్క కారణంగా శ్రీకృష్ణుడు తన అవతారాన్ని

ఎలా చాలించిందీ తర్వాత వ్యాసంలో తెలుసుకుందాం.

సముద్రంలో కలపబడిన మిగిలిన రోకలి చూర్ణమంతా అలలతాకిడికి ఒక ఒడ్డుకు కొట్టుకుని వచ్చి, పదునైన తుంగగడ్డి వలె మొలిచింది. నిలువెత్తు పెరిగిన ఆ తుంగ, కరకు కత్తుల వలె తయారయి, యాదవుల్ని నాశనం చేసేందుకు సిద్ధంగా ఉంది. దేవ, పితృ తర్పణాలు వదిలే నెపంతో యాదవులందరినీ ప్రభాస తీర్థానికి తీసుకువెళ్ళాడు శ్రీకృష్ణుడు. ముసలం వల్ల పెరిగిన తుంగ ఆ స్థలంలోనే ఉంది. అక్కడకు చేరుకున్న తర్వాత, విధివిధానాన్ని అనుసరించి యాదవులకు మతి చెడింది. వాళ్ళు అకారణంగా రెచ్చిపోతూ పరస్పర నిందలు చేసుకుంటూ, పోట్లాడుకున్నారు. దగ్గరున్న ఆయుధాలు ధ్వంసం కాగానే అక్కడున్న తుంగను పెరికి, దానితోనే ఒకరినొకరు కొట్టుకుని మరణించారు. శ్రీకృష్ణబలరాములు, యాదవ స్త్రీలు, వారి పిల్లలూ మాత్రం మిగిలారు చివరకు.

## ★ కృష్ణావతార సమాప్తి ★

తన కళ్ళముందే తనవాళ్ళంతా కొట్టుకుచావడం శ్రీకృష్ణునికి వ్యథను కలిగించకపోలేదు. ఎందుకంటే ఆయన అవతారం మానవ, దైవత్వాల కలయిక కదా! మనసులోని బాధను అణచుకుంటూ పరికించి చూశాడు. ఎటుచూసినా శవాల గుట్టలు! అందరూ తన వాళ్లే! తనంటే ప్రాణమిచ్చే అభిమానులే! కొన్ని క్షణాల క్రితం వారంతా తనకున్నారు. ఈ క్షణంలో ఎవరూలేరు. తనను ఒంటరి చేసి వెళ్లిపోయారు. చిన్నతనంలో తనను ముద్దుచేసి ఆడించిన పెద్దలూ, తన కుమారులూ, సోదరులూ, తనతో ఆటపాటల్లో కష్టసుఖాల్లో కలిసి జీవించిన బంధుమిత్రులూ... మొత్తం అందరూ రక్తంలో మునిగి విగతజీవులై పడిఉన్నారు. వారిపై పడి విపరీతంగా రోదిస్తున్న యాదవ స్త్రీలందరినీ చూశాడు. ఆయనలోని మానవ లక్షణం, దైవతత్వం క్షణకాలం పోటీపడ్డాయి. బాధను మౌనంగా తట్టుకున్నాడు. మానవ లక్షణంపై 'దైవతత్వం' గెలిచింది. 'తనవాళ్లెవరు? పై వాళ్లెవరు? అందరూ తనలో వాళ్లే! తాను నడిపే జగన్నాటకమే కదా ఇదంతా!' అనుకున్నాడు. తక్షణమే ఆయనలోని అభిమాన వ్యామోహాలు నశించాయి. భూభారాన్ని తగ్గించవలసిన తన యుగాంత లక్ష్యం పూర్తిగా నెరవేరిందని తృప్తిచెందాడు.

యాదవ స్త్రీలను ద్వారక తీసుకు వెళ్లి, వసుదేవుని సంరక్షణలో ఉంచాడు.

అప్పటికి ఏడవ రోజున 'ద్వారక' సముద్రంలో మునిగిపోతుందని ఆయనకు తెలుసు. అందువల్ల ద్వారకలోని వారందరినీ అక్కడ నుండి తప్పించి రక్షించవలసినదిగా అర్జునుడికి కబురుచేశాడు అలా తన బాధ్యతను నెరవేర్చుకుని, తిరిగి ప్రభాస తీర్థానికి చేరుకున్నాడు. యోగమార్గాన శరీరం వదలి వెళ్తున్న బలరాముణ్ణి చూశాడక్కడ. (మహావిష్ణువు శయనించే ఆదిశేషుడే బలరామునిగా జన్మించాడు ) బలరాముని ముఖం నుండి ఒక తెల్లని మహాసర్పం బయటకు వచ్చి, అది ఆదిశేషునిగా మారి, ఆకాశమార్గాన వెళ్ళిపోయింది. యాదవ కులనాశనం తర్వాత తను వైకుంఠానికి చేరుకుంటానని బ్రహ్మదేవునకూ, ఇంద్రాది దేవతలకూ ఇచ్చిన మాటను కృష్ణుడు గుర్తుకు తెచ్చుకున్నాడు

## కృష్ణావతార సమాప్తి ప్రత్యేకత

శ్రీకృష్ణుడు కూడా యోగమార్గంలో తన దేహాన్ని విడిచి, దివ్యంగా వెళ్ళిపోవచ్చు. కానీ ఆయన అలా చేయలేదు. భూమిపై మానవ జన్మ తీసుకున్నందున మరణం ద్వారానే తన అవతారాన్ని చాలించాలని నిర్ణయించుకున్నాడు యాదవులలో ఒకడైన తాను కూడా, ముసలం ద్వారానే అవతార త్యాగం చెయ్యాలని భావించుకున్నాడు అందుకు తగిన ఏర్పాట్లు అంతకు ముందునుండీ ఆయన చేసుకుంటూ వస్తున్నాడు. అవేమిటో కాస్త తెలుసుకుందాం ముసలాన్ని(ఇనుపరోకలిని) చూర్ణం చేసి సముద్రంలో కలిపినప్పుడు అందులో వాడియైన ఒక ఇనుప ముక్క ఉండిపోయిందనీ, దాన్ని ఒక చేప మ్రింగిందనీ ఇంతకుముందు చెప్పుకున్నాం కదా ఆ చేప ఒక కిరాతకుని వలలోచిక్కింది. వాడు దాన్ని కోశాడు దాని కడుపులోని ఇనుపముక్క బయటపడింది. అదెంతో వాడిగా, చక్కగా ఉండడంతో - దాన్ని ఆ కిరాతకుడు, తన బాణానికి ములికిగా చేసుకున్నాడు. ఆ బాణాన్ని తన అవతార సమాప్తి కోసం వినియోగించుకోదలచాడు శ్రీకృష్ణుడు. ముసలం ద్వారానే తన అవతారాన్ని చాలించాలని ఆయన సంకల్పం కదా మరి! హుందాగా మరణాన్ని ఆహ్వానిస్తూ . ఒక రావిచెట్టు మొదట్లో నేలపై పవళించి, కుడి మోకాలు మీద ఎడమ పాదాన్ని ఠీవిగా పెట్టుకున్నాడు అలా యోగనిష్ఠలో ప్రవేశించాడు ముసలంలోని ఇనుప ముక్కతో బాణం తయారు చేసుకున్న కిరాతకుడు వేటాడుతూ అటుగా వచ్చాడు చెట్లచాటు నుండి శ్రీకృష్ణుని పాద పద్మాన్ని చూసి, అక్కడ ఒక లేడి దాగున్నదని భ్రమించాడు వెంటనే తాను

తయారు చేసుకున్న బాణాన్ని సూటిగా ప్రయోగించాడు. అది రివ్వున దూసుకొచ్చి శ్రీకృష్ణుని అరికాలులో నాటుకుంది. కిరాతకుడు దగ్గరకు వెళ్ళి చూశాడు. తాను బాణం వేసినది కృష్ణపరమాత్ముని పైనని తెలుసుకుని, తన మహాపరాధానికి ఎంతగానో విలపించాడు తనను మన్నించమని ప్రార్థించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతన్ని ఓదారుస్తూ "నేను కోరుకున్న పనినే నువ్వు చేశావు, విచారించకు" అని చెప్పాడు కిరాతకుని భక్తికి మెచ్చి, ముక్తిని ప్రసాదించాడు. అనంతరం శ్రీకృష్ణుని శరీరం నుండి ఒక దివ్య తేజస్సు వెలువడి, ఆకాశ మార్గాన వైకుంఠానికి వెళ్ళిపోయింది ఆయన దివ్య రథమూ, గుఱ్ఱాలూ, గరుడ ధ్వజమూ, శంఖ చక్రాదులూ కూడా ఆయనను అనుసరించాయి. దేవ దుందుభులు మ్రోగాయి. దివి నుండి పూలవాన కురిసింది. కృష్ణావతార సమాప్తిని బ్రహ్మాది దేవతలంతా కనుల పండగగా చూశారు.

ఇందులో ఒక విశేషాన్ని గమనించాలి మనం. శ్రీకృష్ణుడు తన జీవితాంతం వరకూ ఎన్నో యుద్ధాల్లో నిలిచి, ఎన్నో ఆయుధాల దెబ్బలు తిన్నాడు ఆ గాయాల నుండి కారుతున్న రక్తధారలతో 'పూసిన మోదుగవృక్షం' వలె కన్పించేవాడు అలాంటప్పుడు కూడా కాస్తయినా చలించేవాడు కాదాయన. అటువంటి వజ్రకాయుడు కేవలం పాదంలో బాణం గ్రుచ్చుకున్నంత మాత్రాన ప్రాణాన్ని కోల్పోతాడా! యథార్థానికి అది జరగని పని! అయితే అవతారాన్ని వదలి పెట్టేందుకు శ్రీకృష్ణుడు సృష్టించుకున్న వంక అది ఆ వంక సృష్టించుకోవడంలో ఒక పరమార్థం ఉంది. శ్రీకృష్ణుణ్ణి గెలవడం, చంపడం ఎవరికీ సాధ్యం కాదు కదా! పైగా ముసలం ద్వారానే తన మరణాన్ని ఆహ్వానించదలచుకున్నాడు. అందువల్ల పూర్వజన్మ పుణ్యఫలం గల ఒక కిరాతకుని ఎన్నుకుని, ముసలంలోని ఇనుప ముక్క అతని చేతికి ఆయుధంగా వచ్చే ఏర్పాటు చేసుకున్నాడు. దాని ద్వారా అవతారాన్ని చాలించాడు. అదీ సంగతి! (కృష్ణావతారం వయస్సు 120 సంవత్సరాలని భాగవతం ద్వారా తెలుస్తోంది.)

(శ్రీకృష్ణుడు పంపిన ఆజ్ఞమేరకు ద్వారకలోని వారందరినీ తరలించి తీసుకుపోయాడు అర్జునుడు కృష్ణావతార సమాప్తి జరిగిన వారం రోజులకు సముద్రంలో మునిగిపోయింది ద్వారక. ద్వాపరయుగాన సముద్రంలో మునిగిన ద్వారకా పట్టణం ఇటీవలి చారిత్రక పరిశోధనల్లో బయటపడింది. భారతీయ సముద్ర గర్భ పురావస్తుశాఖ అధిపతి శ్రీ యస్. ఆర్. రావుగారు తన బృందంతో జరిపిన పరిశోధనల్లో గుజరాత్ సమీపాన అరేబియా మహాసముద్రంలో

మునిగివున్న ద్వారక అవశేషాలు బయటపడ్డాయి. ఈ ద్వారకా నగరానికి పూర్వ వైభవాన్ని కల్పించేందుకు ప్రస్తుతం ముమ్మరంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. దేశ, విదేశాలకు చెందిన పురావస్తు శాస్త్రవేత్తల బృందం ఈ దిశగా కృషి చేస్తోంది. సముద్రగర్భంలో వున్న ద్వారకను పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చేయాలని ప్రయత్నిస్తున్నారు.)

## ★ కష్టజీవి శ్రీకృష్ణుడు ★

కృతయుగంలో శ్రీరామునిగా మనకెన్నో ఆదర్శాల్ని బోధించిన శ్రీమహా విష్ణువే మళ్ళీ ద్వాపర యుగంలో శ్రీకృష్ణునిగా పుట్టి ఎన్నో బాధల్నీ, కష్టాల్నీ అనుభవిస్తూ - మనకెన్నో ధర్మ సందేశాల్ని అందించాడు.

శ్రీకృష్ణునిది విలాసజీవితం అనుకుంటారు ఎంతోమంది. నిజానికి శ్రీరామునికంటే హెచ్చు సందర్భాల్లో కష్టనష్టాల్ని చవిచూసినవాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడు తానెన్ని కష్టాలు పడినా కూడా, ఏనాడూ ముఖాన చిరునవ్వు చెదరకుండా నిలిచాడు. ఆ చిరునవ్వు కారణంగానే ఆయన కష్టాలు, మనకు కష్టాలుగా కనిపించవు. శ్రీరాముని జీవితమే మనకు కష్టాలమయంగా కన్పిస్తుంటుంది. ఈ విషయంపై ఒకసారి దృష్టి సారిద్దాం.

శ్రీరాముని శైశవం, బాల్యం, బహుసుఖంగానే గడిచాయి. సీతను వివాహమాడిన అనంతరం కొన్నేళ్ళు సుఖపడ్డాడు. ఆతర్వాత 14 సంవత్సరాల అరణ్యవాసం, ఉత్తర కాండలో 14 సంవత్సరాల సీతా వియోగం. . . ఇవీ శ్రీరామునికొచ్చిన కష్టాలు. శ్రీరాముడు కొంతకాలం కష్టాలు అనుభవించినా, ఆయన సుఖపడిన సంవత్సరాలు చాలా ఉన్నాయి.

ఇక శ్రీకృష్ణుని సంగతి చూద్దాం. పైకి సుఖంగా, హాయిగా వున్నట్లు కనిపించినా పుట్టింది మొదలు దేహత్యాగం చేసేవరకూ కూడా ఎన్నో కష్టాలు, సమస్యలతో మనశ్శాంతి కూడా కరువై, స్థిర జీవనం లేకుండా కాలం గడిపాడు శ్రీకృష్ణుడు. ఆ వివరాల్ని క్లుప్తంగా తెలుసుకుందాం.

శ్రీకృష్ణుడు పుట్టక ముందే అతని సోదరులు దారుణంగా చంపబడ్డారు. తల్లి, తండ్రి, తాత చెరసాలలో క్రుంగిపోయారు. శ్రీకృష్ణుడు పుట్టడమే ఖైదీగా పుట్టాడు.

పుట్టిన మరునిముషమే తల్లిదండ్రులకు దూరమయ్యాడు. అనేక కష్టాలతో ద్రేపల్లెకు వలసపోయాడు చూశారా! పురిటికందుకే ఎన్నికష్టాలో?

కేవలం కొన్ని రోజుల వయసులోనే శ్రీకృష్ణునిపై మొదటగా హత్యాప్రయత్నం చేసింది పూతన. అప్పటి నుండీ శ్రీకృష్ణుడికి దినదిన గండంగానే గడిచింది. శ్రీకృష్ణుడి శైశవదశ, బాల్యదశ కూడా- శకటాసురుడు, తృణావర్తుడు, వత్సకుడు, బకాసురుడు, శుదర్శనుడు, వృషభాసురుడు, కేశి, వ్యోమాసురుడు మొదలైన ఎందరో రాక్షసుల తోనూ, శంఖచూడుడనే యక్షునితోనూ, కాళీయుడు అనే సర్పరాజుతోనూ పోరాటాలతోనే సరిపోయింది. పెంచుకున్న తండ్రిని వరుణుడు అపహరించినప్పుడు శ్రీకృష్ణుడు వరుణనగరం వెళ్ళి, వరుణుణ్ణి జయించి నందుని విడిపించాడు తన గురుపుత్రుని తిరిగి బ్రతికించి తీసుకురావడానికి నరకానికి వెళ్ళి, యముడికే ఎదురు నిలిచాడు సంవత్సరం పాటు తానే గోవులుగా గోపాలురగా జీవించి బ్రహ్మదేవుని గెలిచాడు ఇంద్రుని యెదిరించి తన వారిని కాపాడేందుకు గోవర్ధన గిరినే పెకలించి, ఏడు రోజులు ఆ పర్వతాన్ని మోశాడు.

యవ్వన దశ ఆరంభంలో మధురానగరం చేరాడు. అక్కడ కువలయాపీడమనే ఏనుగును, కృష్ణుని చంపేందుకు పంపించాడు కంసుడు. కానీ శ్రీకృష్ణుడే ఆ ఏనుగును చంపాడు. ఆ తర్వాత చాణూరునితో పోరాటం. వాణ్ణి చంపాక, కంసునితో పోరాటం. కంసవధతో శ్రీకృష్ణుని సమస్యలు తీరాయనుకుంటే పొరపాటే మరి!

కేవలం పదహారేళ్ళ నాటికే యిన్ని గండాలు, కష్టాలు, సమస్యలూ వస్తే ఎంత దుర్భరమో ఆలోచించండి.

జరాసంధునితో వరుసగా 17సార్లు భీకర యుద్ధం చేయవలసి వచ్చింది. అన్నిసార్లూ శ్రీకృష్ణుడే గెలిచాడు. కానీ క్షణం విశ్రాంతి లేకుండా పోయింది. అంతలోనే కాలయవనుడనే గర్విష్ఠిని అంతం చేయవలసి వచ్చింది. యుద్ధాల వల్ల ప్రజాశ్రేయస్సుకు విఘాతం కలుగుతోందని భావించిన శ్రీకృష్ణుడు తన రాజ్యాన్ని మధుర నుండి ద్వారకకు మార్చాడు. అనంతరం రుక్మిణిని వివాహమాడేందుకు ఆమె అన్న రుక్మితో పోరాడాడు. సత్యభామను పొందిన సంఘటనలో స్యమంతకమణిని అపహరించాడనే నిందనూ, ఒక హత్యానేరాన్నీ మోశాడు ఎన్నో కష్టాలుపడి పరిశోధించి స్యమంతకమణిని సాధించి తెచ్చి, తనపై నిందల్ని పోగొట్టుకున్నాడు. జాంబవతిని పెళ్ళాడేముందు జాంబవంతునితో భీకర పోరాటం చేశాడు నాగ్నజితి (నీల)ను పెళ్ళాండేందుకు మదించిన ఆబోతులతో

పోరాడాడు. జీవితమే ఒక పోరాటమయింది శ్రీకృష్ణునికి. చివరకు సంసారజీవితంలో కూడా ఎన్నో ఒడిదుడుకుల్ని తట్టుకున్నాడు. భార్యల మధ్య అసూయలూ, వైషమ్యాలూ ఎన్ని ఎదురైనా ప్రశాంతంగా చిరునవ్వు లొలికిస్తూనే, ఎవరికి వారిని సమర్థిస్తున్నట్లు నటిస్తూనే, చక్కటి గుణపాఠాల్ని నేర్పుకొచ్చిన మగధీరుడాయన. సత్యభామ కోరిన పారిజాతవృక్షం కోసం ఇంద్రునితో యుద్ధంచేసి గెలిచాడు చెల్లెలు సుభద్ర వివాహ విషయంలో బలరామునిచే నానా మాటలూ పడ్డాడు ప్రజాకంటకుడైన నరకాసురునితో ఘోర యుద్ధం చేసి, అతన్ని వధించాడు. దుష్టుడూ, అహంకారీ అయిన పౌండ్రకుణ్ణి అంతమొందించాడు. జరాసంధుని భీమునిచే చంపించాడు. శిశుపాలుణ్ణి కడతేర్చాడు. ఏకలవ్యుణ్ణి వధించాడు అనంతర కాలంలో సాళ్వుడనే రాజు, శ్రీకృష్ణునిపై దండయాత్ర చేశాడు. వాడు తపస్సు చేసి శివుని వరం పొంది, శివ ప్రసాదిత విమానంపై వచ్చి ద్వారకపై దాడి చేశాడు. ఆ యుద్ధంలో సాళ్వుణ్ణి వధించాడు శ్రీకృష్ణుడు ఆ తర్వాత దంతవక్రుడు, విదూరథుడు మొదలైన దుష్టులెందరినో మట్టుబెట్టాడు

తన కుమారుడైన సాంబుడి వివాహ విషయంలో కౌరవులతో వైరం తప్పలేదాయనకు తన మనుమడైన అనిరుద్ధుని వివాహ విషయంలో బాణాసురుని తోనూ, సాక్షాత్తూ శివుడితోనూ కూడా యుద్ధం చేయవలసి వచ్చింది.

నమ్ముకున్న పాండవుల కోసం కురుక్షేత్ర సంగ్రామంలో తన శరీరం నుండి రక్త ధారలు కార్చాడు. ఆయుధం పట్టకుండా, యుద్ధం చేయకుండా శత్రువుల ఆయుధాల దెబ్బలు తిన్నాడు కురుక్షేత్రంలో దుష్టజన నాశనం పూర్తయినా, శ్రీకృష్ణుడి కష్టాలు తీరలేదు.

కురుక్షేత్ర యుద్ధం జరిపించినందుకు గాంధారిచేత శపించబడ్డాడు. యదువంశం నాశనమైపోవాలని శపించిందామె. శ్రీకృష్ణుడు నవ్వుతూనే, ఆ శాపాన్ని కూడా స్వీకరించాడు. ఏమాత్రం కోపం తెచ్చుకోలేదు, బాధ పడలేదు యాదవ కుల నాశనానికి ముసలం పుట్టింది. తన కళ్ళముందే తన సోదరులు, బంధువులు, మిత్రులు, కుమారులు, మనుమలు యావన్మందీ ఒకరినొకరు నరుక్కుంటూ చచ్చి పీనుగులై పోతున్నా, విధి విధానాన్ననుసరించి అలా చూస్తూ నిలబడ్డాడాయన.

సోదరుడైన బలరాముడు కూడా ఆయన ముందే శరీరాన్ని విడిచి వెళ్ళి పోయాడు అలాంటి సమయంలో పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించి చూడండి. శ్రీకృష్ణుని జీవితమేమీ పూలపాన్పు కాదు దారుణమైన ముళ్ళబాట.

ఆయన జీవితం కులాసాగా గడిచిందో, అష్టకష్టాలతో గడిచిందో ఈసారి మీరే చెప్పండి.

మనకు చిన్న కష్టం వస్తే చాలు, ఎంతో బాధపడి పోతాం. ఆ కష్టాలకు బాధ్యుడు దేవుడేనని నిందిస్తాం. నేటి కథల్లో, వ్యాసాల్లో ఇదే విధమైన దైవనింద కనిపిస్తుంది. ఇక సినిమా పాటల్లో, మాటల్లో చెప్పనవసరం లేదు. "ఉన్నావా? అసలున్నావా? ఉంటే కళ్ళుమూసుకున్నావా? " "నీకేం! గుడిలో హాయిగా కులుకుతున్నావు", " నీభార్యలతో కులుకుతూ నన్నే మరచి పోయావు" "నువ్వే మనిషై పుడితే తెలిసేది, ఈ మానవుల కష్టాలు", "మనిషిగా పుట్టి కష్టాలుపడలేక గుడిలో రాయిగ మారావు".. ఇలా అనేక విధాల దేవుని నిందిస్తూ, హేళన చేస్తూ పాటలూ, మాటలూ రచించడం బాగా అలవాటయిపోయింది నేటి రచయితలకి.

కానీ భగవంతుడు శ్రీరామునిగా, శ్రీకృష్ణునిగా మానవ రూపం దాల్చి - మానవులకంటే ఎక్కువ కష్టాలూ, సమస్యలూ అనుభవించి చూపించాడు. శ్రీకృష్ణుడు అనుభవించిన కష్టాల్లో వందోవంతు కష్టాలు పడిన మానవులెవరైనా వున్నారా? ఆయన ఎదుర్కొన్న సమస్యల్లో కనీసం వెయ్యోవంతయినా సమస్యలు చవిచూసిన వారున్నారా? శ్రీకృష్ణునిపై పడినన్ని నిందలు, ఆరోపణలు ఎవరు మోశారు?

నేటి మానవుల్లో యే ఒక్కరైనా సరే శ్రీకృష్ణుని స్థానంలో వుంటే - ఆయన పడిన వేదనలు, బాధలు, సమస్యలూ భరించగలిగేవారా?

మన ఆత్మీయుల్లో ఏ ఒక్కరు మరణించినా "జాతస్య మరణం ధృవం" అని తెలిసి కూడా, భోరున విలపిస్తూ దైవాన్ని నిందిస్తాం మనం.

తన వారెందరో తన కళ్ళ ముందే మరణించడం చూశాడు శ్రీకృష్ణుడు. వంశం యావత్తూ... కుమారులు, మనుమలు... సోదరులతో సహా అందరూ తన కళ్ళముందే దారుణంగా మరణిస్తున్న దృశ్యాన్ని చూశాడాయన. అలాంటి దృశ్యం చూసి ఎవరైనా సహించగలరా? కష్టపడి నిర్మించుకున్న ద్వారక కొద్ది రోజుల్లో సర్వనాశనం కానున్నదని ఆయనకు తెలుసు. తన వారెవరూ మిగలరనీ తెలుసు. బలరాముడు తనకంటే ముందే లోకాన్ని విడిచి వెళ్ళిపోతాడనీ తెలుసు. తమ స్త్రీలు, పిల్లలంతా అనాధలవుతారనీ తెలుసు. తనకు చివరి ఘడియలు వచ్చాయనీ తెలుసు. ఇన్ని తెలిసినప్పుడు హృదయంలో ఎలా వుంటుందో... చివరి క్షణాల్లో

ఆ ఒంటరి వ్యక్తి చవి చూసే మనోవ్యథ ఎంత దారుణమైనదో మీరు ఊహించగలరా? ఈ దైవనింద చేసే మానవులెవరైనా శ్రీకృష్ణుని స్థానంలో వుంటే యేం చేస్తారు? అకస్మాత్తుగా గుండె పగిలి చస్తారు.

నీతులూ, ధర్మాలూ చెప్పడం తేలికే! కానీ ఆచరించడం కష్టం. కష్టాల్లో నిగ్రహం చూపాలని చెప్పడం తేలికే! అనుభవించడం కష్టం. కానీ శ్రీకృష్ణ భగవానుడు అన్నీ ఆచరించీ, భరించీ చూపించాడు.

శ్రీకృష్ణుని పేరు వినగానే గోపికలు, రాసలీలలు, వెన్న దొంగతనాలు, బృందావన విహారాలు, అష్ట భార్యలు... ఇవే గుర్తుకొస్తాయి మనకు. "జీవితమంటే నిజంగా శ్రీకృష్ణుడిదే! అమ్మాయిలతో వెన్నెల షికార్లు, బృందావనంలో ఆటపాటలు... అలా వుండాలి జీవితమంటే..." అనుకుంటూ కొంతమంది అజ్ఞానంతో వాపోతుంటారు. శ్రీకృష్ణుని జీవితం గురించి వారికి ఏమాత్రం తెలుసునని? ఆయన అనుభవించిన వాటిలో ఒక చిన్న కష్టాన్ని కూడా, నిజ జీవితంలో మనం భరించలేం. కష్టాల్లో ధీరోదాత్తంగా నిలబడిన వారికే సుఖాలందుకునే అర్హత, అవకాశం వుంటాయి.

"దైవాన్ని విమర్శించే హక్కు, నిందించే అధికారం మనకు లేవు. మనం పడే కష్టాలు దేవుడ్నుపడిన కష్టాల ముందు ఒక లెక్క కానే కాదు". మనం శ్రీకృష్ణపరమాత్మ లోని ధీరోదాత్తతను అలవరచుకోవాలి. స్థిత ప్రజ్ఞులం కావాలి. అందుకోసం కావలసిన మనోబలాన్ని మనకిచ్చేందుకే శ్రీకృష్ణుడు ఇంత జగన్నాటకం ఆడి చూపించాడు.

## ★ త్యాగశీలి శ్రీకృష్ణుడు ★

యుగయుగాల్లో ధర్మరక్షణార్థం భగవంతుడు అవతారాల్ని దాలుస్తూ ఉంటాడు. ఒక్కొక్కసారి భగవంతునిగానే ప్రత్యక్షంగా దిగివస్తాడు. మరోసారి మానవునిగా అవతరిస్తాడు. త్రేతాయుగంలో రామునిగానూ, ద్వాపరయుగంలో శ్రీకృష్ణునిగానూ మానవునిగానే దిగివచ్చాడు. అయితే ఆ రెండు అవతారాల్లో ఒక వ్యత్యాసం ఉంది. రామావతారం సంపూర్ణ మానవ లక్షణాలను కలిగి ఉంటుంది కృష్ణావతారం మానవలక్షణాలతో పాటూ దైవత్వాన్ని కూడా కలిగిఉంటుంది మానవ లక్షణాలతో

దైవత్వాన్ని జోడించి నడచుకోవడమంటే అదొక విశేషమే! ఒక ప్రక్క మానవ లక్షణాలైన అనురాగబంధాలు లాగుతూ ఉంటాయి. మరోప్రక్క దైవత్వ నియమాలు, ఆ అవతారంలో సాధించవలసిన లక్ష్యాలూ వెంటాడుతుంటాయి. ప్రేమాభిమానాల్లో అనురాగబంధాల్లో ఎక్కడికక్కడ చిక్కుకుపోకుండా లక్ష్యసాధనకు ముందుకు పోవలసిఉంటుంది ఈ ప్రకారంగా శ్రీకృష్ణుడు తన జీవితంలో ఎన్నో బంధాల్నీ, అనుబంధాల్నీ, ప్రేమాభిమానాల్నీ, ఆప్యాయతలనూ త్యాగం చేయవలసి వచ్చింది. తన అవతార లక్ష్యాల్ని సాధించడానికి ఆయన చేసిన త్యాగాలు నిరుపమానం. పుట్టినంతనే తప్పనిసరి పరిస్థితుల్లో కన్నవారి ప్రేమకు (దేవకీ వసుదేవులకు) దూరం కావలసి వచ్చింది. ఆ తర్వాత అయినా పెంచిన తల్లిదండ్రులయిన యశోదానందులవద్ద ఉండగలిగాడా అంటే - అదీ లేదు. కర్తవ్య పాలనకై మధురకు వెళ్ళిపోయాడు. ఆ సమయాన తన బాల్యమిత్రుల, గోపికల అభిమాన ఆప్యాయతలకు బలవంతంగా దూరమయ్యాడు. ఎందరెందరి ప్రేమాభిమానాలనో బలవంతాన త్యాగం చేసిన దీక్షాపరుడాయన.

అధికారహోదాల మధ్య అనంతమైన సంపదలతో, సుఖసౌఖ్యాలతో శ్రీకృష్ణుని జీవితం గడిచిందని సాధారణంగా మనం భావిస్తూ ఉంటాం. సుఖం, విశ్రాంతీ లేని జీవితాన్ని శ్రీకృష్ణుడు ఎలా గడిపాడో 'కష్టజీవి శ్రీకృష్ణుడు' అనే వ్యాసంలో చదివారు కదా! దేని గురించీ కూడా తిరిగి వెనక్కి చూసే అవకాశం లేని జీవితం ఆయనిది. కర్తవ్య నిర్వహణలో కష్టాలనెదుర్కొంటూ చిరునవ్వుతో త్యాగదీక్షతో ముందుకు సాగిపోవడమే కృష్ణావతార లక్ష్యం. పాయసంలో గరిటెలాంటి జీవితం అంటారు చూడండి, అలా గడిచింది ఆయన జీవితం. పాయసంలో ఉండే గరిటె, పాయసంలో మునిగి ఉండి - అందులోనే తిరుగుతూ ఉంటుంది. అయితే ఏం లాభం? ఆ పాయసం రుచివంతంగా తయారయ్యేంత వరకూ, దాన్ని కలియబెట్టడం వరకే దాని పాత్ర. ఆ విధంగానే శ్రీకృష్ణుడు కూడా - భూమండలమందలి సకల రాజ్యాలకూ క్షేమం కలిగేలా తన పాత్రను నిర్వహించాడు తప్ప, ఎన్నో అవకాశాలు వచ్చినా ఏ రాజ్యాన్నీ కాజేయలేదు. కనీసం ఆశించలేదు కూడా! లోక కంటకులైన ఎందరో రాజుల్నీ, చక్రవర్తుల్నీ ఆయన సంహరించాడు. సంహరింపజేశాడు. వారివారి రాజ్యాలన్నీ ఆయన పాదాక్రాంతమయ్యేవి. తలచుకుంటే అవన్నీ ఆయన స్వంతమే! కానీ ఆయన ఏ రాజ్యాన్నీ కబళించలేదు. ఆయన అత్యంత "త్యాగశీలి". తాను కంసుణ్ణి హతమార్చినప్పుడు, ఆ రాజ్యాన్ని కంసుని తండ్రి అయిన ఉగ్రసేనుడికే తిరిగి

అప్పగించాడు. గ్రీకు చక్రవర్తి కాలయవనుణ్ణీ, అతని సైన్యాలనూ అంతం చేసినప్పుడు ఆయన చూపు గ్రీకు దేశం వైపు మరలనే లేదు. నరకాసురుణ్ణి వధించి, ఆ రాజ్యాన్ని నరకుని పుత్రుడైన భగదత్తునికే ఇచ్చివేశాడు. కరూశదేశం రాజైన పౌండ్రక వాసుదేవుణ్ణీ, అతని స్నేహితుడైన కాశీరాజునూ సంహరించాడు. వారి రాజ్యాలవైపు కన్నెత్తయినా చూడలేదు. మగధ సామ్రాజ్యాధిపతి జరాసంధుణ్ణి అంతం చేయించాడు జరాసంధుని కుమారుడైన సహదేవునికే ఆ సామ్రాజ్యాన్ని కట్టబెట్టాడు. శిశుపాలుణ్ణి చంపాడు. అతని పుత్రునికే ఆ రాజ్యాన్ని ఇచ్చివేశాడు. సాల్వుణ్ణి అంతం చేశాడు అతని రాజ్యాన్ని ఆశించలేదు. చూశారా! శ్రీకృష్ణుని త్యాగశీలత! పాండవులు తమ సామ్రాజ్యాన్నీ, సంపదలనూ శ్రీకృష్ణునకు సమర్పించడానికి ఎప్పుడూ సిద్ధమే కానీ ఆయన ఏనాడయినా ధర్మాత్ముల క్షేమమే కోరాడు తప్పించి - ఎవరి సంపదలనూ, రాజ్యాలనూ ఆశించలేదు. ఆయనే తలచుకుంటే భూమండలానికి చక్రవర్తి అయిఉండేవాడు. కానీ అటువంటి ఆశ, ఆయనకేనాడూ లేదు.

దుర్మార్గుల దాడుల వల్ల తన మధురలోని ప్రజలకు సుఖజీవనం కరువైందని, మధురను వదిలివేసి, ఎక్కడో దూరంగా 'ద్వారక' అనే చిన్న దీవిలోకి వెళ్ళి స్థిరపడ్డాడు. దానికయినా తాను రాజు కాలేదు. తన తాతగారినే ద్వారకకు రాజుగా చేశాడు.

చూశారా! శ్రీకృష్ణుని త్యాగనిరతికి ఇంతకంటే నిరూపణలు ఇంకేం కావాలి?

## ★ అజాత శత్రువు శ్రీకృష్ణుడు ★

శ్రీకృష్ణుడు ఎందరినో అంతమొందించాడు. మరెందరినో అంతమొందింప జేశాడు. అలాంటప్పుడు ఆయన అజాత శత్రువెలా అవుతాడని సందేహం రావచ్చు. కేవలం అధర్మపరుల అంతానికే ఆయన కృషి చేశాడనేది మనం ముందుగా గుర్తించ వలసిన విషయం శ్రీకృష్ణుడంటే అధర్మపరులకు శత్రుత్వం ఉందేమో గాని, వారి మీద ఆయనకు మాత్రం ఏ కక్షా, శత్రుత్వమూ లేవు. ఏనాడూ కూడా ఆయన అధర్మపరుల పట్ల పరుషంగాకూడా మాట్లాడి ఎరుగడు. వారితో నవ్వుతూనే మాట్లాడేవాడు. (రాక్షసులతోగాని, కంసునితోగాని, కౌరవులతోగాని, శిశుపాల జరాసంధాదులతో గాని, విదేశీయుడైన కాలయవనునితోగాని... ఇలా ఏ పాపాత్మునితోనైనా సరే ఆయన చిరునవ్వుతోనే మాట్లాడేవాడు.) అయితే కేవలం దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసేందుకు, భూమిపై పాపభారాన్ని తగ్గించేందుకూ వారిని శిక్షించాడంతే!

అయితే ఇందులో మరో విషయం కూడా ఉంది. సన్మార్గులు, దుర్మార్గులతో సహా విశ్వంలోని సమస్తమూ శ్రీకృష్ణునిలోని (అనగా మహావిష్ణువులోని) అంతర్భాగమే కదా ఆ ప్రకారంగా ఆలోచించి చూస్తే - దుష్టశిక్షణ అనగా భగవంతుడు వేరే ఎవరినో హతమార్చడం కానేకాదు. తనలోని పాడైన భాగాన్ని, ఆయన తనకు తానుగా తొలగించుకోవడమే అని గ్రహించండి భగవంతుడు తనకు తాను స్వయంగా చేసుకునే ఆపరేషన్ అది. మరి అటువంటప్పుడు ఆయనకు వేరే శత్రువులెలా ఉంటారు? అందువల్ల ఏ విధంగా ఆలోచించి చూసినా - శ్రీకృష్ణుడు 'అజాత శత్రువే'!

❦ ❦ ❦

## ★ ఆదర్శప్రాయుడు శ్రీకృష్ణుడు ★

శ్రీకృష్ణుడు మనకు ఆదర్శప్రాయుడనే మాట వినగానే, నేటి ఆకతాయి మూకలకు - కృష్ణుని భార్యలు, గోపికలూ గుర్తుకొస్తారు. కృష్ణుని ఆదర్శంగా తీసుకోవడమంటే - వందలాది, వేలాది స్త్రీలతో వెకిలి వేషాలు వేయడమని వాళ్ళ వెర్రి ఊహ! గోపికా వస్త్రాపహరణంలోని అంతరార్థం వారికి తెలియదు. కృష్ణుడు కామాన్ని జయించిన మహాపురుషుడనీ, అస్ఖలిత బ్రహ్మచారి అనీ వారెరుగరు. కృష్ణునికి అంతమంది భార్యలెందుకున్నదీ కూడా వారికర్థం కాదు. మూర్ఖ జీవులకు మాదిరిగానే, భగవంతునికి కూడా స్త్రీ అనేది భోగవస్తువని భ్రమపడతారు వాళ్ళు. భగవంతునితో మామూలు మనిషిని పోల్చడానికి ప్రయత్నిస్తారు. అది వారి అజ్ఞానం. ఈ శ్రీకృష్ణగీత పుస్తక పఠనమే వారి అజ్ఞానానికి మందు.

సరే ... ఇక ఆ సంగతలా ఉంచి, అసలు విషయానికొద్దాం. ద్వాపరయుగాంతాన ధర్మాన్ని రక్షించడానికి, భూమిపై పాపభారం తగ్గించడానికి మహావిష్ణువు ఎత్తిన అవతారం - "కృష్ణావతారం".

కృష్ణుడు మానవునిగా జన్మనెత్తినా కూడా దైవత్వాన్ని వదులుకోలేదు. ఆయన సాగించిన లీలలు ముఖ్యంగా 3 విధాలు.

### 1. దైవశక్తి చూపిస్తూ ధర్మసంరక్షణకై చేసిన లీలలు:

అధర్మపరులను అంతమొందించడం, ధర్మాన్నీ మరియూ భక్తులనూ కాపాడడం మొదలగు లీలలు

**2. క్రీతంలో భక్తులకిచ్చిన వరాలకు అనుగుణంగా చేసిన లీలలు:**

దేవకీవసుదేవులకు జన్మించడం, యశోదానందుల్ని తన బాల్య క్రీడలతో మురిపించడం, బాల్యమిత్రులతోనూ, గోపికలతోనూ ఆటపాటలు సాగించడం.

**3. మానవులకు ఆదర్శాలుగా నిలిచేందుకు చేసిన లీలలు:**

అంతరార్థాలు కలిగిన చేష్టల ద్వారా స్వార్థం, అహంకారం మొదలైన దుర్గుణాల్నీ మరియూ మాయామోహాల్నీ వదులుకోమని బోధించడం, గర్వం అనేది బుద్ధి నాశనానికి హేతువని తెలియజెప్పేందుకై, అనేక మందికి వివిధ రకాలుగా గర్వభంగాలు చేయడం, అన్ని వర్ణాల వారితో అన్యోన్యంగా కలసిమెలసి తిరగడం.

పైన తెలిపిన మూడు రకాల లీలల్లో మొదటి రెండు రకాల్నీ - ఆయన భగవంతు నిగా ఆచరించాడు ఇక మూడవ రకమైన లీలలు మాత్రం, మానవాళికి ఆదర్శంగా ఉండేందుకు చేశాడు.

కృష్ణుడు మనకు చూపిన ఆదర్శాల్ని గురించి క్లుప్తంగా ఒకసారి చెప్పుకుందాం.

కష్టాల్లోనూ, సుఖాల్లోనూ ఆయన ఒకేవిధంగా ప్రవర్తించాడు. స్థితప్రజ్ఞత అంటే అదే! జీవితంలో ఎన్ని ఒడిదుడుకులెదురైనా ఆయన చిరునవ్వును వదిలి పెట్టలేదు. ప్రశాంతతను వీడలేదు. అటువంటి ధీరోదాత్తత అలవరచుకోవాలి మనం. సంపదలకూ, అధికారాలకూ వశం కాకుండా నిలచిన ఆయన 'త్యాగశీలత' మనకు ఎప్పటికీ ఆదర్శమే! కేవలం అధర్మంపై తప్ప, వ్యక్తిగతంగా శ్రీకృష్ణునికి ఎవరి మీదా శత్రుత్వమూ, ద్వేషమూ లేవు ఇది మనం బాగా గుర్తుంచుకోవలసిన విషయం అభిమానించే వారిని ఆదరించడం లోనూ, నమ్మిన వారి క్షేమం చూడడంలోనూ ఆయన ప్రథముడు. లక్ష్యసాధన కోసం, కర్తవ్య నిర్వహణ కోసం ప్రేమానురాగాల్ని త్యాగం చేసిన దీక్షాపరుడు. వర్ణాలకూ, కులాలకూ అతీతుడు నిగర్వి మరియూ అల్ప సంతోషి. అభిమానానికి తప్ప అంతస్థులకు విలువనివ్వని సంస్కారి. (విదురుని ఇంటి అతిథ్యం స్వీకరించడం, కుచేలుని అటుకులు ఆరగించడం వంటి సంఘటనలు ఇందుకు తార్కాణాలు.)

ఆయన ఆపద్బాంధవుడు, అనాథరక్షకుడు. తన, పర అనే భేదం లేని న్యాయనిర్ణేత. తన కుమారుడైన నరకాసురుని లోకహితం కోసం వధించడం, యుగధర్మాన్ని పాటించడానికి ముసలం ద్వారా తన జాతిని బలిపెట్టడం, తాను కూడా ముసలం ద్వారానే అవతారాన్ని చాలించడం - ఆయన సమన్యాయానికి నిదర్శనాలు

అధర్మం తాండవిస్తున్నప్పుడు భయపడకుండా నిలవడం, సమయం చూసి ఉపాయంతో దాన్ని అంతమొందించడం - శ్రీకృష్ణుని నుండి మనం నేర్వవలసిన విద్య.

శ్రీకృష్ణుని చతురత, సందర్భోచిత ప్రవర్తన, వీరత్వం, దయాగుణం ... మొదలైన వన్నీ మనకు ఆదర్శప్రాయాలే!

చూశారా శ్రీకృష్ణుడు మనకు ఎన్ని విధాల ఆదర్శప్రాయుడో!

## ★ ఉపసంహారం ★

శ్రీమహావిష్ణువు కృష్ణావతారం దాల్చి, సుమారు 5వేల సంవత్సరాలయింది. మనకు, భగవంతుని సమీప అవతారం ఇదే! శ్రీకృష్ణుడు పురాణకాలం వాడేమీ కాదు. ఖచ్చితంగా కాలాన్ని లెక్కించగలిగిన చారిత్రక కాలంవాడే! శ్రీకృష్ణుని జీవితకాల సంఘటనలకు, స్పష్టమైన ఖగోళ ఆధారాలున్నాయి మహాభారతంలో ఇవ్వబడిన ఖగోళ స్థితిగతులు శ్రీకృష్ణగాథను స్పష్టమైన 'చరిత్ర' (History)గా నిరూపిస్తున్నాయి. భారతంలో ఇవ్వబడిన ఖగోళ గతులను విదేశీ చరిత్రకారులు పరిశీలించి చూశారు. ఇప్పటికి 5వేల సంవత్సరాల వెనక్కి గ్రహగతుల లెక్కలు కట్టి, అవన్నీయథార్థాలుగా ఒప్పుకున్నారు. [ఇందుకుసంబంధించిన పూర్తి వివరాల కోసం డాక్టర్ ఎక్కిరాల వేదవ్యాస, I A S , Ph D గారి "మహాభారత కాలనిర్ణయం", "యుగపురుషుడు (శ్రీకృష్ణునిపై చారిత్రక పరిశోధన)" అనే పుస్తకాల్ని చదవండి.] మహాభారతాన్నీ, శ్రీకృష్ణగాథనూ 'చరిత్ర' (History)గా ఒప్పుకునేందుకు ఆ విదేశీయులకు మనసొప్పలేదు. భారతీయులకు ఘనమైన ప్రాచీన చరిత్ర ఉండడం, విదేశీయులకు ఎప్పుడూ కంటకమే! భారతాన్నీ, కృష్ణచరిత్రనూ ఇతిహాసాలంటూ- కాలం నిర్ణయించని పురాణకాలంవైపు నెట్టివేశారు ఇక్కడ మన దుర్భాగ్యం ఏమంటే- మనదేశ చరిత్ర, మనం వ్రాసుకున్నది కాదు. దాన్ని ఆంగ్లేయులు వ్రాశారు మన దేశ చరిత్ర కాలాలనూ, ఘనతనూ తమకు నచ్చినట్లుగా వ్రాసిపెట్టి వెళ్ళిపోయారు వాళ్ళు. ఆ చరిత్ర పాఠాల్నే బట్టీపడుతూ, డిగ్రీలు పాసవుతున్నాం మనం. అదీ సంగతి! సరే... ఆ విషయం అలా ఉంచి, కృష్ణావతార విశేషాల ముగింపు చర్చలోకి వద్దాం.

మహావిష్ణువు యొక్క దశావతారాల్లో విలక్షణమైనది కృష్ణావతారం. ఆ విలక్షణ అవతారంపై సలక్షణమైన విశ్లేషణ చేయడం - కత్తిమీద సాము అనే చెప్పాలి.

కృష్ణావతారంపై పొగడ్తలెన్ని ఉన్నాయో, విమర్శలు కూడా అన్నే ఉన్నాయి. భగవంతుని తత్వాన్ని అర్థం చేసుకోవడం మనిషికెప్పుడూ కష్టమే! పైగా కృష్ణావతార లీలలు అంతరార్థాలతో ఉంటాయి. అవి అందరికీ సులభంగా అర్థం కావు శ్రీమహావిష్ణువు ఈ అవతారంలో చేసినన్ని లీలలు, మరే అవతారంలోనూ చేయలేదు చమత్కార లీలలు, ధీరోదాత్తమైన లీలలు, భక్తవత్సలత మరియు ప్రేమాభిమానాలు కలిగిన రసమయ లీలలు, వీరశూరభరిత లీలలు, కఠోర లీలలు, భావాత్మక లీలలు ... ఇలా ఎన్నో విధాలైన లీలల్ని సాగించాడు శ్రీకృష్ణపరమాత్మ. మానవత్వము, దైవతత్వాల మేలుకలయికగా రూపొందిన ఈ అవతారాన్ని 'సంపూర్ణావతారం'గా చెప్పవచ్చు.

మానవునిగా జన్మనెత్తిన శ్రీకృష్ణుడు తన దైవత్వాన్ని అనేకసార్లు నిరూపించి చూపాడు. అవతారం ఎత్తిన మరుక్షణం నుండీ అవతారసమాప్తి వరకూ దైవశక్తిని చూపించాడాయన. "వ్రేపల్లె ప్రయాణం లోనూ, రాక్షసుల సంహారంలోనూ, యశోదకు తన నోటి యందు సకల లోకాలూ చూపడం లోనూ, తానే గోపబాలురుగానూ మరియు గోవులుగానూ మారి సంచరించడం లోనూ, గోవర్ధనగిరిని ఎత్తడం లోనూ, గురుదక్షిణ చెల్లించేందుకు గురుపుత్రుని నరకం నుండి తిరిగి తీసుకురావడంలోనూ, కంసుడు హతమార్చిన తన సహోదరుల్ని పాతాళలోకం నుండి తిరిగి తీసుకొచ్చి దేవకీమాతకు చూపించడంలోనూ, విశ్వరూప ప్రదర్శనలోనూ, చనిపోయిన పరీక్షిత్తును తిరిగి బ్రతికించడంలోనూ, తన అవతార సమాప్తికి సహకరించిన కిరాతకునికి సశరీర మోక్షప్రాప్తి కల్గించడంలోనూ..." ఇలా అనేక సందర్భాల్లో ఆయన తన దైవత్వాన్ని స్వయంగా చూపించాడు.

ఆధ్యాత్మిక ప్రబోధానికి పరాకాష్ఠ అయిన 'గీత'ను లోకానికి ప్రసాదించాడు శ్రీకృష్ణుడు. ఆయన 'గీత'లో తన గురించి వివరిస్తూ, "నేనే భగవంతుణ్ణి. ఈ జగతి స్థితిలయములకు నేనే కారకుణ్ణి. ఇదంతా నా మాయచే కల్పించబడుతోంది. మహా యోగులకు కూడా నన్ను తెలుసుకోవడం మిక్కిలి కష్టం. నిష్కాములై నన్ను శరణువేడండి. సమస్త భారం నామీద వేసి, ధర్మంగా నడచుకోండి. మీ యోగక్షేమాలన్నీ నేను స్వయంగా చూస్తాను మీకు ఏ చింతా ఉండదు. చివరకు మోక్షాన్ని ప్రసాది స్తాను" అని ఘంటాపథంగా చెప్పడం జరిగింది. కర్మ, భక్తి, జ్ఞాన యోగాల ద్వారా మోక్షాన్ని ఎలా సాధించవచ్చునో భగవద్గీత వివరిస్తోంది. 18 అధ్యాయాలు గల భగవద్గీతలో కేవలం ఆధ్యాత్మిక విషయాలే కాదు, అద్భుతమైన సైన్స్ విషయాలు కూడా ఎన్నో ఉన్నాయి. (వివరాలకు మా "పురాణాల్లో సైన్స్" పుస్తకం చూడండి.)

భగవంతుని ప్రత్యక్ష అవతారం భూమిపైకి దిగివచ్చి లీలలు సాగించడం కృష్ణావతారంతోనే ముగిసింది. ఆ తర్వాత యుగధర్మం ప్రకారం, భగవంతుడు తన ప్రత్యక్ష ప్రమేయం వదులుకున్నాడు. (కలియుగంలో భగవంతుని ప్రమేయం పరోక్షంగా మాత్రమే ఉంటుంది.) ఈ విషయాన్ని గ్రహించలేని కలియుగ మూర్ఖులు, దేవునిపై విమర్శలకు దిగుతున్నారు. ఆధ్యాత్మిక విజ్ఞాన రంగంలో అ... ఆ... లు రాని అప్రయోజకులు వారంతా. వారి అజ్ఞానాన్ని అంతమొందించడానికీ, విజ్ఞానుల భక్తిని పెంపొందించడానికీ వ్రజాయుధంగా ఈ "శ్రీకృష్ణగీత"ను ప్రయోగిస్తున్నాం.

యథార్థానికి శ్రీకృష్ణ చరిత్రపై సరైన విశ్లేషణాగ్రంథం వ్రాయాలంటే, ఏడు తరాలకాలం కూడా సరిపోదు. ఒకవేళ అంతగా కష్టపడి ఒక మహాగ్రంథం వ్రాసినా, దాన్నిచదివే ఓపిక ఎవరికుంటుంది? మనదంతా స్పీడుయుగం కదా! 'కట్టె-కొట్టె-తెచ్చె' అన్నట్లుగా చెప్తేనే దేనినైనా స్వీకరిస్తాం, లేకుంటే లేదు. అందుకే సులభశైలిలో క్లుప్తమైన విశ్లేషణ మాత్రమే అందించాం. ఆ శ్రీకృష్ణపరమాత్మ తన అవతారం ద్వారా మానవాళికి అందించిన సందేశాల సారమే ఇది.

కృష్ణావతారాన్ని అర్థం చేసుకోవడంలో ఈ చిరు గ్రంథం మీకు ఎంతవరకూ తోడ్పడినదీ మాకు తెలుపండి. ఎక్కడైనా సందేహాలొస్తే అడగండి.

**"మీ ప్రోత్సాహమే, భవిష్యత్తులో మా ఉత్సాహం."**

*"ఓం నమోభగవతే వాసుదేవాయ".*


✿✿✿✿✿✿✿✿✿✿✿ రచయితల చిరునామా: ✿✿✿✿✿✿✿✿✿✿✿

**పోలిశెట్టి బ్రదర్స్,**

**17-3-6, గౌరీ కోనేరు వద్ద, పెద్దాపురం - 533 437.**

**తూర్పుగోదావరి జిల్లా (ఆంధ్రప్రదేశ్)**

**ఫోన్: (08858) 41495.**

ఓం

# ప్రపంచ పుస్తక చరిత్రలో అద్భుతాలు

# "భారతీయ శంఖారావం ప్రచురణలు"

మనకు అందకుండా పోతున్న ప్రాచీన భారతీయ
విజ్ఞానాన్ని సులభశైలిలో అందిస్తున్నాయి
**'భారతీయ శంఖారావం ప్రచురణలు'.**

"హిందూ సంస్కృతిని పునరుజ్జీవింపజేస్తున్న
ఈ క్రింది పుస్తకాల్ని చదవండి! చదివించండి!!"

భారతీయ శంఖారావం - 1 .... "పురాణాల్లో సైన్స్".
భారతీయ శంఖారావం - 2 .... "హైందవ కాలమానం".
భారతీయ శంఖారావం - 3 .... "శ్రీకృష్ణగీత".

భారతీయ శంఖారావం - 1.

## "పురాణాల్లో సైన్స్"

- పోలిశెట్టి బ్రదర్స్.

★ పురాణాల్లో టెస్ట్ ట్యూబ్ బేబీలు ★ వేదకాలంలో కరెంటు ★ నేటి అణుబాంబుల్ని మించిన అలనాటి అస్త్రాలు ★ బెర్ముడా ట్రయాంగిల్‌ను పోలిన రామాయణకాలపు రాక్షసి ★ అలనాటి కృత్రిమ వర్షాలు ★ రాడార్‌లు - దివ్యదృష్టి ★ అలనాటి ఆకాశ, అంతరిక్ష విహారాలు ★ టి.వి.వంటి చాక్షుసి విద్య...ఇంకా ఇలాంటి విశేష అంశాలెన్నో ఉన్న పుస్తకం ఇది! రామాయణం, మహాభారతం, భాగవతం, చతుర్వేదాల్లో

దాగివున్న ఆధునిక సైన్స్ విషయాలెన్నింటినో తెలుసుకోవచ్చు మీరు.

దేశ, విదేశాల్లోని వివిధ రంగాలకు చెందిన మేధావుల ప్రశంస లందుకుంటూ పునర్ముద్రణలు పొందుతున్న ఈ పుస్తకం, ఇతర భారతీయ భాషల్లోకి అనువదించబడనున్నది.

ఈ పుస్తకంలోని అంశాలు 'ఇంటర్‌నెట్'లో స్థానం సంపా దించడం మరో విశేషం.



## భారతీయ శంఖారావం - 2.

# "హైందవ కాలమానం"

## (జనవరి ఫస్ట్ Vs ఉగాది)

-పోలిశెట్టి బ్రదర్స్.

★ శాస్త్రీయమైన సంవత్సర ఆరంభం ఏది? (జనవరి 1వ తేదీయా? ఉగాదా?) ★ ఉగాది మరియు పంచాంగాల విశిష్టత ఎటువంటిది? ★ క్యాలెండరు అనేది ఎప్పుడు, ఎలా పుట్టింది? అది ఎన్నెన్ని మార్పులు చెందింది? ★ ఇంగ్లీషు నెలలు, తెలుగు నెలల పేర్లెలా వచ్చాయి? ★ తిథుల పేర్లు, వారంలోని ఏడురోజుల పేర్లెలా వచ్చాయి? ★ లీపు సంవత్సరం ఎందుకు ఎలా ప్రవేశ పెట్టబడింది? ★ ఏప్రిల్‌ఫూల్ ఆచారం ఎందుకొచ్చింది?..... ఇలాంటి ఎన్నో ప్రశ్నలకు జవాబిస్తుంది ఈ పుస్తకం.

విశిష్టమైన స్వదేశీ పరిజ్ఞానాన్ని మరచిపోతూ, వెర్రిగా పాశ్చాత్య వ్యామోహంతో పరుగులెడుతున్న నేటి తరానికి ఒక మేలుకొలుపు ఈ పుస్తకం.

"Sri Krishna Geetha" by " Polisetty Brothers"

శ్రీకృష్ణుడంటే తెలుసు అందరికీ!
ఆయన చేష్టల అంతరార్థాలు తెలిసింది ఎందరికి?

కృష్ణ పరమాత్మ జీవితంపై కనీవినీ ఎరుగని రీతిలో
అద్భుత విశ్లేషణగా వెలువడిన
ఈ "శ్రీకృష్ణగీత" పుస్తకం - కేవలం మీ కోసమే!

ఆధునిక కాలానికి అన్నివిధాలా సరిపడేలా అందిస్తున్న ఆధ్యాత్మిక, విజ్ఞాన తరంగం ఇది.







రచయితలు

పోలిశెట్టి బ్రదర్స్

శ్రీమహావిష్ణువు "కృష్ణావతారం" దాల్చి, 5 వేల సంవత్సరాల పైగా కాలం గడిచింది. అయితే ఆ అవతారాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నవారు మాత్రం చాలా అరుదు. చెరగని చిరునవ్వుతో ధర్మసంస్థాపన కోసం కృషి చేసిన శ్రీకృష్ణ పరమాత్మ, ఆనాడూ ఈనాడూ కూడా అజ్ఞానుల వక్రదృష్టి వల్ల ఎన్నో నిందలకు గురికావడం జరుగుతూనే ఉంది. అమ్మాయిల వెంట తిరిగే జులాయిగాళ్ళనూ మరియు కిలాడీగాళ్ళనూ, దొంగలనూ 'శ్రీకృష్ణునితో' పోల్చడం నేటి సమాజంలో ఫ్యాషనైపోయింది. కథల్లో, నవలల్లో, ముఖ్యంగా మన తెలుగు సినిమాల్లో శ్రీకృష్ణునిపై మూర్ఖమైన చెణుకులు విసురుతూ - అది ఓ గొప్పగా భావించుకుంటున్నారు.

అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న అలాంటి అభాగ్యులను వెలుగుబాట వైపు నడిపించేందుకు కాంతి కిరణంలా దూసుకువచ్చింది - "శ్రీకృష్ణ గీత."

అవతారం ఎత్తిన క్షణంనుండీ అవతార సమాప్తి వరకూ శ్రీకృష్ణుని ప్రతి చేష్టలోనూ ఒక గుణపాఠం కన్పిస్తున్నదనీ, ఆయన్ని వేలెత్తి చూపగల శక్తి ఎవరికీ లేదనీ ఈ పుస్తకం ద్వారా ఎలుగెత్తి చాటుతున్నారు రచయితలు.

ఇది విజ్ఞానుల భక్తికి పై కప్పు !
అజ్ఞానులకో కనువిప్పు !!

Ramsha-Siriesha Publications, Samalkot 533 440. Ph: 27474